# మనము – మనన్రుత్యాలు

(తెలుగు విశ్వవిద్యాలయం వారి పురస్కారం పొందిన రచన)

1993

రచన
పోలవరపు కోటేశ్వరరావు

ప్రజాశక్తి బుక్ హౌస్
కారల్ మార్క్స్ రోడ్,
విజయవాడ-520 002.

మనము మనస్మృత్యాలు

ప్రచురణ నెం: 307
ముద్రణ 1992 ఫిబ్రవరి


వెల: సాదాప్రతి : రు. 20.00
మేలుప్రతి : రు. 30.00

ప్రతులకు
ప్రజాశక్తి బుక్‌హౌస్,
కారల్‌మార్క్స్ రోడ్,
విజయవాడ 520 002

ముద్రణ
యుగంధర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ.



# డాక్టర్ కాకర్ల సుబ్బారావు గారు

మానవుల శారీరక రుగ్మతలను తొలగించటానికి రాత్రింబవళ్ళు
కృషి చేస్తూ, మానసికోల్లాసానికి,
జాతి జీవన సౌందర్యానికి, లలిత కళలను ప్రోత్సహిస్తూ,
మంచిమనిషిగా, మానవతావాదిగా, మమతానురాగాల మహామనీషిగా
మసలుతున్న
శ్రీ కాకర్ల సుబ్బారావుగారికి
నా రచన
మనము – మనన్రుత్యాలు
అంకితమిస్తున్నాను.

పోలవరపు కోటేశ్వరరావు

# మనము మననృత్యాలు



తెలుగు విశ్వ విద్యాలయం

పురస్కారపత్రం

శ్రీ పోలవరపు కోటేశ్వరరావు గారికి

1989 సం॥ బాలసాహిత్యం

(మనము మన నృత్యాలు) పురస్కారం

ప్రదానం చేయబడ్డింది.

హైదరాబాద్
17-4-1990

డా. పి. నారాయణరెడ్డి
వైస్‌ఛాన్సలర్
తెలుగు విశ్వవిద్యాలయం



# అభినందన

చదివింది అర్థం చేసుకోవాలి. అర్థమయింది మననం చేసుకోవాలి. మననం వల్ల కలిగిన జ్ఞానాన్ని అర్థవంతమైన పదాల్లో అభివ్యక్తం చేసే నేర్పు అలవరచుకోవాలి. అప్పుడే చెప్పినదానికి సార్థక్యం, సాఫల్యం.

కోటేశ్వరరావుగారిలో ఈ నేర్పు దట్టంగా వుంది. తనకు తెలిసిన విషయాన్ని తేటగా, పాఠకుడి గుండెకు నాటేట్టు చెప్పే ఒడుపు ఈయనకు బాగా అలవడింది.

నృత్యం ఒక లలితలలిత కళారూపం. ఆ నృత్యానికి సంబంధించిన అంగోపాంగాలను గురించి శాస్త్రాలే వెలువడ్డాయి; నాటి భరతుని నాట్యశాస్త్రం మొదలుకొని నేటి నటరాజ రామకృష్ణ గ్రంథాల వరకు. కోటేశ్వరరావుగారు సమస్త నాట్యశాస్త్ర సామగ్రిని అధ్యయనం చేసి, ఆకళించుకుని పరమ పఠనీయశైలిలో ఈ గ్రంథం రాశారు. ఓ చేయితిరిగిన రచయిత నవల చదివినంత సుఖంగా ఉంటుంది ఈ పుస్తకం చూస్తుంటే. కారణం? తనకు తెలిసింది ఇతరులకు తెలిసేట్టు చెప్పడమే.

నృత్యం పుట్టుకమొదలుకొని, తెలుగునాట ఆ కళ పొందిన బహుముఖీన వికాసం గురించి ఈ గ్రంథంలో చాలా అందంగా చెప్పారు. అలాగే తాండవ బేధాలను, జానపదనాట్యరీతులను గురించి, ఆంధ్రదేశంలోని ప్రాచీన అర్వాచీన క్షేత్రాలను గురించి, కళారంగంలో శృంగస్థితిలో వున్న వ్యక్తులను గురించి చాలా రుచికరంగా వివరించారు.

కమ్మని కథనగుణం ఉండడంవల్ల సమాచార సమృద్ధంగా ఉన్న ఈ గ్రంథం సామాన్యుల మనసు కెక్కేటంత రమణీయంగా రూపొందింది.

మన నృత్యాలను గురించి ఇంత చక్కని గ్రంథం రచించిన కోటేశ్వరరావుగారికి నా అభినందన.

– సి.నారాయణరెడ్డి



## మెచ్చదగిన ముచ్చట

మూడు దశాబ్దాల క్రిందట మొట్టమొదటిసారిగా పండితులకు, సామాన్యులకు, పెద్దలకు, పిన్నలకు అందరికీ సులువుగా అర్థమయ్యే తెలుగు వాడుక భాషలో నృత్యంపైన గ్రంథాలు రాశాను. వాటిలో "నర్తనబాల"కు భారత ప్రభుత్వం వారి ప్రథమ బహుమతి లభించింది. ఆ గ్రంథం భారతదేశంలోని నాట్యకళాకారులందరినీ ఆకర్షించింది. ఆ గ్రంథాన్ని ఆంగ్లభాషలోనికి తర్జుమా చేసి ప్రచురించమని భారత ప్రభుత్వం వారు కోరారు. అప్పుడు ఆ గ్రంథాన్ని "డాన్సింగ్ బెల్స్" అన్న పేరుతో ఆంగ్ల భాషలో ప్రచురించాను. దానికూ్కడా ప్రథమ బహుమతి లభించింది. ఒకే గ్రంథానికి రెండుసార్లు ప్రథమ బహుమతి లభించడం అరుదు. చాచా నెహ్రూగారికి ఆ గ్రంథాన్ని అంకితమిచ్చాను. ఆయన ఆ గ్రంథాన్ని చూసి చాలా మెచ్చుకొన్నారు.

ఆ తర్వాత నర్తనసీమ, నర్తనభూమి, నర్తనకథ అనే గ్రంథాలను రాశాను. వాటికీ బహుమతులు వచ్చాయి. అటు పిమ్మట నేను పోటీల నుండి విరమించుకొన్నాను. ఇతరులకు బహుమతి లభించే అవకాశం లభించాలని అభిలషించాను. కాని నా తర్వాత ఇతరులు ఎవ్వరూ బాలల కోసం నాట్యం మీద గ్రంథాలు రాయలేదు. మూడు దశాబ్దాల అనంతరం శ్రీపోలవరపు కోటేశ్వరరావుగారు అతి సులువుగా అర్థమయ్యే వ్యవహారిక భాషలో "మనము–మననృత్యాలు" అనే ఈ గ్రంథాన్ని రాశారు.

శ్రీకోటేశ్వరరావుగారి కుమార్తె చిరంజీవి నవత నా వద్ద "ఆంధ్రనాట్యం" అభ్యసించింది. సెంట్రల్ యూనివర్శిటిలో నృత్యకళలో ఎం.ఎ. పాసయి, నా పర్యవేక్షణలో పి.హెచ్.డి. చేస్తూ ఉంది. శ్రీకోటేశ్వరరావుగారు నాతో అనేక నృత్యకళా విషయాలను గురించి చర్చించేవారు. వారెన్నో నాట్యకళకు సంబంధించిన గ్రంథాలను చదివారు. అనేక నృత్యప్రదర్శనలను చూశారు. నాట్యకళను క్షుణ్ణంగా అర్థం చేసికొని ఈ గ్రంథం రాశారు. తెలుగు యూనివర్శిటీ వారి పోటీలలో ఈ గ్రంథానికి ప్రథమ బహుమతి లభించింది. బాలసాహిత్యానికి మరొక ఉత్తమ గ్రంథాన్ని అందించిన శ్రీకోటేశ్వరరావుగారిని అభినందిస్తున్నాను.

ఇట్లు,
భరతకళాప్రపూర్ణ,
డా॥నటరాజరామకృష్ణ.

హైదరాబాద్ – 20,
25.11.91.



"శ్రీ పోలవరపు కోటేశ్వరరావుగార్కి మన సంస్కృతి పట్ల ఆసక్తి చాలా విరివిగా ఉంది. ముఖ్యంగా నృత్యాలంటే ఆయనకు చాలా అభిమానం. వాటి గురించి కొంత తెలుసుకొన్నారు. తాము తెలుసుకొన్నది అందరికీ చెప్పాలన్న ఆకాంక్ష ఆయనకు ఉంది. అందుకే మనమూ- మన నృత్యాలు అనే ఈ గ్రంథాన్ని రచించారు. గోరు ముద్దలు తినిపించే వయసు నుంచి తాయిలాలు మెచ్చే వయసు దాకా ఉన్న చిరంజీవులకు ఈ పుస్తకం ఉద్దేశించారు. వారి ఉద్దేశం ఫలప్రదం అవుతుందని ఆశిస్తున్నాను."

— ఆరుద్ర.



# లయరూపం

'మనము - మన నృత్యాలు' రచించిన శ్రీ పోలవరపు కోటేశ్వరరావు సాంస్కృతిక రంగంలో బహుముఖ ప్రజ్ఞాశాలిగా రూపొంది, సహృదయుల్లో మంచి స్థానాన్ని సంపాదించుకున్నాడు. ఒకటి కంటే మించిన సాహితీ ప్రక్రియల్లో ఆయన తన కలం నడిపేడు. వివిధ కళలతో పరిచయం ఉన్న కళామర్మి ప్రత్యేకించి, నృత్య కళాభిజ్ఞుడు, నృత్య ప్రదర్శనకాదు ఆయనది. దాన్ని గురించిన రచన ఆయనది.

ఈ గ్రంథం సమీక్షాత్మక రచనకు చెందినప్పటికీ దాన్ని గ్రంథకారుడు సృజనాత్మక మాధురికి దూరంకాకుండా రచించాడు. ఇది మాన్యుల నిమిత్తంకాక, సామాన్యుల నిమిత్తం రచించబడింది, సరళశైలి, విస్పష్ట విశదీకరణ, భోగట్టా ప్రాధాన్యత, చారిత్రిక వాస్తవికత మొదలైన లక్షణాలు ఈ రచనలో ప్రాధాన్యాలయినాయి.

నృత్యం అనే నెపంతో ఈ గ్రంథంలో గ్రంథకారుడు ఎన్నో, మరెన్నో విషయాలను చెప్పటం జరిగింది. భారతదేశాన్ని గురించి, ఆర్యులరాకను గురించి, ద్రావిడులను గురించి, నృత్యం ఎప్పుడు, ఎలా ఆవిర్భవించింది అనే వాటిని గురించి ఎంతో చెప్పారు.

ఈ గ్రంథంలోని విషయ వైవిధ్యం అంతింతదికాదు. సాంస్కృతిక రంగానికి చెందిన సంగతి ఏదీ కూడా దీనిలో చోటు చేసుకోకుండా లేదు. వాటిలో కొన్ని నృత్యానికి సంబంధించినవి కూడా ఉండటం జరిగింది. నన్నయ, తిక్కన, వీరత్వం, ఎర్రన, బసవపురాణం, శ్రీనాథుడు, పలనాటి యుద్ధం, కృష్ణదేవరాయలు, నాయకరాజులు, ఈ విధంగా ఎన్నో విషయాలను గురించి ఈ గ్రంథం లో వివరించారు. అయితే, వీటన్నింటిలోనూ పరోక్షంగా, అస్పష్టంగానైనా నృత్య స్పర్శ ఏదో రూపంలో తగలని విషయం లేదు.

ఈ గ్రంథం ఒకరకంగా నృత్యాలకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వం.

— డాక్టర్ సంజీవదేవ్

# మా మాట.

ఏ దేశంగాని, జాతిగాని, ఏ రంగంలో ముందుకు పోవాలన్నా ముందు తన గత చరిత్ర ఏమిటో తెలుసుకోవాలి. దాన్ని సవ్యంగా విశ్లేషించుకోవాలి. "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్" అన్న దృష్టితోగాక "కొత్తపాతల మేలు కలయిక" సృష్టించుకోవడానికి ఆ అధ్యయనం సోపానం కావాలి. కళ, సాహిత్యాలు కూడా ఆయా చారిత్రిక దశల్లో దేశకాల పరిస్థితులతో పెనవేసుకుని అభివృద్ధి చెందుతాయన్నది విజ్ఞులందరూ అంగీకరించిన సత్యం. అందుకే చరిత్ర కలిగిన ఏ జాతికైనా తనదని సగర్వంగా చెప్పుకోగల కళా సాంప్రదాయాలు వుండటం కద్దు. వాటిని ఒక్కసారి సింహావలోకనం చేసుకుంటేగాని సమకాలీన కళాకారుడు సమోజ్వలంగా ప్రకాశించలేడు. "మనము–మననృత్యాలు" ప్రచురించడంలో మా ఉద్దేశ్యం అదే. శ్రీ పోలవరపు కోటేశ్వరరావు రచించిన ఈ పుస్తకం తెలుగు ప్రజల నృత్య సాంప్రదాయాల విశిష్టతలను వివరిస్తుంది.

ఈ పుస్తకంలోని వివిధాంశాల గురించి, ప్రసిద్ధులు, ప్రతిభావంతులు పరిచయవాక్యాలలో వివరించారు. గనుక మేము ఆ లోతుల్లోకి వెళ్ళదలచలేదు. శ్రీ కోటేశ్వరరావుగారు ఈ గ్రంథంలో నృత్యాల చరిత్రకే పరిమితం కాలేదు. పూసల్లో దారంలా ఆంధ్రుల చరిత్ర కూడా వివరిస్తూ వచ్చారు. శ్రీకాకుళాంధ్ర దేవుడు మొదలు శ్రీకృష్ణదేవరాయల వరకు, ఆదికవి మొదలు అన్నమాచార్యుల వరకు ఈ గ్రంథంలో రేఖామాత్రంగా దర్శనమిస్తారు. కళావిర్భావానికి సంబంధించి పౌరాణిక విశ్వాసాలను, ఆదునిక శాస్త్రీయ అవగాహనను వెంట వెంటనే వివరించడం ఈ పుస్తకం ప్రత్యేకత. ప్రత్యేకించి చిన్నపిల్లలు, ఆ విషయాలతో అంతపరిచయం లేనివారు అర్థం చేసుకోవడానికి వీలైన సులభశైలిని రచయిత అనుసరించారు. కొన్ని అంశాల్లో ఆయన అభిప్రాయాలతో మేము ఏకీభవించకపోవచ్చు. అయినా ఆయన ప్రయత్నాన్ని మనస్ఫూర్తిగా హర్షించబట్టే ఈ ప్రచురణకు పూనుకున్నాము.

"ప్రజ శక్తి" ప్రచురణాలయం సాధారణంగా రాజకీయ సారస్వతం ఎక్కువగా ప్రకటించినా, వైజ్ఞానిక, సాహిత్య గ్రంథాలు కూడా వెలువరిస్తూనే వుంది. ప్రతిష్టాత్మకమైన సమగ్ర ఆంధ్ర సాహిత్య సంపుటాల ముద్రణ మా బాధ్యతను మరింత పెంచిందని, మా మంచి పాఠకులు ఆరోగ్యకరమైన ప్రచురణలు ఆశిస్తున్నారని మాకు తెలుసు. అందుకే ఈ పుస్తకం మీ ఆదరణకు పాత్రమవుతుందని ఆశిస్తున్నాం, దీనికి ముందుమాటలు, పరిచయాలు వ్రాసి ప్రోత్సహించిన ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, సంజీవదేవ్, నటరాజ రామకృష్ణగార్లకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

— ప్రచురణకర్తలు

బొమ్మలను ముద్రించుకోటానికి అనుమతినిచ్చి సహకరించిన ఈ క్రింది వారికి నా నమస్కారాలు తెలుపుకుంటున్నాను.

1. ఆంధ్రప్రదేశ్ మాజీ ఆస్థాన స్థపతి శ్రీ గణపతి స్థపతి.
2. పద్మ శ్రీ నటరాజ రామకృష్ణ.
3. ప్రగతి గీతా ప్రవక్త శ్రీ నండూరి రామకృష్ణమాచార్య.
4. శ్రీ పి.ఎస్.ఆర్.అప్పారావు.
5. కుమారి నవత.
6. ఇంకా ఎందరో వ్యక్తులు.

అడిగినంతనే పరిచయం వ్రాసిన ఈ క్రింది వారికి నా నమస్సులు చెప్పుకొంటున్నాను.

1. పద్మభూషణ్ శ్రీ సి.నారాయణరెడ్డి.
2. పద్మశ్రీ శ్రీ నటరాజ రామకృష్ణ.
3. డాక్టర్ ఆరుద్ర.
4. డాక్టర్ సంజీవదేవ్.

## ఈ రచనకు ఉపయోగపడిన గ్రంథాలు

1. రాహుల్ సాంకృత్యాయన్ రచనలు ఋగ్వేదార్యులు, ఓల్గా నుండి గంగవరకు, దివోదాసు. 2. ఆరుద్రగారి సమగ్రాంధ్ర సాహిత్యం, జానపద కళలు 3. కంభంపాటి సత్యన్నారాయణ (సీనియర్) రచన ఆంధ్రుల చరిత్ర సంస్కృతి 4. ఏటుకూరి బలరామమూర్తి రచన ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర 5. నండూరి రామకృష్ణ మాచార్యుల వారి చరిత్ర, సంస్కృతి రచనలు 6. కొమర్రాజు లక్ష్మణరావు వ్యాసావళి 7. సురవరం ప్రతాపరెడ్డి రచన ఆంధ్రుల సాంఘిక చరిత్ర 8. నటరాజ రామకృష్ణ రచనలు 9. నాట్యశాస్త్రం 10. నృత్తరత్నావళి 11. అభినయ దర్పణం 12. ఏంజల్సు కుటుంబము దాని పుట్టు పూర్వోత్తరాలు 13. ఆముక్త మాల్యద 14. ఆర్థర్ కాటన్ జీవిత చరిత్ర 15. కౌటిల్యుని

అర్ధశాస్త్రం 16. విష్ణు స్మృతి 17. మనుధర్మ శాస్త్రం 18. భారతం 19. భాగవతం 20. గాథాసప్తశతి 21. యాజ్ఞవల్క్య స్మృతి 22. వేదకాలం నాటి సమాజాన్ని గూర్చిన డాంగే రచనలు 23. శ్రీనాధుని పలనాటి వీరచరిత్ర 24. ముక్కామల నాగభూషణం గారి రచనలు 25. ఇంకా ఎన్నో రచనలు.

**అందరికీ నా హృదయ పూర్వక నమస్కారాలు తెలుపుకుంటున్నాను.**

**వ్యక్తి గత సంభాషణలలో అమూల్యమైన సమాచారాన్నందించిన వారు**

1. శ్రీమతి సరిదె మాణిక్యమ్మ 2. శ్రీమతి జంపా ముత్యం 3. శ్రీమతి విజయ విలాసం 4. శ్రీమతి వాసిరెడ్డి కనకదుర్గ 5. శ్రీమతి ఉమారామారావు 6. శ్రీమతి చిత్ర 7. చిందుభాగవతులు 8. వీరనాట్యం, తప్పెటగుళ్ళు, గరగలు, గురవయ్యలు మొదలగు జానపద కళాకారులు 9. స్వర్గీయ వేదాంతం ప్రహ్లాదశర్మ 10. శ్రీ కోగంటి గోపాల కృష్ణయ్య 11. శ్రీ పోలవరపు సూర్యప్రకాశరావు 12. శ్రీ నటరాజ రామకృష్ణ 13. శ్రీ ఎ.ఎస్.ఆర్.కృష్ణ 14. శ్రీ వాసిరెడ్డి హనుమంతరావు 15. శ్రీ ముక్కామల నాగభూషణం 16. శ్రీ సి.ధర్మారావు 17. గ్రామదేవతల కొలుపులకు సంబంధించిన వ్యక్తులు 18. ఇంకా ఎందరో సామాన్యులు, అసమాన్యులు, తమ సలహాలతో నాకు సహకరించారు.

అందరికీ వందనాలు

రచయిత



# మనము-మన నృత్యాలు

## ఆశ్రమానికి

అరుణోదయానికి ముందు తూరుపంతా వెల్ల వేసినట్లుంది. రాత్రి విచ్చుకున్న తెల్లని పూలతో యింటిముందున్న మల్లెపందిరి నవ్వుకుంటోంది, చల్లగాలికి వాసనలు వెదజల్లుతోంది. పెరటిలోని మామిడి చెట్టు నిండా పూతా పిందె వుంది. కొమ్మలమధ్య కోయిలమ్మ 'కుహూ కుహూ' అంటోంది. నాకు మెలకువ వచ్చింది. ఈరోజు నేను వెళ్ళాలి.

నాయనగారు నడుస్తున్నారు. వెంట నేను. ఎదురుగా శ్రీకాకుళాంధ్ర దేవుని గాలిగోపురం. శిఖరం మీద కలశాలు సూర్యకాంతికి మెరుస్తున్నాయి.

నా మనసంతా ఆనందంగా వుంది. నన్ను ఊపిరి పీల్చనీయటం లేదు. ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

కృష్ణానది ఇసుకతిన్నెల మీదుగా నడుస్తున్నాం. రాత్రి చల్లదనానికి ఇసుక మెత్తబడింది. చల్లని మంచు పొర ఇసుకమీద పరచుకుంది. కాలి క్రింద పూల రెమ్మలు చల్లినట్లుంది.



ఎదురుగా కృష్ణవేణి, చిరుగాలికి అలలు కదులుతున్నాయి. నెమ్మదిగా ఆమె సాగిపోతోంది.

ఈ నది అంటే నాకెంతో యిష్టం. కారణం తెలియదు. నీటి మధ్యగా కాలినడవ. మోకాలు బంటి నీళ్లు దాటి లంక చేరాము.

మాముందు వంట పొలాలు. పళ్లతోటలు, అరటి తోటలు అందంగా వున్నాయి. వాటిమధ్య పావట తీసినట్లున్న కాలిబాట. నాలో ఎన్నో ఊహలు. గుండె గుబగుబలాడుతోంది. మనసు గంతులు వేస్తోంది.

కృష్ణానది మధ్యలో వున్న యీలంకను దేముడి లంక అని పిలుస్తారు. నాన్నగారూ, నేనూ దీనిమీదుగా వెళ్తున్నాం. వారు మౌనంగా సాగిపోతున్నారు. వారి వెనుక అడుగులో అడుగు వేస్తూ ఊహాలోకంలో తేలిపోతున్నాను.

నాయనగారు నిలిచిపోయారు.

నేనూ ఆగి పోయాను.

'అటుచూడు' అంటూ ఎదురుగా ఉన్న పూరిపాక వైపు చూపించారు. నేను చూస్తూ నిలబడి పోయాను.

'అదే ఆశ్రమం' నాయన చెప్పారు. వారి గొంతులో ఎంతో గౌరవం వుంది.

నూతివద్ద కాళ్లూ ముఖమూ కడిగాము. తీయని నీటితో దప్పిక తీర్చుకున్నాము.ఆశ్రమంలో అడుగుపెట్టాము.

పూలమొక్కల మధ్యగా నడుస్తూ ముందుకు సాగినాము.

## దర్శనం

ఎదురుగా ఎత్తయిన అరుగువుంది. దానిపైన తుంగచాప పరచివుంది. అర్వై సంవత్సరాలు నిండిన వ్యక్తి అక్కడ కూర్చొని వున్నారు. ఏదో గ్రంథం చదువుకుంటున్నారు.

'నమస్కారం గురూజీ!' నాయన తలవంచి నమస్కరించారు.

గురూజీ మావంక చూస్తూ 'మీరాకకోసమే ఎదురు చూస్తున్నా' అన్నారు.

'రండి, కూర్చోండి' అంటూ ఆప్యాయంగా ఆహ్వానించారు.

'గురూజీ! నేనుమీతో చెప్పింది వీడిని గురించే. మీదగ్గర వుంచాలని తీసుకువచ్చాను.



గురూజీ నావంక పరీక్షగా చూశారు. ఆచూపులో వారికి నాగురించి పూర్తిగా తెలిసినట్లుంది. చిరునవ్వుతో 'ఇటురా, బాబూ!' అన్నారు. నేనుభయపడుతూ దగ్గరకు వెళ్లాను. ప్రేమగా నాతలపైన చేయివుంచారు. 'నీపేరేమిటి?' అని అడిగారు.

'రాము' అన్నాను.

'పూర్తి పేరు చెప్పాలి'.

'జయరాం'.

ఆయన మరింత ఆప్యాయంగా అడిగారు 'ఇక్కడ వుండటం నీకిష్టమేనా?'

వారి ఆప్యాయత వల్ల నాలోని భయం తొలగిపోయింది. సంకోచం కూడా పోయింది. నేను ఔనన్నట్లు తలవూపాను.

'నోటితో చెప్పాలి' అన్నారు.

'నాకిష్టమే, గురూజీ'! అన్నాను. గురూజీ తన దగ్గరున్న గంట మ్రోగించారు. ఒక కుర్రాడు వచ్చాడు.

'ఈ అబ్బాయి పేరు జయరాం. ఈ రోజు నుండి మనతోనే వుండి పోతాడు' అన్నారు.

ఆ వచ్చిన కుర్రాడి ముఖంలో సంతోషం కన్పించింది.

'వెళ్లు జయరాం' అన్నారు గురూజీ.

నేను ఒకమాటు నాయన వంక చూశాను. ఆయన ప్రశాంతంగా నావంక చూస్తున్నారు. కాని, వారి చూపులో కొంచెం బాధ వుంది. నేను చిన్నప్పటినుండీ ఇల్లు వదలిపెట్టి బయట వుండలేదు.

నాసామాన్లు తీసుకుని లోనికి వెళ్లాను.

## నృత్యం నేర్చుకుంటూ



నేవెళ్ళిన కొత్తలో ఒక రోజు గురూజీ నన్ను పిలిచారు. వెంటపెట్టుకుని, ప్రతిగదీ చూపించారు. అక్కడి విద్యార్థుల్నీ, గురువుల్నీ పరిచయం చేశారు.

గురుకులంలో చదువుతోపాటు అనేక యితర విషయాలను ప్రత్యేకంగా బోధిస్తారు. ముఖ్యంగా సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నృత్యం, వాయిద్యాలు, చేతిపనులు నేర్పుతారు. ఇంకా చాలా విషయాలు చెపుతారు. వీటిలో ఒక అంశాన్ని ఎంచుకోవాలి. తప్పని సరిగా దానిలో కృషి

చేయాలి.

గురూజీ ప్రతివిషయాన్నీ వివరిస్తూ, గదులన్నీ చూపించారు. రోజూ వెళ్ళి చూచిరమ్మన్నారు. నేను ఏమి చూస్తున్నానో అడిగి తెలుసుకునేవారు. ఇలా పదిరోజులు గడిచాయి. ఒకరోజు గురూజీ నన్ను పిలిపించారు. నే వెళ్ళి నమస్కరించి నిలబడినాను. ఆయన ఆప్యాయంగా అడిగారు. 'రోజూ జాగ్రత్తగా గమనిస్తున్నావా?'



ఔనని తల వూపాను. ఆయననవ్వి 'మాటలు రావా' ?అన్నారు. 'అన్నీ చూశాను గురూజీ'!

'ఏదిబాగా నచ్చింది'?

వెంటనే సమాధానం చెప్పలేక పోయాను. ఆలోచించి చివరకు 'నృత్యం' అన్నాను.

'ఆ తర్వాత?' గురూజీ అడిగారు.

'మృదంగం'.

'ఆ తర్వాత'



'మురళి'.

'ఆతర్వాత?

'చిత్రలేఖనం'.

గురూజీ నవ్వుకున్నారు.



'నీకు నృత్యం నేర్చుకోవాలనివుందా'? అని అడిగారు.

ఔనని తలూపాను.

గురూజీ నవ్వు మాయమయింది. స్వరంలో కొంచెం కాఠిన్యం విన్పించింది.

'నోటితో చెప్పు 'అన్నారు.

'నృత్యం నేర్చుకోవాలని వుంది, గురూజీ!'

నేను భయపడుతూ చెప్పాను.

వారు నవ్వుకున్నారు. ఆ కళ్లలో ఆనందం కన్పించింది.

మృదువుగా అన్నారు. 'సమాధానం చెప్పటానికి అభినయం దేనికి?నోటితో చెప్పాలి, తెల్సిందా?'

'తెలిసింది గురూజీ'

'ఒకే తప్పు అనేక పర్యాయాలు చేయకూడదు. నీవు తెలివి కలవాడివి.

త్వరలో మంచి పద్ధతులు అలవాటు చేసుకోగలవు' అన్నారు.

నేను మౌనంగా నిలబడ్డాను.

'సరే వెళ్ళు'.

వారికి నమస్కరించి వచ్చేశాను.

## మనదిభారతదేశం

రోజువారీ పాఠాలు సాగుతున్నాయి. ప్రత్యేక విషయాలు నేర్చుకునే వారి కొరకు అదనంగా శ్రద్ధ తీసుకుంటారు. ఆయా విషయాలలో బాగా అనుభవం వున్న వారు బోధిస్తుంటారు. ఎవరికి యిష్టమయిన ప్రత్యేకాంశాన్ని వారు నేర్చుకోవచ్చు.

నేను నృత్యాన్ని ఎంచుకున్నాను. ఈ విద్యలో గురూజీకి మంచి ప్రావీణ్యం వుంది. నాఅదృష్టం కొద్దీ, వారు స్వయంగా పర్యవేక్షణ చేసే వారు. ఒకోమారు వారే పాఠాలు చెప్పేవారు. రోజు వారీ చేసే అభ్యాసాలలో దొర్లే పొరపాట్లను సరిచేస్తుండేవారు.

నాట్యాభ్యాసంలో వివిధ తరగతుల వాళ్లం దాదాపు మూడు పదుల వరకున్నాము. ఒకరోజు– ఆరోజు నాకు బాగా గుర్తు– గురూజీ మమ్మల నందరినీ సమావేశ పరిచారు.

మామిడి చెట్టు చుట్టూ అరుగు కట్టి వుంది. అది బాగా పూసింది. పిందెమీదుంది.అందరం అరుగుమీద కూర్చున్నాము. వారు అప్పుడప్పుడూ ఇలా కూర్చొ బెట్టి చాలా విషయాలు చెపుతుంటారు.



వాతా వరణం చాలా బాగావుంది. అందరం వారు చెప్పబోయేది వినేందుకు ఆదుర్దాగా వున్నాం.

గురూజీ ముఖంలో ఏదో వింత కాంతి వుంది. మాటలాడే సమయంలో వారి భావాలను ముఖకండరాలు చక్కగా వివరిస్తాయి. వారి కనులు తామరపూల రేకుల్లా వుంటాయి. వాటిలో ఏదో గొప్ప కాంతి మెరుస్తూ వుంటుంది. వారిని చూడటం తోటే పవిత్రభావం కలుగుతుంధి. అనుకోకుండా చేతులు జోడించి నమస్కరిస్తుంటారు.

వారు ప్రారంభించారు. మెత్తని మాట. అందులో నిండిన ఆప్యాయత. విద్యార్థులంటే వారికి బిడ్డలతో సమానం.

'అబ్బాయిలూ మీరుశ్రద్ధగా వినండి. నే చెప్పే విషయాలు మీకు అర్థం కాకపోతే అడగండి. వివరంగా చెబుతాను. ప్రతిదానినీ ఎందుకు? ఏమిటి? అనే ప్రశ్నలతో చూడండి. తర్కించి అర్థం చేసుకోండి, గుడ్డిగా నమ్మవద్దు.'



'మనది భారత దేశం. మన దేశానికి హిందూ దేశమని, భరత ఖండమని, భరత భూమి అని ఎన్నో పేర్లున్నాయి.'

'భారతదేశమనే పేరు ఎలా వచ్చిందనుకున్నారు? పూర్వం భరతుడనే రాజు పాలించటం వలన భారత దేశమనే పేరు వచ్చిందంటారు. ఈయన శకుంతల, దుష్యంతుల కుమారుడు'.

'చాలా కాలం క్రితం కాళిదాసు అనే మహాకవి వుండే వాడు. ఆయన సంస్కృతంలో చాలా పుస్తకాలు వ్రాశాడు. అభిజ్ఞాన శాకుంతలమనే నాటకం కూడా వ్రాశాడు. భరతుని పుట్టుకను గూర్చిన వివరాలన్నీ ఆ నాటకంలో చక్కగా తెలుస్తాయి. ఇంకా మన పురాణాలలో, కావ్యాలలో అనేకమంది ఈ కథంతా వ్రాశారు.'

## సింధు– హిందు

'మరికొంత మంది మరో విధంగా చెపుతారు. మన దేశానికి వాయవ్యంగా ఒక గొప్ప నది ప్రవహిస్తోంది. దాని పేరు సింధు. ఈ నది హిమాలయాలలో పుడుతుంది. అరేబియా సముద్రంలో కలుస్తుంది. ప్రస్తుతం ఈ నది పాకిస్తాన్‌లో వుంది.'

'మీరు పంజాబ్ అనే పేరు వినే వుంటారు. ఐదు నదుల మధ్య ప్రదేశమని దీని అర్థం. సింధునది దాని ఉపనదులు కలిసి ఐదు నదులౌతాయి. ఈ నదుల మధ్యభూమిని పంజాబ్ అని పిలుస్తారు.'

'చాలా వందల సంవత్సరాలకు పూర్వం, భరత గణాలు ఈ ప్రాంతంలో వుండేవి. ఇవి ఆర్యగణాలు. భరత గణాలున్న ప్రాంతం కాబట్టి భరత దేశం, లేక భారత దేశం అని పేరు వచ్చిందంటారు. ఆతరువాత అదే పేరుతో మన విశాల దేశాన్ని పిలిచారు.'



'మన దేశాన్ని హిందూ దేశమనే పిలుస్తారు. ఈపేరెందు కొచ్చిందో తెలుసా? సింధునది ప్రవహించే దేశం కనుక యిలా పిలిచారు. ఆనాడున్న ఇతర దేశాల వారు 'స' అనే అక్షరాన్ని 'హ'గా పలికే వారు. ఇలా 'సింధు' దేశమల్లా 'హిందు' దేశంగా పిలువ బడింది'

'ఇప్పటికి కూడా ఒకో భాష మాట్లాడే వారు కొన్ని శబ్దాలను పలకలేరు.బెంగాలు అనే మాటవినే వుంటారు. దీన్ని వంగభూమి అంటాము. బెంగాలీలు 'వ' అనే అక్షరాన్ని 'బ'గా పలుకుతారు. ఇలా వంగభూమి కాస్తా, బంగభూమి అయింది. ఈ విధంగా బెంగాలు అనే పదం, బంగాళా ఖాతమనే మాట వచ్చాయి.'

## ఆర్యావర్తం

'పంజాబునుండి ఆర్యగణాలు క్రమేణా ఉత్తర భారత దేశ మంతా వ్యాపించాయి. వారు తిరిగిన ప్రాంతాన్ని ఆర్యావర్తమని పిలిచారు. ఆ తరువాత కాలంలో వారు అనేక నదులను, ఉపనదులను, కనుక్కున్నారు. వాటిని అనేక పేర్లతో పిలిచారు. కాని ముందుగా తాము చూసిన సింధునది పేరుతో వచ్చిన 'హిందు' అనే మాటను ఎవ్వరూ మరచిపోలేదు. విదేశస్తులకు, స్వదేశస్తులకు మనదేశం పేరు హిందూ దేశంగానే మిగిలి పోయింది.'

## త్రిమూర్తులు

'ఈ రోజు మీకు నాట్యశాస్త్రం ఎలా పుట్టిందో వివరిస్తాను. ముందుగా కొందరు పురాణ పురుషులను గూర్చి మీరు తెలుసుకోవటం అవసరం.'

'హిందువులకు ముగ్గురు ప్రధాన దేవతలున్నారు. వారిని త్రిమూర్తులని పిలుస్తారు.'

'ఒకరు బ్రహ్మ. ఈయన ప్రతిదాన్నీ సృష్టిస్తాడు.'

'మరొకరు విష్ణువు. ఈయన సృష్టిని కాపాడుతుంటాడు.'





'ఇంకొకరు మహేశ్వరుడు. ఈయన చివరి దశలో సృష్టిని నాశనం చేస్తాడు.'

'ఇందువలన త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సృష్టి, స్థితి, లయ కారులని పెద్దలు అంటారు.'

'బ్రహ్మదేవుని భార్య పేరు సరస్వతి. ఈమె చదువుల తల్లి.'

'విష్ణుమూర్తి భార్యపేరు లక్ష్మి. ఈమె సిరిసంపదల దేవత. అన్ని సంపదలు ఈమె ఆధీనంలో వుంటాయి.'

'ఈశ్వరుని భార్యపేరు పార్వతి. ఈమె శక్తి స్వరూపిణి.'

'వీరు గాక హిందువులకు అనేక దేవతలున్నారు. ఒకరూ, ఇద్దరూ కాదు. వారంతా కలిసి ముప్పైమూడు కోట్ల మంది అని పెద్దలు చెపుతారు.'

## నాట్యశాస్త్రంలోని కథ

'నాట్య శాస్త్రం అనే గ్రంథం వుంది. దానిలోని పురాణ గాథను వివరిస్తాను. శ్రద్ధగా వినండి.'

'చాలా సంవత్సరాల నాటి కథ ఇది. త్రేతాయుగంలో జరిగింది. దేవతలందరూ జంబూద్వీపంలోని పరిస్థితులను అంచనా వేశారు. వివరాలన్నీ దేవేంద్రునికి చెప్పారు. దేవేంద్రుడు దేవతలకు రాజు.'

'దేవతలను వెంటబెట్టుకుని దేవేంద్రుడు బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్లాడు. బ్రహ్మ సత్యలోకంలో ఉన్నాడు. పద్మంమీద కూర్చొని ఉన్నాడు. ప్రక్కనే హంసవాహనం పైన సరస్వతీ దేవి ఉంది.'



"మీరు వచ్చిన కారణం ఏమిటి?" అని అడిగాడు బ్రహ్మ. దేవేంద్రుడు సవినయంగా విన్నవించుకున్నాడు. "స్వామీ! వేదాలను దేవతలు తప్ప ఇతరులు వినకూడదు. చదవకూడదు. శూద్ర జాతుల వారున్నారు. వారికి మన వేదాలపైన అధికారంలేదు. కాబట్టి అందరూ వినటానికి, చూడటానికి, వీలైన దాన్ని తయారు చేయండి. అది వినోదంగా ఉండాలి. దేవతలు, శూద్రులు అనేతేడా లేకుండా కలసి చూడటానికి వీలుగా ఉండాలి. వినటానికి అనుకూలంగా ఉండాలి. అందరూ ఆనందించేటట్లుండాలి. మీరు తప్పకుండా యిలాంటి దాన్ని సృష్టించాలి" అని ప్రార్థించాడు.

'బ్రహ్మదేవుడు అలాగేనని వారిని పంపించి వేశాడు.'

'అబ్బాయిలూ! కష్టాలొచ్చినా, సమస్యలొచ్చినా, దేవతలంతా ముందుగా ఇంద్రునితో చెప్పుకుంటారు. ఆ విషయాలను ఇంద్రుడు పరిష్కరిస్తాడు. ఒక వేళ యింద్రుని శక్తి చాలకపోతే, అందరూ కలసి త్రిమూర్తులలో ఎవరినో ఒకరిని ప్రార్థించి, ఆసమస్యను తీర్చమని అడగటం మామూలుగా జరుగుతూ ఉంటుంది.'

'మనకు మూడు వేదాలున్నాయి. వాటిని ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అంటారు. తరువాత అధర్వ వేదము వచ్చింది. బ్రహ్మ నాలుగు వేదాల నుండి నాలుగు విషయాలను ఎంపిక చేశాడు.'

## నాట్య వేదం

'ఋగ్వేదాన్నుండి పాఠాన్ని తీసుకున్నాడు.'

'సామవేదాన్నుండి గీతాన్ని తీసుకున్నాడు.'

'యజుర్వేదాన్నుండి అభినయాన్ని ఎంచుకున్నాడు.

'అధర్వ వేదాన్నుండి రసాలను గ్రహించాడు.'

'వీటన్నింటినీ కలిపి పంచమ వేదం తయారు చేశాడు.'

'దీన్ని 'నాట్య వేదమని' పిలిచారు.'

'బ్రహ్మ యింద్రుని పిలిచి విషయమంతా చెప్పాడు. ఈ విద్యను నేర్చుకుని ప్రచారం చేయమన్నాడు. కాని, ఇంద్రుడు అందుకు అంగీకరించలేదు. వినయంగా ఇలా అన్నాడు.'

"దేవా!నాకీ విద్య వంటపట్టదు. దీనిలో ప్రావీణ్యత నేను సంపాదించలేను. యుద్ధం చేయవలసి వస్తే నేను ధైర్యంగా పోట్లాడగలను. శత్రువులను చంపివేయగలను. కాని, నాట్యం చేయటం నావల్ల కాదు. దయతో నన్ను ఒత్తిడి చేయవద్దు. ఈ విద్యను ఋషులకు నేర్పండి. వారు ఇలాంటి విషయాలలో నేర్పరులు" అని బ్రతిమాలాడు.

'బ్రహ్మ అందుకు అంగీకరించాడు. భరతునకు ఈ విద్య బోధించాడు. భరత ముని నేర్చుకున్నాడు.'

'ఆ తరువాత, భరతముని ఈ విద్యలోని మెలకువలన్నీ తన నూరుగురు కొడుకులకు చెప్పాడు. రంగస్థలంపైన ఎలా ప్రదర్శించాలో కూడా వివరించాడు.

'భరతముని తన కొడుకులను వెంటపెట్టుకుని, సత్యలోకం వెళ్లాడు. బ్రహ్మదేవుని ముందు ప్రదర్శించాడు. అప్పుడు ఆడిన ఆటపేరు 'అమృత మధనం"

'బ్రహ్మ భరతుని నాట్యాన్ని చూశాడు. ఆయనకు తృప్తిగా లేదు. భరతునితో ఇలా అన్నాడు.'

"నీవు తయారు చేసిన దానిలో ఏదో లోటు కన్పిస్తోంది. ఇలాంటి విషయాలలో శంకరునికి మంచి అనుభవం వుంది, మంచి ప్రావీణ్యం వుంది. కైలాసం వెళ్లి శివునికిదంతా చూపించు. వారి సలహా తీసుకో"అన్నాడు.

'మన దేశానికి ఉత్తరాన పెద్దపర్వతాలున్నాయి. వాటిని హిమాలయాలంటారు. అక్కడ చాలా శిఖరాలున్నాయి. వాటిలో ఒక శిఖరాన్ని కైలాస శిఖర మంటారు.





కైలాసంలో పరమేశ్వరుడు ఒక గుహలో వున్నాడు. ప్రక్కనే పార్వతీదేవి ఉంది. చుట్టూ నందీశ్వర, భృంగీశ్వరులున్నారు. ప్రమధ గణాలన్నీ పార్వతీ పరమేశ్వరులను కొలుస్తున్నారు.'

## పరమేశ్వరుడు మెరుగులు దిద్దాడు.

భరతముని శివుని ముందు నిలబడి ప్రణామం చేశాడు. పరమ శివునకు బోళా శంకర్ అనే పేరుంది. భక్తులు తనను పొగిడితే వూరకనే ఉబ్బిపోతాడు. ప్రసన్నుడవుతాడు. ఒట్టి జాలి గుండెల వాడు పరమేశ్వరుడు.'

'శివుడు భరతుని పొగడ్తలకు మెచ్చుకున్నాడు. ఏమి కావాలని అడిగాడు. భరతుడు తాను వచ్చిన పని చెప్పాడు. సరే! ప్రదర్శించు, చూస్తాను అన్నాడు. అంతా చూశాడు. దానిలో లోటు కన్పించింది. ఎందువలన రక్తి కట్టలేదో తెలిసిపోయింది. శివునకు ఇలాంటి విషయాలలో ఎంతో అనుభవం వుందికదా? ఆయన ఇలా అన్నాడు'.

"భరతమునీ! నేను సంధ్యా సమయంలో నృత్యం చేశాను. అప్పుడు కాళ్లూ, చేతులూ కదిలించి అందమైన భంగిమలు కూర్చాను. వాటిని నేర్చుకో. మీ నాట్యంలో వీటిని కలుపుకుంటే చక్కగా వుంటుంది. చూడ్డానికి బాగా ఉంటుంది."



సంధ్యా తాండవము

అని శివుడు సలహా చెప్పాడు.

'భరత ముని ఈ విద్య కూడా నేర్చుకున్నాడు.'

## తాండవం



'అంతేకాదు, పరమేశ్వరుని శిష్యుడు తండుడు. ఎప్పుడూ ఆయన వద్దనే ఉండే వాడు. అతన్ని కూడా తను చేసే నృత్యంలోని భంగిమలు అధ్యయనం చేయమన్నాడు. వాటిని చక్కగా గమనించ మన్నాడు.'

'తండుడు చాలా తెలివైన వాడు, తనకు అప్పగించిన పని చాలా బాగా చేశాడు. శ్రద్ధగా చేశాడు. ఈతడు శివుని నృత్తాలను పొందికగా అమర్చినాడు. అందంగా కూర్చినాడు. తండునిచే ఈ విధంగా చేయటం వలన వీటిని తాండవం అని పిలుస్తారు. చివరకు అవి శివ తాండవాలుగా ప్రచారం పొందినాయి.'

## లాస్యం

'పార్వతీ దేవి కూడా చక్కగా నృత్యం చేయగలదు. ఆడవారు చేసే నర్తనం అందంగా వుంటుంది. మృదువుగా వుంటుంది. పార్వతీ దేవికి ఈ విద్యలో మంచి ప్రావీణ్యత వుంది. ఆమె చేసే నర్తనాన్ని లాస్యం అంటారు.'

'ఇలా శివుని తాండవం, పార్వతీ దేవి లాస్యం ప్రచారం లోకి వచ్చాయి. రెండు రకాలైన నృత్య పోకడలుగా నిలిచి పోయాయి.'

'పరమేశ్వరునిలో సగభాగం పార్వతీదేవి. అందువలన లాస్యం, తాండవం రెండూ ఈశ్వరునికి చెందుతాయి.



## అర్ధనారీశ్వరుడు

అందుకే ఈశ్వరుని సాంబశివుడు అంటారు అనగా అంబతో కలిసి వున్నవాడు అని అర్థం అర్ధనారీశ్వరుడని కూడా అంటారు.'

'ఈ రోజుకు ముగిద్దాం. రేపు మరికొంత చెబుతాను' అన్నారు. అందరం లేచి వారికి నమస్కరించి గదుల్లోకి వెళ్లి పోయాము.

మరో రోజు గురూజీ మిగతా కథ చెప్పటానికి ప్రారంభించారు. అందరం ముందు కూర్చున్నాము. వారు చాలా ప్రసన్నంగా వున్నారు.

'అబ్బాయిలూ! భరతముని పరమేశ్వరుని సలహా ప్రకారం తాండవంలోని కొన్ని అంశాలను తన నాట్యాలకు కలుపుకున్నాడు. తానుచూసిందీ, విన్నదీ, నేర్చుకుందీ, చక్కగా కూర్చు కున్నాడు. స్వయంగా కొంత అభివృద్ధి పరచుకున్నాడు. తన బిడ్డలకు మరల శిక్షణ యిచ్చాడు. వారిని తీసుకుని సత్యలోకం వెళ్లి బ్రహ్మ ముందు ప్రదర్శించాడు. పద్మ సంభవుడు ఆ ఆట చూశాడు. పూర్వం కన్నా మెరుగ్గా వుంది. కానీ, ఆనృత్యంలో నిండుదనం రాలేదు. ఏదో లోటుఉంది. ఆడేవారంతా మగవాళ్లే. ఇందువలన మృదువుగా చూపించ వలసిన అభినయాన్ని చేయలేక పోతున్నారు. ప్రదర్శన రక్తి కట్టలేదు.'

## అప్సరసలు

'మరల అలోచించారు. ఆడవారు కూడా వుంటే బాగుంటుంది. కాని, ఇలాంటి విషయాలలో స్త్రీలందరూ పనికిరారు. ఆడటానికి అనుకూలమైన శరీరం ఉండాలి. చూడటానికి అందంగా ఉండాలి. పాడితే వినటానికి తీయని గొంతు ఉండాలి. ఇన్ని



లక్షణాలున్న వారిని ఎక్కడ నుండి తేవాలి?'

'వారి సమస్యను బ్రహ్మదేముడు పరిష్కరించాడు. ఆయన ఇందుకు అనుకూలంగా వుండే వారిని సృష్టించాడు. వారే అప్సరసలు. వీరు ఇరువది ముగ్గురు. వీరు నాట్యం కొరకు మాత్రమే సృష్టించ బడినారు.'

'దేవలోకంలో ఇంద్రుని సభలో అప్సరసలున్నారు. వారికి వీరికి సంబంధం లేదు.'

'బ్రహ్మ యిచ్చిన అప్సరసలను, తన బిడ్డలను కలుపుకుని భరతముని నాట్యాభ్యాసం చేయించాడు. ప్రదర్శనలు యిప్పించాడు. అంతే కాదు, పరమేశ్వరుని దగ్గర నుండి నేర్చుకున్న అలంకరణ, మేకప్‌లను కూడా వీరికి నేర్పాడు. ఇలా క్రమంగా నాట్యం అభివృద్ధి అయింది. అందరూ కలసి చూడటానికి, వినటానికి వీలైన ప్రదర్శన తయారయింది.'

## భరతం

భరతముని వలన భరత నాట్యం అనే పేరు వచ్చింది. పైగా 'భరత' అనేదానికి

మనపెద్దలు మరో అర్థం చెపుతారు.'

'భ' అనగా భావము

'ర' అనగా రాగము

'త' అనగా తాళము

'భావ రాగ తాళములనే మూడు మాటల ముందున్న అక్షరాలను కలిపితే 'భరత' అనే పదం తయారయింది. దీన్నే 'భరతం' అని అందంగా పిలుస్తాం.'



'భరతం అనగా ఏమిటో తెలుసా? తాళం ప్రకారం అడుగులు వేయాలి. రాగానికి అనుకూలంగా గొంతెత్తి పాట పాడాలి. పాటలోని భావాన్ని చక్కగా ప్రదర్శించాలి. ఈమూడు కలిస్తే భరతం అవుతుంది. ఈ విధంగా 'భరతం' అనే మాట ప్రచారం అయింది.'

'భరతముని ఈ విద్యను గూర్చి ఒక పుస్తకం వ్రాశాడు. ఆపుస్తకం పేరు **నాట్యశాస్త్రం.** భరత శాస్త్రమని కూడా పిలుస్తారు.'

వారు చెప్పటం ఆపి, మాముఖాల వంక పరిశీలనగా చూశారు. నవ్వుతూ అన్నారు. 'జాగ్రత్తగా విన్నారు కదా'?

అందరూ ఔనన్నాం. వారు మరల ప్రారంభించారు.

'ఈ విధంగా భరతముని ఈకళను గూర్చి గొప్ప రచన చేసి, తరువాత వారికి అందించారు. వారు చాలా గొప్ప సేవ చేశారు. వారికి మనసారా అందరూ నమస్కరించాలి. ఎప్పుడూ వారిని గుర్తు పెట్టుకోవాలి. ముఖ్యంగా కళారాధకులు, అందులోనూ నాట్యకళారాధకులు, వారికి ఎల్ల వేళలా తలవంచి నమస్కరించాలి.'

భరతుని తరువాత వచ్చిన ఎందరో గురువులు ఈ భరతాన్ని అభివృద్ధి పరచారు.'

'ఇలా భరత భూమిలో నాట్యం పుట్టి, పెరిగింది. ఈ పూటకు చాలు. రేపు సాయంకాలం మరికొంత చెపుతాను అన్నారు.'

మేము నేర్చుకుంటున్న ఈనృత్య విద్య వెనుక ఇంత పురాణ గాథ ఉందని

మాకు తెలియదు. ఎందరో దేవతలు పాలు పంచుకున్నారు. ఈ కథ ద్వారా చాలా విషయాలు తెలిశాయి.

మేం బయలు దేరుతూ మననం చేసుకున్నాం. **తాండవం, లాస్యం, తండుడు, భరతముని, అప్సరసలు, పార్వతీ పరమేశ్వరులు**— ఎందరో పుణ్యపురుషులు. వారందరికీ మనసులో వందనాలు చెప్పుకున్నాం.

సాయంకాలపు నీరెండకు మామిడి చిగుళ్లు మెరుస్తున్నాయి. పూత పింద మీదున్న కొమ్మలు కమ్మని వాసనలిస్తున్నాయి. తుమ్మెదల ఝుంకారం తీగమీటినట్టుగా ఉంది. తేనె కొరకు అవిమొగ్గలు వేస్తూ మామధ్యగా దూసుకు పోతున్నాయి. మరో వైపు కొత్తగా చిగురించిన కొమ్మ పూయనే లేదు. ఆ చిగురుల కొరకు వచ్చిన గండు కోయిల, కుహూకుహూ అంటోంది.

అంతా ఆశ్రమానికి చేరుకొన్నాము.

నే వచ్చి సంవత్సరమయింది. మధ్యలో మావూరు వెళ్లి వస్తున్నాను. చదువుతో పాటు నృత్యాభ్యాసం సాగుతోంది. మధ్యమధ్య గురూజీ నృత్యాల పుట్టుపూర్వోత్తరాలను వివరిస్తున్నారు.

గురూజీ ఈ రోజు నృత్యాన్ని గూర్చి చెబుతున్నారు. వారు వచ్చి తమ స్థానంలో కూర్చున్నారు. అందరం లేచి నమస్కరించాము.

'అబ్బాయిలూ'! వారు ప్రారంభించారు. 'నేను చెప్పిన కథంతా గుర్తుందా? భరతముని నాట్యశాస్త్రంలో స్వయంగా ఈ కథంతా చెప్పారు.'

## చరిత్ర రచన

'ఇదంతా పురాణ గాథ. కాని యీ కథను మరో విధంగా చెపుతారు. వారిని చరిత్ర కారులంటారు. మానవ సమాజం ప్రారంభదశ నుండి ఈనాటి వరకు ఎలా పెరిగిందో వారు పరిశోధన చేశారు. పరిశీలించారు. చరిత్రగా వ్రాశారు. వారు సామాన్య వ్యక్తులు కారు. అనేక గ్రంథాలు చదివారు. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలు— ఇంకా అనేక పుస్తకాలు జాగ్రత్తగా అధ్యయనం చేశారు. పూర్వ కాలపు మానవులు నివసించిన ప్రదేశాలు త్రవ్వారు. అక్కడ లభించిన వస్తువులను, పునాదులను, కట్టడాలను పరిశీలించారు. శిలాశాసనాలు చదివారు. ఒక నిర్ణయానికి వచ్చి, తమకు

తోచిన రీతిలో మానవుని వికాసంపై గ్రంథాలు వ్రాశారు. అవి మన చరిత్రను, సంస్కృతిని తెలియ పరుస్తాయి.'

'ఇలా వ్రాసిన వారంతా ఒకే అభిప్రాయంతో ఉండలేదు. చరిత్ర పరిశీలకులు కొందరు, భరతముని వ్రాసిన నాట్య శాస్త్రాన్ని పరిశోధన చేశారు. వారు కొన్ని నిర్ణయాలు చేశారు. నేను వారి అభిప్రాయాలను మరో కథా రూపంలో చెపుతాను. ఈరెంటినీ పోల్చి చూడండి. ఆలోచించండి. మీరు పెద్ద వారైన తరువాత స్వయంగా నిర్ణయించుకుందురు గాని.'

'భారత దేశం అనే పేరు రావటానికి గల కారణం తెలుసుకున్నారు. ఈనాటి పంజాబ్ ప్రాంతంలో ఆర్యగణాలుండేవని మీకు ఇంతకు ముందు చెప్పివున్నాను.'

## ఆర్యులరాక

'ఆర్యుల ప్రయాణ సాధనం గుర్రం. ఆర్యులు మన దేశంలో అడుగు పెడుతూ, గుర్రాలను కూడా తీసుకువచ్చారు. ఆవుల మందలను మేపుకుంటూ తిరుగుతుండే వారు.'



గురూజీ తాము చెప్పేది మధ్యలో ఆపివేశారు. నావంక చూస్తూ 'జయరాం! నీవు ఇక్కడకు వచ్చి ఎంత కాలం అయింది?' అని అడిగారు.

ఒక సంవత్సరం, గురూజీ!

'సంవత్సరం అంటే ఏమిటి?'

పన్నెండు నెలలు.

గురూజీ చిరునవ్వుతో 'కూర్చో' అన్నారు.

## రోజు, సంవత్సరం

'సూర్యుడు భూమి చుట్టూ తిరుగుతున్నట్లు మనకు కన్పిస్తాడు. కాని, సూర్యుని చుట్టూ భూమి తిరుగుతోంది. పైగా తన చుట్టూ తాను తిరుగుతుంది. ఇలా భూమికి రెండురకాలైన చలనాలున్నాయి.'

'తన చుట్టూ తాను ఒకమారు తిరిగే కాలాన్ని ఒక రోజు అని పిలుస్తాము. సూర్యుని చుట్టూ ఒక పర్యాయం తిరిగి వచ్చే కాలాన్ని ఒక సంవత్సరం అంటాము.'

## శకం

ఇలాగే సంవత్సరాలెన్ని అయినాయో గుర్తు పెట్టుకోవాలికదా. ఇందుకు ఏదో

ఒక కొండ గుర్తును ఆధారం చేసుకోవాలి. లేకుంటే ఒక సంఘటనను గానీ, లేక ఒక ప్రముఖ వ్యక్తి పుట్టినప్పటినుండీ గానీ, జ్ఞాపకం ఉంచుకుంటాము. అప్పటినుండి జరిగిన కాలాన్ని ఇన్ని సంవత్సరాలైనదని చెపుతాము.'

'ఇలా క్రీస్తు పుట్టినప్పటి నుండి ఇన్ని సంవత్సరాలైనదని అనటం పరిపాటైంది. క్రీస్తుముందు, క్రీస్తు వెనుక అనే పదాలు ఇంగ్లీషు పాలకులతో పాటు మనకు సంక్రమించాయి. దీన్నే క్రీస్తు శకం అంటాము.'



'మనకు కూడా అనేక శకాలున్నాయి ఆంధ్రదేశంలో. శాలివాహన శకం ప్రచారంలో వుంది ఐనప్పటికీ మనం ఎక్కువగా క్రీస్తు శకాన్నే వాడుతున్నాం. మనమేకాదు, ప్రపంచంలో చాలా దేశాలు ఈ మాటనే వాడుతున్నాయి.'

'జయరాం! ఒక సంవత్సరం అయిందన్నావు. దీని అర్థం నీవు యిక్కడకి వచ్చిన రోజునుండీ అనికదా! శకారంభం కూడా ఇంతే.'

## దాసులు

'మనం మన ఆర్యుల దగ్గరకు వెళ్దాం. క్రీస్తు శకానికి ముందు పదిహేను వందల సంవత్సరాల నాటి మాటలు చెపుతాను. జాగ్రత్తగా వినండి.'

'పంజాబులో ఆర్యగణాలు నివసిస్తున్నాయి. అప్పటికే ఆర్యులు పూర్తిగా స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు.'

'కాని ఖైబర్, బోలన్ కనుమల గుండా ఆర్యులు ఈ ప్రాంతంలోకి రాకముందే ఈ ప్రాంతంలో ఇతర తెగల వారున్నారు. ఆర్యులతో వాళ్లకు యుద్ధాలు జరిగాయి. ఆర్యులు గెలిచారు. అందువలన అనార్యులు ఐదునదుల ప్రాంతాన్ని వదలి పెట్టి దూరంగా వెళ్లి పోయారు. మరికొంత మంది అడవులలోకి వెళ్లారు. కొన్నిజాతుల వారు పడవలలో బయలు దేరారు. అరేబియా సముద్రంలో ప్రయాణంచేశారు.మన దేశం పడమటి తీరం వెంట దక్షిణంగా ప్రయాణం చేశారు.'

'కొంత మంది లొంగి పోయారు. ఇలా లొంగిన వారిని ఆర్యులు చంపివేశారు. కాని, తరువాత కాలంలో వారిని చంపలేదు. వారితో పనులు చేయించుకున్నారు. దాస్యం చేయించుకున్నారు. వాళ్లను దాసులు అనిపిలిచే వారు.'



'ఆర్యుల అలవాట్లు వేరు. వారి చుట్టూఉన్న ఇతరుల అలవాట్లు వేరు. ఆచారాలు వేరు. నమ్మకాలు వేరు. ఇతరులలో కొంత మంది కోటలు కట్టుకుని నివసించే వారు. కొందరు లింగాలను పూజించే వారు. ఎవరి దేవతలు వారికుండేవారు.'

దాసుడు–యజమాని

'అబ్బాయిలూ! ఏదీ నిలకడగా వుండదు. పరిస్థితులు మారినపుడు మానవులు కూడా మారిపోతారు. గుర్రాల మీద ప్రయాణం చేస్తూ, ఆవుల మందలను మేపుకునే ఆర్యులు, మారిపోయారు. వారికి దాసులుగా కొందరు దొరికారు. వారితో చాకిరీ చేయించుకోసాగారు. పొలాల్లో పనులు చేయించేవారు. ఆవులను మేపటం, పాలుతీయటం చేయించేవారు. ఇళ్ళలోనూ, పనులు చేయించుకునేవారు. ఇలా దాసులతో కలిసి ఉండవలసి వచ్చింది. యజమానులు దాసులు ఎడమెడంగా ఉన్నా, పనిపాటల్లో కలిసిపోవలసి వచ్చింది.'

'అబ్బాయిలూ! దూరంగా వుండటం వేరు. కాని మనకు ఇష్టం లేకపోయినా ప్రక్కప్రక్కనే పని చేస్తుంటే కలసి పోవక తప్పదు. మీరైనా అంతే. పరిచయాలు పెరిగి, క్రొత్త వారితో స్నేహాలుగా మారతాయి. ఆర్యులూ దాసులూ ఇలాగే కలసి పోయారు.'

'ఈ దశ దాకా పెరిగిపోయిన ఆర్యులలో కొంత మందికి కొత్త ఆలోచనలొచ్చాయి. తమ దగ్గర పడిఉండి చాకిరీ చేస్తున్న వాళ్లు మంచిగానే ఉంటున్నారు. ఈ దాసులందరూ తాము చేసే ముఖ్యమైన వాటిలో పాలుపంచుకోవటం లేదు. వారిని కలుపుకుని, యజ్ఞాలు చేయటం యిష్టం లేదు. యాగాలు చేయటం కూడని పని. కాబట్టి, కనీసం ఆనందంగా ఉండే వాటిలో కలసి ఉండటంలో తప్పులేదు. పాటలు కలసి వినవచ్చు.ఆటలు కలసి చూడవచ్చు.

క్రీడనీయకం

'కాబట్టి అంతా కలిసి ఆనందించే దేదైనా కొత్త విషయం కనిపెడితే బాగుంటుంది. శూద్రజాతులుగా వున్న దాసులు ఎడంగా నివసిస్తున్నా, బయట

పనులన్నింటిలో వినయంగా పనిచేస్తున్నారు గదా! ఇందువల్ల పెద్దలంతా ఆలోచించారు. శూద్ర జాతులు కూడా చూడటానికి, వినటానికి వీలైన 'క్రీడనీయకం' తయారు చేయించాలనుకున్నారు.'

'అబ్బాయిలూ! జాగ్రత్తగా వినండి, మన పురాణాలలోని కథను చరిత్రకు అన్వయించి చెపుతున్నాను. ఇంతకు ముందు బ్రహ్మ అంగీకరించాడు అని చెప్పాను గదా. అనగా ఆగణం ఒప్పుకుందని అర్థం. గణాలలో చాలా మంది ఉంటారు. వారంతా 'సరే అలాగే' క్రీడానీయాకాన్ని' తయారు చేద్దామని ఒప్పుకున్నారని అర్థం. క్రీడనీయకమంటే తెలుసా? ఆడుతూ, పాడుతూ నాట్యం చేయడం, మన నాటకాల మాదిరిగా ఉంటుంది.'

'ఇలాంటి విషయాలలో భరతమునికి మంచి అనుభవ ముంది. ఈ పని వారికి అప్పజెప్పారు. భరతుడు తన నూర్గురు బిడ్డలకు ఈ విద్య నేర్పాడు. అందరి ముందు ప్రదర్శించాడు. కాని ఈ ప్రదర్శన చూస్తే వారికి నచ్చలేదు. గణానికి బాగుండలేదు. గణానికి అంటే బ్రహ్మకు ఆనందంగా లేదని అర్థం.'

## తాండవాన్ని కలుపుకున్నారు.



'ఆర్యులకు ఎడంగా ఇతరులు అనేకమంది నివసిస్తున్నారని చెప్పాను గదా! ఆ ఇతరులలో ద్రావిడ గణాలున్నాయి. ద్రావిడులు శివుణ్ణి పూజిస్తారు. వారికి తాండవం బాగా తెలుసు.'

'భరతుడు వారి దగ్గరకు వెళ్లాడు. వారితో మాట్లాడి నాడు. వారి ప్రదర్శనలు చూశాడు. వారిలో, ఈ విద్య బాగా తెలిసిన వారిని సంప్రదించాడు. వారు చెప్పగా మెలకువలు తెలుసుకున్నాడు.'

'వారికి తమ ప్రదర్శనలు చూపించాడు. వారు చెప్పిన విమర్శను గుర్తుంచుకున్నాడు. సలహాలను తీసుకున్నాడు. సంధ్యాతాండవంలోని కరణాంగ హారాలను తన నాట్యంలో కలుపుకున్నాడు.'

## కైశికి

'ద్రావిడులకు అలంకారాలంటే బాగా యిష్టం. చక్కగా వెంట్రుకలు ముడి

వేసుకుని, పూలుపెట్టుకుంటారు. దీన్నే కైశికి వృత్తి అంటారు. అనగా ఈ నాటి ఆహార్యం అని చెప్పవచ్చు. లేకుంటే మేకప్ అని అనవచ్చు.'

'ఈ విషయం కూడా భరతుడు నేర్చుకున్నాడు. తన బిడ్డలకు ఆహార్యంతో అలంకరించాడు.'

'మరల అందరి ముందూ ప్రదర్శించారు. ఇంకా ఏదో లోపం కన్పిస్తోంది. అందరికీ పూర్తిగా నచ్చలేదు. ఏదోలోటుంది.'

## అప్సరసలు



'అంతా ఆలోచించారు. ఆడవారు లేకుండా అందరూ మగవారే నాట్యం చేశారు. ఇదే లోటు అని తెలుసుకున్నారు. వెంటనే కొందరు స్త్రీలను ఎంపిక చేశారు. వారితో కలిపి ప్రదర్శన చేయించారు. ఆ ప్రదర్శన చాలా బాగా ఉంది. అందంగా ఉంది. అందరూ కలిసి కూర్చొని ఆనందించటానికి వీలుగా ఉంది. దాసులూ, యజమానులూ సంతోషపడ్డారు.'

## ఫలించింది

'అబ్బాయిలూ! ఈ విధంగా మనదేశంలో అతి ప్రధానమైన మార్పు వచ్చింది. ఎడమెడంగా ఉండే వారు ఒక చోట కలసి కూర్చొని, ప్రదర్శన చూడటం మామూలు విషయం కాదు. ఆ రోజుల్లో తగని పని. ఐనా ఒకడుగు ముందుకు వెళ్ళారు. కొంత వరకు కలిసి పోయారు.'

## మేలు కలయిక

'మన దేశంలోని భాషలు, కళలు, మనం పూజించే దేవుళ్లూ, ఈ విధంగానే రూపొందాయి'.

గురూజీ ఆపివేశారు. మేము ఆలోచించుకోటానికి అవకాశమిచ్చారు. పురాణ



గాథను ఇంతకు ముందు చెప్పారు. దాన్ని చరిత్ర రూపంలో ఈరోజు చెప్పారు. రెండింటిలో వుంది ఒకే కథ. కాని అన్వయంలో ఎంతో తేడా వుంది. మేము నేర్చుకుంటున్న ఈ విద్య వెనుక ఎన్ని జాతుల వారి అనుభవాలున్నాయో! ఎందరు మహనీయులు కష్టపడి వీటిని తయారు చేశారో!

మరోరోజు పాఠం ప్రారంభించారు.

## వలసలు

'సింధునది, దాని ఉపనదుల ప్రాంతం ఆర్యులకు తొలిరోజుల్లో ఉండేందుకు వీలుగా వుంది. వారిజనాభా బాగా పెరిగింది. ఆప్రదేశం చాలటం లేదు. వారు గుంపులు గుంపులుగా ముందుకు సాగిపోతున్నారు. క్రొత్త ప్రదేశాలకు వలసపోతున్నారు. ఇందువలన అంతకు ముందున్న వారితో తగాదాలు తప్పటం లేదు. యుద్ధాలు తప్పటం లేదు. కొందరితో స్నేహం చేసి మంచిగావున్నారు. కొందరితో యుద్ధాలు చేసి ఆక్రమించారు. కొందరిని తమలో కలుపుకున్నారు. మరికొందరితో బంధుత్వాలు చేశారు, ఇలా సాగిపోతూ గంగానది వెంట చాలా దూరాలకు వెళ్లి పోయారు.'

## భాషలు మారాయి

'ఈ ప్రయాణంలో సింధునది ప్రాంతంలో వారు మాట్లాడిన భాష మారిపోయింది. ఋగ్వేద కాలంలో వాడిన భాషకు ఈ దశలో మాట్లాడే భాషకూ

పోలికే లేదు. ఆచార వ్యవహారాలలో ఎన్నో మార్పులొచ్చాయి.'

'ఉత్తర భారత దేశంలో ఆర్యులు బాగా వ్యాప్తి పొందారు. అందువల్ల దీన్ని ఆర్యావర్తం అన్నారు.'

'ఆర్యులు తూర్పుగా ప్రయాణించారు. గంగవెంటే వెళ్లారు తరువాత మరికొందరు దక్షిణానికి బయలు దేరారు. దారిలో మహారణ్యాలున్నాయి. వింధ్య పర్వతాలు గోడల్లాగా అడ్డుకున్నాయి. సాత్పూరా పర్వతాలున్నాయి. నర్మద, తపతి నదాలున్నాయి. వీటన్నిటినీ దాటాలంటే చాలా కష్టం.'

## అగస్త్యుడు

'అగస్త్యుడు అనే మహర్షి వున్నాడు. ఈయన ఆర్య ఋషి. ఈయన భార్య పేరు లోపాముద్ర. ఈదంపతులిద్దరూ బయలు దేరారు. వింధ్య పర్వతం పెద్దకు వచ్చారు. అగస్త్యుడు చాలా గొప్పవాడు. వింధ్య పర్వతం భక్తితో తలవంచింది. ఈయన పాదాలకు నమస్కరించింది.'



'అప్పుడు ఆమహర్షి వింధ్యతో అన్నాడు. "నేను దక్షిణానికి వెళ్తున్నాను. నేను వచ్చేటంతవరకు యిలాగే వంగి ఉండ"మని చెప్పాడు. ఆపర్వతం మీదుగా దక్షిణానికి వచ్చాడు. పాపం! ఆపర్వతం తలవంచుకుని అలాగే ఉండిపోయింది.'

'ఈవిధంగా ఈ కథ పురాణాలలో వ్రాశారు. ఆ ముని తిరిగి వెళ్లనే లేదు. వింధ్య పర్వతం తలలేపుకోటానికి అవకాశమే లేకపోయింది. అగస్త్యమహాముని గొప్పతనాన్ని చాటేటందుకు ఇలా వ్రాశారని అనిపిస్తుంది.'

'దారి చేసుకుని దక్షిణానికి రావాలనుకునే వారికి వింధ్య పర్వతం అడ్డుగా ఉండేది. అగస్త్యుడు దారి కనుక్కున్నాడు. అందుకే ఈ కథ పురాణాల్లోకి వెళ్లింది.'

## కలయికలు

'ఈ విధంగా ఆర్యులు దక్షిణ భారత దేశంలో అడుగు పెట్టారు. అప్పటికే ఈ ప్రాంతంలో అనేక మంది వున్నారు. వారితో ఆర్యులు క్రమేణా సంబంధాలు పెంచుకున్నారు. కొన్ని చోట్ల కలిసి పోయారు. ఈ కలయిక ఒకనాడు జరిగింది' కాదు. వందల సంవత్సరాల పొడవునా జరిగింది. ఇలా కొత్తకొత్త మిశ్రమ జాతులు తయారయినాయి.'

'భాషలో కూడా మార్పు వచ్చింది. అనార్యులు ఆర్యుల భాషను మాట్లాడసాగారు. మాట పలకటంలో యాస వచ్చింది. క్రమేణా మిశ్రమ భాషలొచ్చాయి. క్రొత్త భాషలుగా తయారయినాయి. భారత దేశమంతా యిలాగే జరిగింది.'

## పాళిభాష

'ఇలా వచ్చిన భాషల్లో 'పాళిని' చెప్పుకోవచ్చు. 'మాగధి'ని చెప్పుకోవచ్చు. ఇంకా ఎన్నో భాషలను ఉదహరించవచ్చు. కాని అసలైన ఆర్యభాష మాయ మయిపోయింది. కాలంతో పాటు వెళ్లి పోయింది. దాని కొత్త రూపంగా మరో భాష వచ్చింది. ఆభాషను సంస్కరించారు. దాన్ని సంస్కృత మని పెద్దలు పిలిచారు.'

## ప్రాకృతం

'ఆర్యులు ఇతరులను పూర్వం మాదిరిగా దాసులని అనటంలేదు. యథార్థానికి సింధులోని ఆర్యులకు, తరువాత వారికీ చాలా తేడావుంది. గంగా తీరంలోని ఆర్యులు ఇతరులను ప్రాకృతులు అని పిలిచేవారు. వారి భాషలు కాని వాటిని ప్రాకృతం

అనేవారు. ఇలా ఒకే మాటతో ఇతర భాషలను పిలిచేవారు.'

'క్రమేణా నృత్యంలో మార్పు వచ్చింది. ఇతరుల నృత్యాలలోని మంచిని



కలుపుకున్నారు. అందంగా ఆడసాగారు. నాట్య శాస్త్రం వ్రాసే నాటికి ఒక రూపం ఏర్పడింది. అది నాట్యం అనే పేరుతో బాగా అభివృద్ధి పొందింది.'

'ఇలా మన దేశంలోని జాతులు, భాషలు, క్రమంగా పెరిగిపోయాయి. ఈనాటి రూపాన్ని పొందాయి. ఇందు వలన మీరు తెలుసు కోవలసిన ముఖ్య విషయం ఒకటున్నది. ఒకరు హెచ్చు, మరొకరు తక్కువ అనే భావం మంచిది కాదు.'

'మనకున్న ఆచారాలు, ఆలోచనలు, ఒక జాతి నుండి వచ్చినవి కావు. అనేక జాతుల అభిప్రాయాలు, ఆలోచనలు, కలసిపోయి, మనకు వారసత్వంగా వస్తున్నాయి. ఒక ఉదాహరణ చెపుతాను. తాండవాన్ని ఆర్యులు తమకు సంబంధం లేనిదని దూరంగా కూర్చోలేదు. ఈ నృత్తం మనకెందుకనుకోలేదు. నాట్యంతో మనకేమి పని అని అనార్యులు భావించలేదు.'

## అభివృద్ధి

'అలా అనుకొని దూరంగా వుంటే, యీనాటి దశకు మనం చేరుకునే వాళ్లం కాదు. ఇతరుల కళారూపాలను తెలుసుకోవాలి. వాటిలోని మంచిని ఎంచుకోవాలి. వారి ప్రావీణ్యతను అర్థం చేసుకోవాలి. మనకు నచ్చిన దానిని మనం కలుపుకోవాలి. అప్పుడు మనం అభివృద్ధి చెంద గలుగుతాము. కాదను కుంటే చాలా నష్టం జరుగుతుంది. మురుగు నీటి మడుగులా అయిపోతాము. పసరు కోనేరులా మారిపోతాము.'

'ఈవిధంగా ఆర్య జాతుల ప్రాపకం వలన, క్రొత్త దశ ప్రారంభమయింది.

ఈనాడు వీరు ఆర్యులు- సింధు తీరంలో పూర్వం వున్న వారని చెప్పేందుకు, ఎక్కడా కనిపించరు. మన పూర్వీకులు అంతగా కలసి పోయారు.'

## అందరూ సమానులే

'అబ్బాయిలూ! మనం భారతీయులం. భారతమాత బిడ్డలం. అన్ని భాషలూ ఆమె మాటలే. అన్ని ఆటలూ ఆమె అభినయాలే. అందరూ సమానులే.ఈ విషయాన్ని మాత్రం ఎప్పుడూ మరచిపోవద్దు.

'ఈరోజుకి చాలు. వెళ్లి నదిలో స్నానం చేసిరండి' అన్నారు.

అందరం కృష్ణ నీటి వైపు బయలు దేరాము.



మరో వారం గడచి పోయింది. సాయంకాలం గురూజీ వెంట కృష్ణానది ప్రక్కగా నడుస్తూవెళ్ళి, మెత్తని ఇసుకలో కూర్చున్నాము. ఆకాశం నిర్మలంగా వుంది లోతు తక్కువగా వున్న నీటిలో కొంగలు నిలబడి వున్నాయి. ఏకాగ్రతతో జపం చేస్తున్నాయి. చిరుగాలికి అలలు కదలుతున్నాయి. ఒక దాని వెంట మరొకటి పరుగులు తీస్తున్నాయి. రెల్లులంకలో కోత మొదలుపెట్టలేదు. రెల్లు పూత తెల్లగా అందంగా వుంది. గాలికి కదలి నృత్యం చేస్తున్నట్లుంది.

## గురూజీ ప్రారంభించారు

'మీ అందరికీ నాట్యాన్ని గూర్చిచెప్పాను. ఆర్యులు అధికంగా అభివృద్ధిపరచింది





నాట్యం. అనగా నాటకం అని చెప్పవచ్చును. ఆర్యులు తమ నాట్యానికి శివుని నృత్తాన్ని కలిపినారని చెప్పాను కదా! అప్పుడు నృత్యం తయారయింది. కాని ఈ రోజుల్లో నాట్యమన్నా, నృత్యమన్నా, నృత్తమన్నా ఒకటిగానే చూస్తున్నారు. తేడాలను గమనించటం లేదు. దాదాపు ఒకే అర్థంతో వాడుతున్నారు. నాట్యం బాగా తెలిసిన వారు మాత్రం ఈ పదాలను సరిగా ఉపయోగిస్తున్నారు.'

## తాండవమూర్తి

'తాండవాన్ని చేయటంలో ఈశ్వరుని మించిన వారు లేరు. అందుకే ఆయనను నటరాజని పిలుస్తారు. నట రాజు స్వరూపాన్ని బొమ్మలుగా, విగ్రహాలుగా, శిల్పాలుగా మనం చూస్తుంటాము. వీటన్నిటిలో కన్పించేది ఒకే ఒక నృత్త స్వరూపం. అదే తాండవం.'

'ఇందు వలన పరమేశ్వరుని గూర్చి మీరు తెలుసుకోవాలి. ఇలాగే పార్వతీ దేవిని గూర్చి కూడా తెలుసుకోవాలి. కాని ముందుగా ప్రకృతిలో వస్తున్న మార్పులను గూర్చి అర్థం చేసుకోవాలి. ఈరోజు మీకు ఈ మార్పులను గూర్చి బోధిస్తాను. పరమేశ్వరుని గూర్చి చెపుతూ మరో విషయాన్ని ఎందువలన చెప్ప వలసి వచ్చిందో తరువాత తెలుస్తుంది.'



## ఆరుకాలాలు

ప్రకృతి ప్రతిక్షణం మారిపోతూ వుంటుంది. కాని మనకు ఆ విషయం వెంటనే తెలియదు. రెండేసి నెలలకు

యీమార్పును మనం తెలుసుకో గలుగుతాము. సంవత్సరంలో ఆరు మార్పులు వస్తాయి. యీ ఆరు మార్పులను ఆరు పేర్లతో పిలుస్తారు. వీటినే ఆరు కాలాలని మన పల్లెటూళ్లల్లో రైతులు అంటుంటారు. ఋతువులనీ అంటారు .తెలుగు మాసాలలో వీటిని వివరిస్తాను.'



## వసంతకాలం

'చైత్ర, వైశాఖ మాసాలు వసంతకాలం. ఈ ఋతువుకున్న లక్షణాలు చాలా అందంగా వుంటాయి. చెట్లన్నీ చిగురిస్తాయి పూలుపూస్తాయి. ఎటువైపు చూచినా అందంగా కన్పిస్తుంది. సుందరంగా ఉంటుంది అందుకే ఋతువులకు వసంతకాలం రాజు అని కవులన్నారు.'

## వేసవి కాలం



ఆ తరువాత గ్రీష్మ ఋతువు వస్తుంది జ్యేష్ఠ, ఆషాఢ మాసాలను వేసవి కాలం అని పిలుస్తాము. ఎండలు ఎక్కువగా ఉంటాయి వేడిగాలి వీస్తుంది. దీనినే వడగాలి అంటాము దాహం అధికంగా ఉంటుంది. చల్లని నీరు త్రాగాలని పిస్తుంది. భూమి బాగా ఎండిపోతుంది. నేలంతా బీటలు వారుతుంది వానకురిస్తే బాగుండుననిపిస్తుంది.'



## వర్షాకాలం

'శ్రావణ, భాద్రవద మాసాలు వర్షాకాలం. ఆకాశమంతా మబ్బులతో నిండివుంటుంది. ఏనుగులు కదుల్తున్నట్టుగా మేఘాలు వెళ్తుంటాయి. తొండాలతో నీరు గుమ్మరించినట్లు వర్షం పడుతుంది. కుండతో పోసినట్లు కురుస్తుంది. చెరలన్నీ నీటితో

నిండిపోతాయి. భూమి మెత్తబడి బురద అవుతుంది. నదులు పొంగి పరుగులు తీస్తాయి. చెరువులు నిండి పోతాయి. నేలంతా పచ్చబడుతుంది. నేలదున్ని రైతులు విత్తనాలు వేస్తారు. ఎటు వైపు చూసినా పచ్చగా ఉంటుంది.'

## శరత్కాలం



"ఆ తరువాత శరత్కాలం వస్తుంది ఆశ్వయుజ, కార్తీక మాసాలను శరత్కాలమని పిలుస్తారు. దీనినే వెన్నెల కాలమని అంటారు. ఆకాశం నిండా తెల్లని మబ్బులుంటాయి మల్లెపూల దండల మాదిరిగా ఉంటాయి హంసల మాదిరిగా అవి కదలిపోతుంటాయి. నదులలో, చెరువులలో నీరు మురికితగ్గి శుభ్రంగా ఉంటుంది.



## చలికాలం

'మార్గశిర, పుష్య మాసాలు చలికాలం. గజగజ వణికించే చలికి తట్టుకోవటం కష్టంగా వుంటుంది. కడుపులో కాళ్లు పెట్టుకుని, ముప్పటిలో దూరిపోవాలని పిస్తుంది. మనుషుల్లో చురుకు తగ్గిపోతుంది. ఎత్తుగా వుండే పర్వత శిఖరాలు మంచుతో నిండి పోతాయి. వాటిపై నుండి దూకే నదులు గడ్డ కట్టుకు పోతాయి.'

## ఆకురాలు కాలం



'ఆరోకాలం ఆకురాలుకాలం. దీనిని శిశిరం అంటారు. మాఘు, ఫాల్గుణ మాసాల్లో వస్తుంది. చెట్లన్నీ ఆకులు రాల్చి, మోడుగా కన్పిస్తాయి. రాబోయే వసంత కాలాన్ని పిలుస్తున్నట్లుంటాయి. ఈ విధంగా ప్రకృతి పన్నెండు నెలల్లో ఆరు వేషాలు వేసుకుంటుంది. ఆరు రకాలులగా మనకు కన్పిస్తుంది.'

'భూమధ్య రేఖ అని వినే ఉంటారు. దీనికి రెండు వైపులా కర్కాటు, మకర రేఖలుంటాయి. వీటిని దాటి మనం ధృవాల వైపు వెళ్లే [illegible] కాలాల సంఖ్య తగ్గుతుంది. ఇది వేరే అంశం. తరువాత చెపుతాను.'

## కవి వర్ణనలు

'ఈమార్పుల అందాలను కవులు వర్ణించారు. కాళిదాస మహాకవి పేరు వినే వుంటారు. ఆయన సంసకృత భాషలో వ్రాశాడు. గొప్పగా కవిత్వం చెప్పాడు. ఆయన భోజ రాజు దగ్గర ఉండే వాడు **ఋతుసంహారం** అనే కావ్యంలో ఆరు కాలాలను గూర్చి వర్ణించాడు. అనేక మంది కవులు ఋతువులను వర్ణించి చెప్పటం ఆచారంగా పెట్టుకున్నారు.'



## హోలీ

'మనం చెప్పుకున్న పన్నెండు తెలుగు నెలలలోనూ ఫాల్గుణ మాసం చివరి నెల. ఈ నెలలో వచ్చే పూర్ణిమను హోలీ పూర్ణిమ అని పిలుస్తారు. మన దేశంలోని అనేక మంది ప్రజలు హోలీ పండుగను ఆనందంగా జరుపుకుంటారు. ముఖ్యంగా ఉత్తర భారత దేశానికి ఈ పండుగ అతి ముఖ్యమయినది. రంగుల నీళ్లు చల్లుకుని, వసంతోత్సవం చేస్తారు. గులాం తెచ్చి ప్రతి వారికీ పూస్తారు; ఇతరుల మీద చిమ్ముతారు. ఆనందంలో మైమరచిపోతారు. తియ్యని పదార్థాలను పంచి పెడతారు. ఉన్నవారు లేని వారు అనే తేడా లేదు. ఎవరి శక్తి కొలది వారు ఈ పండుగ జరుపుకుంటారు.' దీన్ని మనవారు కాముని పున్నమి అంటారు.



## సంక్రాంతి

'దక్షిణ భారతంలో నాలుగు రాష్ట్రాలున్నాయి. వీటిని ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, కేరళ, తమిళ ప్రాంతాలని పిలుస్తాము. ఇక్కడ హోలీకి అంతగా

ప్రాముఖ్యత లేదు. దీని బదులు సంక్రాంతి పండుగ చేసుకుంటారు. మారే కాలానికి అనుగుణంగా పంటలు వేసే కాలంకూడా మారుతుంది. ధాన్యాలు యింటి కొచ్చే కాలంలో తేడా వుంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో సంక్రాంతి పండుగకు క్రొత్త పంటలు చేతికందుతాయి. బంతి, చేమంతి అందంగా పూస్తాయి. పొన్నమానులు తెల్లని పూలను రాలుస్తాయి. ఇంతమంచి కాలంలో వచ్చే సంక్రాంతి పండుగ ఆంధ్రులకు అతిముఖ్యమయిన పండుగ.'

'మరల మనం మన పురాణ దంపతులైన పరమేశ్వరుడు, పార్వతీ దేవిని గూర్చి చెప్పుకుందాం. వారికీ వసంతకాలానికీ వున్న సంబంధం మీకు చెపుతాను. వసంతోత్సవమైన హోలీతో వారికి కూడా సంబంధం వుంది. కాని, ఈ కథంతా రేపు వివరిస్తాను. ఈరోజుకు చాలు అన్నారు.'

మేమంతా ఆశ్రమం వైపు బయలు దేరాము. మా తలలపైగా కొంగలు బారులు తీరి వెళ్తున్నాయి. పాడి గేదెలను, ఆవులను తోలుకుని కమత గాళ్లు గ్రామం వైపుకు వెళ్తున్నారు.

గురూజీ వెనుక నడుస్తూ ఆశ్రమం చేరాము.

## దక్ష ప్రజాపతి

మరునాడు గురూజీ ప్రారంభించారు.

'చాలా సంవత్సరాల క్రిందట దక్షుడనే ప్రజాపతి వుండేవాడు. ఆయనకు చాలామంది ఆడపిల్లలున్నారు. వారిలో పెద్దమ్మాయి పేరు సతీదేవి. ఆమెను శివునికిచ్చి వివాహం చేశారు.'

'ఒకరోజు దక్షుడు కూతుర్ని చూడాలని వెళ్ళాడు. శివుడు కళ్ళు మూసుకుని ధ్యానం చేస్తున్నాడు. మామగారి రాక ఆయన గమనించలేదు. సతీదేవి తండ్రిని గౌరవించింది.'

'దక్షుడు యింటికి తిరిగి వచ్చాడు. అల్లుడు తనను మర్యాద చేయలేదని కోపగించుకున్నాడు. శంకరునికి బాగా గర్వం బలిసిపోయిందనుకున్నాడు. తల పొగరు దించేస్తానన్నాడు. ఏదో ఒకటి చేసి అగౌరవపరచాలనుకున్నాడు. ఇందు కొరకు యజ్ఞం చేయాలనుకున్నాడు.'

## దక్షయజ్ఞం

'ఈ యజ్ఞానికి దక్షుడు ఇంద్రుని పిలిచాడు. చంద్రుని పిలిచాడు. సూర్యుని, ఇతర దేవతలను ఆహ్వానించాడు. దిక్కులను పాలించే ఇతరులను కూడా రమ్మన్నాడు. కాని పెద్ద కూతురినీ, అల్లుణ్ణీ పిలువలేదు.'

'తండ్రి యజ్ఞం చేస్తున్న సంగతి సతీదేవికి తెలిసింది. కన్న వారింటికి వెళ్లి ఆక్రతువు చూడాలనుకుంది. పుట్టింటిలో జరిగే వేడుకకదా! ఆమెకు కాలాగటం లేదు. భర్తను అడిగింది. శంకరుడు సతీదేవి కోరికను తెలుసుకున్నాడు. మామగారి దురాలోచన ఆయనకు తెలుసు. పిలవని పేరంటానికి వెళ్ళటం మంచిది కాదన్నాడు.'

'సతీదేవి అంగీకరించలేదు. తాను వెళితే తన కన్నవారు ఎంతో గౌరవిస్తారంది. పనులతొందరలో పిలవటం మరచిపోయారంది.'

'శంకరుడు మౌనంగా విన్నాడు. "సరే! నీయిష్టం" అన్నాడు.'

## పిలువని పేరంటం

'భర్త దగ్గర నుండి బయలు దేరి, ఆమె కన్న వారింటికి వెళ్లింది. సంతోషంగా అడుగుపెట్టింది.'

'యజ్ఞశాలలో హెూమం జరుగుతోంది. చుట్టూ పెద్దలంతా కూర్చున్నారు. సతీదేవి చెల్లెళ్ళ దగ్గరకు వెళ్ళింది. వాళ్లెవ్వరూ ఆమెను ప [illegible] కరించలేదు.'

'సతీదేవి చిన్న బుచ్చుకుంది. నెమ్మదిగా తల్లి దగ్గరకు వెళ్ళింది. కన్న తల్లి ముఖం ప్రక్కకు తిప్పుకుంది. అక్కడ వుండకుండా ఎడంగా వెళ్ళిపోయింది.'



'సతీదేవికి మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది. తనను కనిపెంచిన తల్లి ఆదరించలేదు. కనీసం ఎప్పుడొచ్చావని అడుగనన్నాలేదు. పాపం! ఆమె మనసు వుడికి పోయింది. కుతకుత లాడిపోయింది. కోపం వచ్చింది. దుంఖం కలిగింది. అవమానంతో కుంగిపోయింది. అక్కడ నిలబడలేక పోయింది.'

## అవమానం

'యజ్ఞ వేదిక చుట్టూ దేవతలు కూర్చుని వున్నారు. దక్షుడు యజ్ఞం చేస్తున్నాడు. సతీదేవి అడుగులో అడుగు వేసుకుంటూ, తండ్రి దగ్గరకు వెళ్లింది. ఎదురుగా నిలబడి వున్న కూతురును దక్షుడు చూశాడు. కళ్ళెర్ర చేశాడు. సిగ్గులేదన్నాడు. పిలవని పేరంటానికెందుకొచ్చావని నిందించాడు.'

'సతీ దేవికి కోపం వచ్చింది. తండ్రి వంక చూస్తూ నిలబడింది. దక్షుడు అంతటితో వూరుకోలేదు. అల్లుణ్ణి తిట్టి పోశాడు. నోటికొచ్చిన చెడ్డమాటలన్నీ అన్నాడు. శివుడు అడుక్కు తినే వాడన్నాడు. పనికిరాని వాడన్నాడు. తోలుకప్పుకుంటాడన్నాడు. ఉండేందుకు కొంప కూడా లేనివాడన్నాడు. పైగా ఒట్టి గర్వపోతని నిందించాడు.'

'సతీ దేవి కోపంతో వణికి పోయింది. ఏం చేయాలో తోచలేదు. ఏవిధంగా సమాధానం చెప్పాలో తెలియలేదు. తండ్రి తనను అవమానించాడు. తన భర్తను అవమానించాడు. ఇంత జరిగాక, శివుని దగ్గరకు ఏముఖం పెట్టుకుని వెళ్ళాలి? కాదను కుంటే కన్న వారింట్లో వుండటం ఎలా? పాపం ఆమె నిస్సహాయురాలైపోయింది. ప్రపంచంలో ఒక్క క్షణం కూడా వుండకూడదనుకుంది.'

## ప్రాణం వదలింది

'దక్షప్రజాపతి ఎగతాళిగా మాట్లాడ సాగాడు. ఆపకుండా నిందించసాగాడు. సతీదేవి కోపంతో అందరి వంకా చూసింది. చివరి సారి భర్తను తలచుకుంది. తన తప్పు క్షమించమని ప్రార్థించింది. ప్రాణాలను వదలి పెట్టింది. ప్రాణం పోయిన సతీదేవిని అందరూ చూశారు. హాహాకారాలు చేశారు. శంకరుని తలచుకుని వణికి పోయారు. కాని దక్షుడు యజ్ఞం ఆపలేదు క్రతువు జరుగుతూనే వుంది.'

'ఈ వార్త శివునికి తెలిసింది. ఆయన కనులు కోపంతో మండిపోయాయి. ఎర్రని నిప్పుకణికలై పోయాయి. కనుబొమలు ముడిపడినాయి. నుదురు నిండా చెమట పట్టింది.



వీరభద్రుడు

ఆయన చేత్తో ఆచెమట తీసి నేలపై విసిరాడు.'

## వీరభద్రుడు

అంతే. 'ఏమిసెలవు, తండ్రీ! ఏమి సెలవంటూ వీరభద్రుడు పుట్టుకొచ్చాడు. చూస్తేనే భయం పుట్టేటట్లు న్నాడు.'

'శంకరుడు జరిగిందంతా చెప్పాడు.'

'వీరభద్రుడు బయలు దేరాడు. వెంట ప్రమథ గణాలన్నీ కదిలాయి. అందరూ దక్షయజ్ఞం దగ్గరకు వెళ్లారు. అక్కడ కూర్చున్న వారిని చితక బాదారు. గడ్డాలూ, మీసాలు పట్టుకుని బరబర బయటకు లాగారు. జుట్టుపట్టుకుని విసిరి నేలకేసి కొట్టారు. యజ్ఞశాలను ధ్వంసం చేశారు.'

'వీరభద్రడు సూర్యుణ్ణి ఒక్క తన్ను తన్నాడు. సూర్యుని పన్ను విరిగిపోయింది. తొర్ర ఏర్పడింది. చంద్రుణ్ణి, ఇంద్రుణ్ణి వీపు చితక్కొట్టాడు. అక్కడ దెబ్బలు తినని వారు లేరు. అవమాన పడని వారు లేరు.'



'భయంతో గజగజ వణుకుతూ దక్ష ప్రజాపతి నిలబడి పోయాడు. వీరభద్రుడు దక్షుని శిరస్సు నరికి వేశాడు. ప్రమథ గణాలను తీసుకుని కైలాసానికి వెళ్లి పోయాడు. దక్షుని భార్య రెండు ముక్కలై పోయిన భర్తను చూసింది. శవంగా మిగిలిన కూతుర్ని చూసింది. స్మశానంలాగా వున్న యజ్ఞశాలను చూసింది. గోడుగోడుని ఏడ్చింది. చివరకు శివుని దగ్గరకు వెళ్లింది. చేతులు జోడించి అల్లుణ్ని ప్రార్థించింది.'

## మేకతల

'జాలిగుండెల వాడు శంకరుడని చెప్పాను గదా! "సరే! దక్షుని బ్రతికిస్తాను" అని మాట యిచ్చాడు. ఒక మేకతల తెప్పించి ప్రజాపతి మొండానికి అతికించాడు. ప్రాణం పోశాడు. దక్షుడు మేకతలతో, అల్లుణ్ని పొగిడాడు. నమస్కరించి వెళ్లి పోయాడు.'

'దక్ష యజ్ఞ విధ్వంసాన్ని మరో విధంగా చెపుతారు. ఆర్యులకు యజ్ఞయాగాదులంటే బాగానమ్మకం వుంది. కాని అనార్యులకు అవంటే యిష్టం వుండేవి కాదు. ఇందు వల్ల యజ్ఞాలను విధ్వంసం చేసేవారు. దక్ష యజ్ఞాన్ని పాడు

చేయటమనేది ఒక ఉదాహరణగా చెపుతారు.'

'ఈ యజ్ఞం జరిగిన ప్రాంతం గోదావరీ తీరంలోని ద్రాక్షారామం అని చాలా మంది నమ్మకం.'

'అబ్బాయిలూ! ఈరోజు విధ్వంసకాండను గూర్చి చెప్పాను. పరమేశ్వరుడు చాలా దుఃఖించాడు కదా! భార్యా వియోగంతో ఆయన చాలా బాధపడ్డాడు. ఆ తరువాత ఆయన ఏం చేశాడో రేపు చెపుతాను.' అన్నారు.

ప్రొద్దుదిగి పోయింది. పడమటి దిశ ఎర్రగా నిప్పులు చిమ్మినట్లుంది. చూడటానికి చాలా బీభత్సంగా వుంది. అందరం మౌనంగా ఆశ్రమం వైపు బయలు దేరాము.

మరునాడు కొబ్బరి తోటలో కూర్చున్నాము. కొబ్బరాకులు పొడుగ్గా ఆడుతున్నాయి. పురివిప్పిన నెమలి పింఛంలా వున్నాయి. ఆకుల మధ్యగా సూర్యకాంతి నాట్యం చేస్తోంది.

గురూజీ ప్రారంభించారు.

## శక్తి పీఠాలు

'శంకరుని దుఃఖానికంతే లేదు. ఆయన బాధను తీర్చగలిగిన వారు లేనే లేరు. ఆయన దగ్గరకు వెళ్లాలన్నా భయంగా వుంది. దివరకు సతీదేవి శవాన్ని భుజాన వేసుకున్నాడు. ఆవేశంతో తాండవం చేయసాగాడు.'



'లోకాలన్నీ వణకి పోయాయి. అంతా విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళారు. ఆయన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. సతీదేవి శరీరాన్ని ఆచక్రం పదునెనిమిది ముక్కలుగా ఖండించింది. శివుడు యిది గమనించ లేదు. ఆయన తాండవం చేస్తూనే వున్నాడు. ఒక్కోముక్కా విడిపోయి, పద్దెనిమిది ప్రాంతాలలో పడినాయి. ఆ ప్రదేశాలలో శక్తి పీఠాలు వెలశాయని పురాణాలు చెపుతున్నాయి.'

'చివరకు శివుడు శాంతించాడు. కాని, సతీవియోగం సహించలేక పోయాడు బాధ పడ్డాడు. దుఃఖపడ్డాడు. విరక్తి చెందాడు .హిమాలయాలకు వెళ్లాడు. అక్కడ తపస్సు చేయసాగాడు.'

'సతీ దేవి హిమవంతుని కూతురుగా జన్మించింది. ఆమెను పార్వతి అని పిలిచారు. గిరిజ, హైమవతి అనేవారు. ఇంకా పార్వతికి చాలా పేర్లున్నాయి.'

## తారకాసురుడు

'పూర్వం అసురులలో తారకుడనే వాడుండే వాడు. అతను బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. ఎన్నో వరాలు పొందాడు. ఈ వరబలంతో దేవలోకం మీద దండెత్తాడు. ఇంద్రుణ్ణి దేవతలను నానాబాధలు పెట్టాడు. తారకుని ఎల్లాగైనా వదలించుకోవాలని దేవతలు నిశ్చయించుకున్నారు.'



'వరాలిచ్చిన బ్రహ్మను ప్రార్థించారు. ఆయన అంగీకరించలేదు. విష్ణుమూర్తి కూడా వప్పుకోలేదు. ఒక మిగిలింది శంకరుడు. ఆయన భార్యా వియోగంలో ఉన్నాడు. విరక్తిగా వున్నాడు. తపస్సులో మునిగి ఉన్నాడు.'

'తారకాసురుని వధించటానికి బలమైన వ్యక్తి కావాలి. దేవతలంతా ఆలోచించారు. బ్రహ్మను సలహా చెప్పమన్నారు. "శివునకు పుట్టే కుమారుడు మాత్రమే తారకుని చంపగలడు. ఈ పని మరెవ్వరివల్లా "కాదని బ్రహ్మ చెప్పాడు.'

'హిమాలయాలలో ముక్కు మూసుకుని శివుడు తపస్సు చేస్తున్నాడు. సన్యాస దీక్షలో వున్నాడు. విరక్తిగా వున్నాడు. ఈయన మనసులో మార్పు రావాలి. ప్రేమ కలగాలి. పెళ్లి చేసుకోవాలి. ఆ తరువాత సంతానం కలగాలి. అప్పుడు మాత్రమే తారకుని పీడ వదలుతుంది.'

'పార్వతికి వయసు వచ్చింది. అందంగా వుంది. రోజూ పూజకు పూలు తీసుకువెళ్ళేది. వాటిని శివునకు అందించేది. భక్తితో ఆయనకు సేవలు చేసేది.'

'దేవతలు మరల ఆలోచించారు. సతీదేవి పార్వతిగా జన్మించిందికదా? రోజూ ఆమె శివునికి సేవలు చేస్తోంది.వీరిద్దరినీ కలిపితే, దేవ కార్యం పూర్తవుతుంది.

కాని, వీరిని కలపటం సామాన్యమైన విషయం కాదు. ఈపని చేయగలవాడు మన్మధుడు ఒక్కడే.'

## మన్మధునికి తప్పలేదు

'దేవతలంతా మన్మధుని ప్రార్థించారు. ఆయన సరేనని మాటయిచ్చాడు.'

'మన్మధుని భార్యపేరు రతీదేవి. ఆమె వద్దని వారించింది. "అస్సలే శివుడు కోపిష్టి. మూడో కన్ను నిప్పుకన్ను. కోపంతో ఆకన్ను తెరిస్తే ప్రపంచం తగలబడిపోతుంది. బూడిదకుప్పలైపోతుంది. "వద్దు వద్దంది". బ్రతిమాలింది.'

'దేవతలు చేతులు జోడించారు. ఇది దైవకార్యం. తప్పక చేయవలసిందని ప్రార్థించారు.'

'మన్మధుడు భార్యమాట వినలేదు. శివుడున్న చోటుకు బయలు దేరాడు.'

'మన్మధుడు చాలా చిత్రమయిన వాడు. చిలుక వాహనం మీద కూర్చున్నాడు. చెరకు గడతో చేసిన విల్లు పట్టుకున్నాడు. తుమ్మెదల నారి తగిలించాడు. అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం అనే ఐదుపూల బాణాలు తీసుకున్నాడు. స్నేహితుడు వసంతుని వెంటరమ్మన్నాడు. ధైర్యంగా హిమవంతుని రాజ్యంలో అడుగుపెట్టాడు.'

## తపోభంగం

'వసంతుని మహిమవలన చెట్లన్నీ పుష్పించాయి. కోయిలలు గొంతెత్తి కూస్తున్నాయి. చిలుకలు తీయగా పలుకుతున్నాయి. వాతావరణం అందంగా మారిపోయింది. '



'పార్వతి పూలు అందిస్తోంది. శివుడు అందుకుంటున్నాడు. ఇదే సరియైన సమయమని మన్మధుడు బాణం వేశాడు.'

'శివుని మనస్సు చలించింది. పార్వతివైపు చూశాడు. ఆమె మీద ప్రేమ కలిగింది. వెంటనే ఆశ్చర్యం కూడా కలిగింది. సన్యాసికి ప్రేమ కలగట మేమిటనుకున్నాడు. ఇలా జగగటానికి కారణమేమిటా అని ఆలోచించాడు. ఆయనకు అర్థమయింది.

తపో భంగం చేసినందుకు కోపం వచ్చింది.'

## మూడోకన్ను

'అంతే ! మూడోకన్ను తెరిచాడు. నిప్పులు చిమ్ముతున్నాయి.మంటలు చెలరేగాయి. మన్మధుడు భగ్గున మండి బూడిదైపోయాడు.'

'పార్వతి సిగ్గు తో, భయంతో అక్కడ నుండి వెళ్ళి పోయింది.'

'దేవతలంతా శివుని ప్రార్థించారు. రతీ దేవి వెళ్లి పతి భిక్ష పెట్టమని వేడుకుంది. దయ గల దేముడు శంకరుడు. మన్మధునికి కామరూపం యిచ్చాడు.'

'మన్మధుడు మనకంటికి కనుపించడు. కాని, ఆయన జీవించి వుంటాడు. ప్రాణుల మనసులో వుంటాడు.'

## హెూలీ పండుగ

'అప్పుడు దేవతలు ఆనందంతో పండుగ చేశారు. దానినే వసంతోత్సవంగా మనం జరుపుకుంటున్నాము. భారతీయులు చేసుకునే హెూలీ పండుగ యిదే. ఈ పండుగ ఎక్కువగా ఉత్తర భారతదేశంలో ప్రజలు ఎక్కువగా చేసుకొంటారు.'

## కల్యాణం

'కొంత కాలం జరిగాక హిమవంతుడు, అతని భార్య మేనకా వెళ్ళారు. శివుణ్ణి ప్రార్థించారు. ఆయన అంగీకరించాడు. పార్వతి నిచ్చి శివునకు పెళ్లి చేశారు. ఇలా పార్వతీ పరమేశ్వరులు దంపతులయినారు. ఈ దంపతులు కైలాసంలో వుంటారు. గొప్ప కళాస్వరూపులు. నృత్యమన్నా, లలిత కళలన్నా, వారికి చాలా యిష్టం. శివుడు తాండవంలోనూ, పార్వతీదేవి లాస్యంలోనూ చాలా గొప్ప వారని యింతకు ముందు మీకు చెప్పాను. గుర్తుందా!' గురూజీ అడిగారు. గుర్తుందని చెప్పాము.



## నృత్య స్వరూపులు

'ఈ ఆది దంపతుల రూపమే మన నృత్యం అని చెప్పవచ్చు. వీరిద్దరూ ఎన్నో నృత్యాలు చేశారు. పరమేశ్వరుడు చేసిన తాండవాలు ఏడు. వీటిని సప్త తాండవాలంటారు. వీటిని గూర్చి తరువాత చెపుతాను' అన్నారు.

ఈరోజు పాఠంపూర్తి అయింది. ఇంటివైపు బయలు దేరాము.సాయంకాలపు బంగారు కిరణాలు అందంగా ఆడుకుంటున్నాయి. సూర్యాస్తమయం కాబోతోంది.

దూరంగా శ్రీకాకుళంలోని ఆంధ్రమహా విష్ణువు గాలిగోపురం కన్పిస్తోంది. పైనున్న కలశాలు మెరుస్తున్నాయి.

గురూజీ వెంట నడుస్తున్నాము.

'జయరాం! విద్యలకు అధిపతి ఎవ్వరు?"అని అడిగారు.'

సరస్వతీ దేవి, గురూజీ

"లలిత కళలకు?"

సరస్వతీ దేవి.

### డమరుకం



గురూజీ చిరునవ్వుతో నావంక చూశారు.

'జయరాం! నీవు చెప్పింది సరికాదు.కాని. సామాన్యంగా అందరూ అలాగే అనుకుంటారు. లలిత కళలకు అధిపతి పరమేశ్వరుడు. ఆయన చేతిలోని డమరుక శబ్దాల నుండి యివన్నీ పుట్టాయి' అన్నారు.

వారిలా అనేక విషయాలు చెపుతూ వుండేవారు. కొద్ది సేపట్లో ఆశ్రమంలో అడుగు పెట్టాము.

కొన్ని రోజులు గడిచాయి. గురూజీ అందరినీ వెంట బెట్టుకుని బయలు దేరారు. పొలాల మధ్యగా వెళ్లాము. చెరకు తోట ప్రక్కనున్న దిబ్బమీద కూర్చున్నాము. మాప్రక్కగా వంపులు తిరిగిన డొంకదారి వుంది. దానికి రెండు వైపులా చిల్లకంప గోడలా వుంది. పచ్చని తీగెలు ప్రాకి చిల్లకంపకు మేలిముసుగులా వుంది. అడవి దొండపూలు తెల్లగా కన్పిస్తున్నాయి. అక్కడక్కడా పండిన దొండపళ్లు పగడాల

మాదిరిగా ఉన్నాయి. కాశీరత్నం తీగ కంచెనిండా పాకింది. దీని పూలు ఎర్రగా జూకాలతో ఉన్నాయి. ఆపూవు కోసి తొడిమ నోట్లో పెట్టుకుంటే తియ్యగా వుంటుంది. దాని నిండా తేనె వుంటుంది. ఈ లంకలన్నీ కృష్ణమ్మ తెచ్చిన పచ్చలహారాలుగా ఉన్నాయి.

అందరం ప్రకృతి సౌదర్యం చూస్తూ కూర్చున్నాము. గురూజీ కూడా ప్రతితీగనూ పరిశీలిస్తున్నారు.

పొలాల నుండి వస్తున్న పిల్లలు లిల్లాయి పదాలు పాడుతూ మమ్మల్ని చూసి ఆపివేశారు.

గురూజీ ప్రారంభించారు.

## తాండవాలు ఏడు

'ఈరోజు పరమేశ్వరుడు చేసిన తాండవాలను గూర్చి చెపుతాను. శ్రద్ధగా వినండి.'

'శంకరుడు ఏడురకాలైన తాండవాలు చేశాడు. ఇవిగాక ఇంకా చాలా తాండవాలున్నాయి. కాని పరమేశ్వరుని తాండవాలు ఏడు అనే చెపుతారు.'

వారు ఒక నిమిషం ఆలోచిస్తూ కూర్చున్నారు. మా అందరినీ పరిశీలనగా చూస్తూ "వాటిపేర్లు చెపుతాను, వినండి "అన్నారు.

1. ఆనంద తాండవము
2. సంధ్యాతాండవము
3. కలికి తాండవము
4. విజయ తాండవము.
5. ఊర్ధ్వ తాండవము
6. ఉమా తాండవము.
7. సంహారతాండవము.

సప్తతాండవాలను ఈ పేర్లతో పిలుస్తారు



## ఆనంద తాండవం

'పరమేశ్వరుడు ప్రపంచాన్ని చూశాడు. అందరూ సంతోషంగా వున్నారు. ఆనందంగా వున్నారు. భక్తులందరూ ఆయన్ని పూజిస్తున్నారు. ఆయన సంబరపడిపోయాడు.

సంతోషంతో తాండవం చేశాడు. దాన్ని ఆనందతాండవమని పిలిచారు.

## సంధ్యాతాండవం

కైలాస పర్వతం మీద శివుడూ, పార్వతీ వున్నారు. సాయంకాలం ఎండ పొడ హాయిగా వుంది.. ఆహ్లాదంగా వుంది. పార్వతీ దేవి సింహాసనం మీద కూర్చొని వుంది. దేవేంద్రుడు మురళి ఊదుతున్నాడు. విష్ణుమూర్తి మృదంగం వాయిస్తున్నాడు. సరస్వతీ దేవి వీణమీటుతోంది. బ్రహ్మదేవుడు తాళం వేస్తున్నాడు. యక్షులు, కిన్నెర కింపురుషులు అక్కడకు చేరారు. సిద్ధులు, సాధ్యులు వచ్చారు. దేవతలు అక్కడే వున్నారు. భక్తులు ఆనందంగా చూస్తున్నారు. ప్రమధులు సంతోషంతో పొంగిపోతున్నారు. నందీశ్వరుడు, భృంగీశ్వరుడు శ్రద్ధగా చూస్తున్నారు. పరమేశ్వరుని తాండవంలోని కదలికలను జాగర్తగా గుర్తు పెట్టుకుంటున్నారు.'

'పరమేశ్వరుడు చక్కగా అలంకరించుకున్నాడు. అందరి మధ్య ఆడుతున్నాడు. తాండవం చేస్తున్నాడు. కాళ్లూ చేతులూ లయగా ఆడిస్తున్నాడు. నోటితో శబ్దాలు చేస్తున్నాడు. సంధ్యాసమయంలో చేసిన తాండవం గనుక దీనిని సంధ్యాతాండవమని పిలిచారు.'

'అబ్బాయిలూ! ఇంతకు ముందు భరతుని నాట్య శాస్త్రాన్ని గూర్చి చెప్పాను కదా? భరతముని పరమేశ్వరుని దగ్గర ఈ సంధ్యా తాండవంలోని విషయాలనే నేర్చుకున్నాడు. కైశికి అనిపిలువబడే అలంకరణకూడా అప్పుడే నేర్చుకున్నాడు. చివరకు పరమేశ్వరుడు తాండవం చేసేటప్పుడు నోటితో స్వయంగా అన్న శబ్దాలను కూడా భరతముని గుర్తు పెట్టుకున్నాడు.'

'శివునికి నటరాజని పేరుంది. తాండవంలో ఈయన్ని మించిన



కటికితాండవం

వారు లేరు.'

### కలికితాండవం

'మూడవది కలికి తాండవం. ప్రపంచంలో వున్న ప్రాణులందరూ సుఖంగా వుండాలి. కాని వీరందరికీ అజ్ఞానం ఎక్కువగా వుంది. అవినీతి ఎక్కువయింది. అనేక చెడ్డ గుణాలు పెరిగాయి. ఇందువల్ల మంచి వారికి యిబ్బంది కలిగింది. ఇది గమనించాడు పరమేశ్వరుడు. చెడును తొలగించాలనుకున్నాడు. మంచిని పెంచాలనుకున్నాడు. ఇందు కొరకు తాండవం చేశాడు. ఈ తాండవాన్ని కలికితాండవం అన్నారు.'

### విజయతాండవం

'పూర్వకాలంలో కొందరు ఋషులు తపస్సు చేశారు. మంచి శక్తి సంపాదించారు. వారు ఎవ్వరినీ లెక్క చేసేవారు కాదు.చివరకు పరమేశ్వరుని కూడా తేలికగా చూశేవారు.'

'ఈశ్వరుడు మారు వేషంలో వారి వద్దకు వెళ్ళాడు. వారిని చెడు చేయవద్దని చెప్పాడు. వారు వినలేదు. శివుడు వారిని ఓడించాడు.'

'ఓడిపోయిన మునులకు మరింత కోపం వచ్చింది. రోషం వచ్చింది. వాళ్లు హోమం చేశారు. మంత్రాలు చదివారు. దానిలో నుండి భయంకరంగా ఉండే పులి వచ్చింది. దీన్ని శివుని మీదకు పంపించారు.'



విజయతాండవం

'ఈశ్వరుడు ఏమాత్రం భయపడలేదు. మీదకు దూకి పులిని పట్టుకున్నాడు. చిటికెన వ్రేలితో దాని చర్మాన్ని వలిచాడు. అందంగా వుండేందుకు నడుం చుట్టూ చుట్టుకున్నాడు.'

'మునులందరూ ఇది చూశారు. మరల దుర్మార్గంగా ఆలోచించారు. ఈమారు పెద్ద పామును తయారు చేశారు. దాన్ని ఈశ్వరుని మీదకు పంపించారు. ఆయన


ఊర్ధ్వతాండవం

నవ్వుకున్నాడు. దాన్ని పట్టుకుని మెడలో వేసుకున్నాడు.'

'ఈవార్త మునులకు తెలిసింది. వాళ్లు బాగా రెచ్చిపోయారు. ఒక శక్తిని సృష్టించారు. ఆశక్తి పేరు గజాసురుడు. శివుడు తన పాదంతో తొక్కి, గజాసురుడి వెన్నుపూస విరగ్గొట్టాడు. విజయంతో విజయ తాండవం చేశాడు.'

## ఊర్ధ్వ తాండవం

'పార్వతీ దేవి లాస్యం చేస్తుంది. పరమేశ్వరుడు తాండవం చేస్తాడు. ఇద్దరికీ మాటామాటా వచ్చింది. ఎవరు బాగా నృత్యం చేయగలరో తేల్చుకోవాలను కున్నారు. కాళ్లకు గజ్జలు కట్టుకున్నారు. పోటీగా ఆడుతున్నారు. శివుడు అలసి పోతున్నాడు. పార్వతీదేవి తేలికగా లాస్యం చేస్తోంది. ఆమెకు అలసట లేదు. చూచే వారికి అమ్మవారే జయిస్తారని పిస్తోంది.'

'శివునికి అపజయం తప్పదని అందరూ అనుకున్నారు. కాని ఆయన మధ్యలో ఒక కాలు లేపాడు. దాన్నితల మీద వుంచుకున్నాడు. వంటికాలుతో తాండవం చేశాడు. పార్వతీదేవి కాలు లేపి ఆడటానికి బాగోదనుకుంది. అందరి మధ్యా స్త్రీలు అలా చేయలేరు కదా? ఆమె నిలబడిపోయింది. ఇలా శివుడు పార్వతిని జయించాడు. అబ్బాయిలూ ఇదే ఊర్ధ్వతాండవం.'

## ఉమాతాండవం

'ఆరవది ఉమాతాండవం. దీన్ని స్మశానంలో చేసే తాండవమని చెపుతారు. పార్వతీ పరమేశ్వరులు అనుచరులతో కలసి ప్రేతభూమిలో చేసే తాండవం.'

## సంహార తాండవం

'చివరది సంహార తాండవం.'

'విలయ కాలమని మన వాళ్లు అంటుంటారు. ఈశ్వరుడు సృష్టిని నాశనం

చేస్తాడు. ఇందుకొరకు చేసే తాండవాన్ని సంహార తాండవం అంటారు.'

'ఈ విధంగా పరమేశ్వరుడు ఏడువిధాలుగా తాండవం చేశాడు. పురాణాలలో ఈ విషయాలు చెప్పారు. శైవుల గ్రంథాలలో ఈ కథలున్నాయి.'

ఈరోజు పాఠం ఐపోయింది. కాని మాకు కొన్ని అనుమానా లున్నాయి. వాటిని అడగాలను కున్నాము.

గురూజీ గమనించారు. 'ఎందుకా గుసగుసలు? అడగండి' అన్నారు.

మా అందరిలోకీ పెద్దవాడు ప్రసాద్. అతను అడిగాడు.



సంహారతాండవం

'గురూజీ ! పురాణాలలోని తాండవాలను వివరించి చెప్పారు. ఇంతకు ముంయు చెప్పిన వాటిని చరిత్రగా చెప్పారు. ఇలాగే సప్త తాండవాలను చరిత్ర రీత్యా చెప్పండి.'

## తెలివితేటలు పెరుగుతున్నాయి

'ప్రసాద్!' గురూజీ చెప్పసాగారు. 'ప్రతిజాతికీ పురాణ గాథలున్నాయి. ఆకథలను చరిత్రగా మార్చి చెపుతారు. ఇలా చాలా కాలం నుండి జరుగుతోంది. సప్త తాండవాలను కూడా వారు వివరించారు. కాని, మీరు చిన్న వాళ్లు. నేను చెప్పినా అర్థం చేసుకోలేరేమోనని చెప్పవద్దనుకున్నాను. మీకు తెలుసుకోవాలనే కోరిక ఉంది. ఇలా ఉండటం చాలా మంచిది. మేమనుకునే విధంగా యిప్పటి బాలురు, బాలికలూ వుండరు. కొత్త తరం వాళ్లు పాతవాళ్లకన్నా చురుగ్గా వుంటారు. తెలివిగా వుంటారు. ఈనాటి వాతావరణం వేరు. అలాగే ! మీరు కోరినట్లుగా నే చెపుతాను. పదండి, యీ పూటకు చాలు' అన్నారు. అందరం బయలు దేరాము.

గురూజీ యీరోజు ప్రత్యేక విషయం చెపుతారని అందరికీ తెలిసింది. మాతో పాటు కొంత మంది ఉపాధ్యాయులు కూడా వచ్చారు. అందరం యిసుకతిన్నె మీద

కూర్చున్నాము.

కృష్ణా తరంగాలు వంకలు పోతూ కదులుతున్నాయి. చల్లగాలికి రెల్లుపూలు నాట్యం చేస్తున్నాయి. దూరంగా కొంగలు నీటి అంచున నిలబడి ఏకాగ్రతగా చూస్తున్నాయి.

వాతావరణం గులాబిరెమ్మలు చిమ్మినట్లుగా వుంది.

గురూజీ ప్రారంభించారు.

## అనేక జాతులు

'ఇంతకు ముందు సింధునదిని గూర్చి చెప్పాను. అక్కడ నివసించిన ఆర్యులను గూర్చి చెప్పాను. వారి చుట్టూ ఇతరులు చాలా మంది వుండేవారు. వారంతా కలిసి వుండేవారు కాదు. కొంత మంది కొందరితో స్నేహంగా వుండేవారు. మరి కొందరితో విరోధంగా వుండేవారు. వారంతా ఒక జాతి వారు కాదు. వారిలో అసురులున్నారు. రాక్షసులున్నారు. దస్యులున్నారు. ఫణులు, నాగులు ఉన్నారు. ద్రావిడ జాతుల వారి పూర్వీకులున్నారు. ఇంకా ఎందరో ఉండే వారు.'

'ద్రావిడ జాతుల వారు లింగాలను పూజించే వారు. వారి దేముడు పరమ శివుడు.'

'ఆర్యులు ప్రకృతిని ఆరాధించేవారు. అనగా గాలిని, నిప్పును కొలిచేవారు. భూమిని, ఆకాశాన్ని పూజించే వారు. నీటిని, ఇంద్రుణ్ణి, చంద్రుణ్ణి, సూర్యుణ్ణి ఇలా ఎందరినో కొలిచేవారు.'

## కలగలుపు

'ఆర్యులు లొంగిపోయిన వారిని దాసులుగా చేసుకున్నారని చెప్పాను. మీకు గుర్తువుండే వుంటుంది. వారితో కలిసి మెలసి పని చేయటం అలవాటయింది. క్రమేణా ఇతరుల దేవతల మీద నమ్మకం కుదిరింది. వారు గంగా తీరం దాకా ప్రాకేరు. చివరకు గంగ వెంటే వెళ్లారు. భారత దేశమంతా పాకి పోయారు. కాని, వారు పూర్వం మాదిరిగా లేరు. చాలా మందితో కలిసిపోయారు. ఇతరుల దేవతలను కొలువ సాగారు.'

'అబ్బాయిలూ! మనలో కొందరు ఏసుక్రీస్తును, మేరీ మాతను పూజిస్తున్నారుకదా? ఆనాడూ అలాగే జరిగింది.'

'ఈ విషయాన్ని ఇంతటితో ఆపివేస్తాను. మరో విషయం చెపుతాను.'

## ఎలాపుట్టాయి?




'నృత్యం ఎలా పుట్టింది? సంగీతం ఎలా జన్మించింది? అంటూ చాలా మంది ప్రశ్నిస్తారు. అవి ఎలా పెరిగాయో చెప్పమంటారు. వీటి వలన మనకున్న ఉపయోగం ఏమిటని అడుగుతారు.'

'ఈప్రశ్నలకు పెద్దలు సమాధానం చెప్పారు. ఐనా మీరు తెలుసుకోవటం చాలా మంచిది.'

'కోతి నుండి మానవుడు పరిణామం చెందినాడని డార్విన్ అనే ఒక శాస్త్రజ్ఞుడు చెప్పాడు. అలా తయ్యారైన మానవులు చిన్న చిన్న గుంపులుగా వుండేవారు.'

'ఈ ఆదిమానవులు ఆనందం కలిగినపుడు గంతులు వేశారు. చేతులు తిప్పారు. తల ఆడించారు. మెడ కదిలించారు.'

'ఈ గంతులూ, చిందులే నృత్యానికి ప్రారంభం. పిల్లలకు అక్షరాలు ప్రారంభిస్తాము. అలాటివి. ఆనందంలో రాగాలు తీశారు. అనేక రకాల కూతలను అనుకరించారు. అదే సంగీతానికి ప్రారంభం.'

'తరువాత గణాలుగా పెరిగారు. తెగలుగా పెరిగారు. జాతులుగా ఎదిగారు. వారికి జీవితంలో ఎన్నో మార్పులు కలిగాయి. క్రొత్త విషయాలు తెలిశాయి. ఆటలు, పాటలు, బాగా అభివృద్ధి అయినాయి.'

'భాష పెరిగింది. వ్రాయటం తెలుసుకున్నారు. వాయిద్యాలు అభివృద్ధి అయినాయి. గాలి వూది ప్రయోగించే మురళి వంటివి వచ్చాయి. లోహాలతో చేసిన తాళాలు తయ్యారైనాయి. తీగవాయిద్యాలొచ్చాయి. తోలుతో చేసిన మృదంగం వంటివి వచ్చాయి. ఇలా చాలా







సంపత్‌కుమార్ జాలరి నృత్యం.

అభివృద్ధి జరిగింది.'

'మనలో వచ్చే అనేక భావాలను రసాలుగా విడగొట్టుకున్నారు. నవరసాల స్వభావాన్ని చెప్పాను కదా! ఈరసాలను పాటల్లో వినిపించారు. ఆటల్లో చూపించారు. క్రమేణా ఈనాటి సంగీతంగా రూపొందాయి. నృత్యంగా తయారయినాయి.'

## జానపదం

'మనుషులు రోజూ పనులు చేసుకోవాలి. పని చేయందే చాలా మందికి జీవితం గడువదు. పొట్ట నిండదు. వారంతా పనిచేస్తూ కష్టాన్ని మరచిపోవాలను-కుంటారు. ఏదైనా పాటపాడు-కుంటుంటే మనసు తేలికగా వుంటుంది. హాయిగా



వుంటుంది. ఇలా జానపదుల పాటలొచ్చాయి.'

'వారు కష్టపడే టప్పుడు శరీరం కదులుతుంది. ఆ కదిలిక ఒకే తీరుగా వుంటుంది. నాట్లు వేస్తారు. కోత కోస్తారు. కుప్పలు వేస్తారు. నూరుస్తారు. దంచుతారు. విసురుతారు. ఒకో పనికి శరీరం ఒకో విధంగా కదిలించాలి. ఒక పనికి సంబంధించిన కదలికలు ఒకే తీరులో వుంటాయి. ఈ తీరునే తాళం అంటాము. కదలికలలోని శబ్దాలను తాళంగా వాడు కుంటారు. ఆ వరుసలో పాటలు కడతారు. చక్కగా పాడుకుంటారు. పని చేసేటప్పుడు కలిగే శ్రమను మరచిపోతారు.'



## జీవితమంటే తాండవం

'అడవుల్లో వుండే వారిని ఆటవికులంటాము. వారు చేసే ముఖ్యమయిన పనులు అనేకముంటాయి. వర్షపు చినుకులు ముందుగా పడేటప్పుడు ఆడుతారు. పాటలు పాడుతారు. వ్యవసాయం ప్రారంభిస్తే యిలాగే చేస్తారు. వేటకు వెళ్లే ముందూ యింతే. యుద్ధానికి వెళ్లే ముందూ యిలాగే చేస్తారు. చివరకు పిల్లలు పుట్టినా ఆడిపాడతారు. మనిషి చని పోయినా యిలాగే చేస్తారు. ఇందు వలన వారి జీవితమంతా ఆట పాటలతో నిండి ఉంటుంది. ఈ విధమైన ఆచారాలు ప్రపంచ మంతటావున్నాయి. అన్నిజాతుల వారి పూర్వీకులు యిలాగే చేశారు.'

'ఇలా చేసేటప్పుడు ఏదో ఒక సాధనంతో శబ్దం కలిగించితే బాగుంటుంది. ఆధ్వని ప్రకారం అడుగులు వేస్తారు.ఇందుకొరకు అనేకపరికరాలు తయారైనాయి.'

'మొదటి దశలో అందరూ కలిసి ఆడేవారు. పాడే వారు. తరువాత ఆడవారు వేరుగా చేసే వారు. మగవారు వేరుగా ఆడేవారు. తరువాత ఒక్కొక్కరు చేయటం వచ్చింది. ఇలా నృత్యం, సంగీతం చక్కగా పెరిగాయి. ఈనాటి సంఘంలో మనం వీటిని ఏదో రూపంలో రోజూ చూస్తూనే వున్నాము'

'నే చెప్పబోయే సప్త తాండవాలు మానవుని జీవితంలో జరిగినవే. మనిషి ప్రారంభంలో గుంపుగా వున్నాడు కదా! ఏపని చేయబోయినా ముందు అంతా కలిసి నృత్యం చేస్తారని చెప్పాను కదా! నృత్యాలు వారి జీవించే పద్ధతిని తెలియ జేస్తాయి.'

'ఈ గుంపుగా వున్న వాళ్లనందరినీ కలిపి 'గణం'గా వున్నారనే వారు. గణంలో ప్రతిమనిషీ ఒక సభ్యుడు. ఇక వివరిస్తాను జాగ్రత్తగా అర్థంచేసుకోండి.'

ఆనంద

'గణంలో అంతా కులాసాగా వున్నారు. తినటానికి దుంపలు దొరుకుతున్నాయి. పళ్లు దొరుకుతున్నాయి. వేటాడటానికి జంతువులు దొరుకుతున్నాయి. ఉండటానికి గుహలున్నాయి. చెట్ల తొర్రలున్నాయి. అంతా సంతోషంగా ఉన్నారు. ఆనందంగా ఉన్నారు. అందరూ కలిసి హాయిగా ఆడుతుండే వారు. పాడుతుండే వారు. వారు ఆనందంగా ఆడిన నృత్తమే ఆనందతాండవం.'

సంధ్యా

'సాయంకాలానికి అంతా ఒక చోట కూర్చునే వారు. ఏదో ఎండు కొయ్యకు నిప్పంటించేవారు. వేటాడి మాంసం తెచ్చేవారు. దాన్ని నిప్పులమీద కాల్చేవారు. సాయంకాలపు ఎండ చక్కగా వుంది. సంతోషాన్ని కలిగిస్తోంది. అపుడు తినేవారు. ఆడేవారు ఇదే సంధ్యాతాండవంగా తయారయింది.'

కలికి

'అందరూ కలిసి జీవిస్తున్నారు. వారిలో కొందరు ఎదురు తిరగారు. ఇందువల్ల ఆహారాన్ని పోగు చేసుకోవడం కష్టమయింది. విరోధులుగా వున్న యితర గణాల వాళ్లతో యుద్ధం చేయటం కుదరలేదు. ఇందువల్ల ఓడిపోక తప్పటం లేదు. కాబట్టి ఎదురు తిరిగిన వారిని వెళ్ళ గొట్టాలి. లేకపోతే చంపివేయాలి. ఈ భావాలను నృత్యంతో చూపించారు. ఇదే కలికి తాండవం.'

విజయ

'ఇతరులతో యుద్ధాలు తప్పవు. బయట అనేక రకాల వాళ్లున్నారు. లింగాలను పూజించే వారున్నారు. పులిచర్మాలను అందంగా చుట్టుకునేవారున్నారు. మరికొందరు ఏనుగు చర్మాలను వాడుకుంటారు. కొందరు అడవి దున్నపోతు కొమ్ములను తలపైన అలంకరించుకుంటారు. ఒక గణం వారి అలంకారాలకు రెండో వారి అలంకారాలకు సంబంధం లేదు. వేరుగా ఉంటుంది.'

'అనేక రకాల వారు ఆర్యుల చుట్టూ ఉండే వారు.'

'వారిలో వారికి యుద్ధాలు తప్పలేదు. ఒకో సమయంలో యుద్ధం వద్దనుకునే వారు. ఒకరి కొకరు హెచ్చరించుకునే వారు. మధ్య వర్తుల ద్వారా మాట్లాడుకునే వారు: తగాదాలు రాకుండా సరిచేసుకునే వారు. కాని తప్పని సరి అయినప్పుడు

కొట్లాడుకునే వారు. ఒకరి నొకరు చంపుకునే వారు. శత్రువుల మీద విజయం సాధించిన తరువాత నృత్యం చేసే వారు. ఇదే విజయ తాడవం.'

## ఊర్ధ్వం

'ఆడవారికి, మగవారికీ పోటీ వచ్చింది. ఇద్దరూ ఆడుతున్నారు. శరీరాలను కదిలించటంలో పురుషులకు తేలికగా వుంటుంది. అనువుగా వుంటుంది. వేగంగా ఆడటానికి వీలుగా వుంటుంది. కాని స్త్రీలు అలా చేయలేరు. నెమ్మదిగా చేస్తారు. అందంగా ఆడతారు. సుకుమారంగా కదులుతారు. భావాలను తేలికగా చూపించ గలరు. సున్నితంగా చూపించగలరు.'

' ఈపోటీలలో పురుషులు వోడిపోయేటట్లున్నారు.ఇందువల్ల ఏదో మోసంతో జయించాలనుకున్నారు. కాలు తీసి నెత్తి మీద పెట్టుకున్నారు. ఒంటి కాలు మీద ఆడినారు. కాని, ఆడవారు కాలు లేపి ఆడలేరు. ఆడలేకకాదు. అందరి ముందూ అలా చేయటం బాగుండదు. అసహ్యంగా ఉంటుంది. సభ్యతగా వుండదు. ఆడవద్దని ఆగిపోయారు. ఇదే నృత్తంలో చూపించారు. కాలు తలపై వుంచి ఆడేది కాబట్టి 'ఊర్ధ్వ' తాండవం అన్నారు.

'అబ్బాయిలూ! సమాజంలో ముందు రోజుల్లో నృత్యాలన్నీ తాండవాలుగానే ఉండేవి. అప్పటి మానవులకు 'లాస్యం' తెలియదు. లాస్యమంటే ఏమిటో చెప్పివున్నాను. మానవులు బాగా స్థిరపడిన తరువాత లాస్యం వస్తుంది. ఒక చోట ఊరుకట్టుకుని, వ్యవసాయం చేస్తూంటారు. పూర్వం మాదిరిగా తిరుగుతూ వుండరు. ఆహారం వెదుక్కోవలసిన పనిలేదు వ్యవసాయం వలన పంటలు పండుతాయి. ఈ దశలో మానవుని ఆలోచనల్లో మార్పు వస్తుంది జీవించే పద్ధతుల్లో మార్పు వస్తుంది. ఈ సమయంలో 'లాస్యం' పుడుతుంది. బాగా పెరుగుతుంది. భావాలను చక్కగా వివరించేందుకు అభినయం వస్తుంది.'

## ఉమ

'ఉమ అనగాతల్లి. గణంలో ఎవ్వరైనా చనిపోతే అంతా శోకాలు పెట్టే వారు. దుఃఖ పడేవారు. ఆ శవాన్ని స్మశానానికి తీసుకెళ్లేవారు. అందరూ అక్కడ గుమికూడే వారు. అక్కడే అన్నం వండి ఏవేవో చేసేవారు. ఆడా మగా అంతా అక్కడే ఉండి పనులన్నీ చేసే వారు. కాని తల్లికుండే దుఃఖం వేరు. ఆమె చాలా బాధపడుతుంది. వాళ్లందరికీ తల్లి వంటిది తమ 'గణం'. ఆగణంలో పుట్టి అందులో పెరిగే వారు. అందులోనే చనిపోయేవారు. అన్ని పనుల్లో కలసి వుండే వారు. చివరకు చనిపోయిన

సమయంలోనూ యిలాగే వుండేవారు. తల్లిలా అంతా కన్నీరు పెట్టేవారు. ఆ స్మశానంలో కలిగే భావాలను వివరించే విధంగా ఆడేవారు. నృత్తం చేసేవారు. ఇదే ఉమా తాండవం.'

'ఉమా దేవి అందికీ తల్లి వంటిది. బిడ్డ చనిపోతే తల్లికి కలిగే దఃఖం చాలా ఎక్కువగా వుంటుంది."

'ఉమాతాండవం తల్లి మనసులోని బాధను తెలియ జేస్తూ ఆడే ఆట

'మధ్య ప్రదేశ్‌లో దండకారణ్యంవుంది. ఈ అడవిలో అనేక మంది ఆటవికులు నివసిస్తున్నారు. వీరిలో కొందరికి వింత ఆచారం వుంది. ఎవరైనా చనిపోతే, అంతా స్మశానానికి వెళ్తారు. అక్కడే మూడురోజులుంటారు. మధ్యలో గూడేనికి తిరిగిరారు. తినటం, త్రాగటం, నిద్రించటం అంతా అక్కడే జరుగుతుంది. విషాదంగా పాటలు పాడుతారు. భోరుభోరున ఏడుస్తారు. కన్నీళ్ళు పెట్టుకుని స్మశాన నృత్యం చేస్తారు.'



'గణాలు తెగలుగా పెరిగాయి. అవి జాతులుగా అభివృద్ధి చెందాయి. తరువాత మానవులు చాలా వరకు మారిపోయారు. ఐనా పాత అలవాట్లు కొన్ని మిగిలాయి. అవే ఆచారాలుగా అంటివున్నాయి.'

## సంహారం

'శత్రువులను వదలి పెట్టగూడదు. ఒకరినీ కూడా వదలరాదు. అందరినీ చంపేయాలి. నరికేయాలి. బాణాలతో కూల్చేయాలి. ఇదే భావాన్ని అందరూ చేస్తారు. యుద్ధానికి వెళ్ల బోయే ముందు ఆడతారు. ఇదే సంహార తాండవం.'

'తాండవంలో అభినయం వుండదు. లాస్యం వుండదు. కాళ్ళూ చేతుల కదలికలుంటాయి. గెంతుతారు. పాదాలు నేలకు తడతారు. శబ్దాలు కలిగిస్తారు. తాండవాలన్నీ యిలాగే చేస్తారు. తాండవాలు శివునకు సంబంధించినవి. ఇవి ఆర్యుల ఆటలు కావు.'

'ద్రావిడ జాతుల వారికి తాండవాలంటే బాగా యిష్టం.'

'మరో విషయం గుర్తుంచుకోండి. తాండవం పూర్తిగా నృత్తం అని తెలుసుకోండి. నృత్తంలో అభినయం వుండదని చెప్పాను. ఒక విధంగా యిది సరైన మాట కాదు. అభినయం లేకుండా ఏ ఆటా ఉండదు. ఎంతో కొంత వుంటుంది. భావాన్ని విడమర్చి చెప్పాలి కదా ! అందుకు అభినయం కన్నా శరీరపు కదలికలనే వాడుతారు.

వీటికే ప్రాముఖ్యత యిస్తారు. ఇందు వల్ల తాండవంలో అభినయం లేదని చెప్పాను.'

## ఎందుకని ? ఏమిటి ?

'మీరు పెరిగి పెద్ద వారయ్యేలోపు విరివిగా గ్రంథాలు చదవండి. దేశమంతా తిరిగి చూడండి. స్వయంగా ఆలోచించండి. నిర్ణయాలు చేసుకోండి. ఇతరులు చెప్పినారని గుడ్డిగా నమ్మవద్దు. ఎంత పెద్దలయినా సరే ఒప్పుకోవద్దు. మీ అనుభవంతో చూడండి. ఇతరుల అనుభవాలను తెలుసుకోండి. అపుడు సరిగా వున్నదను కుంటే నమ్మండి. ప్రతివిషయాన్నీ ప్రశ్నించండి. ఎందుకిలా జరుగుతోందని ఆలోచించండి. ఏమిటిదని అడగండి. ఎందుకు? ఏమిటి? అనేవి రెండు ఆయుధాలు. వాటితో ఈ ప్రపంచంలో జరిగే ప్రతిదాన్నీ పరీక్షించండి. క్రమేణా మీకే తెలుస్తుంది.'



మరో విషయం చెప్పి, యీ పూటకు ముగిస్తాను. మీకం యింతవరకు ఆర్యులు ఇతర ప్రాంతాల నుండి మనదేశానికి వచ్చారని చెప్పాను. తిలక్ మహాశయుడు ఉత్తర ధృవ ప్రాంతం నుండి ఆర్యులు వచ్చారని వ్రాశారు. చాలామంది చరిత్ర పరిశోధకులు బయట నుండి మనదేశానికొచ్చారన్నారు. చివరకు మార్క్సు ఏంజల్సు కూడా ఈ వాదనను అంగీకరించారు.

'కాని ఆర్యులు యిక్కడ నుండే యితర ప్రాంతాలకు వెళ్లారనే వాదన ఉంది. కొంతమంది ఈ వాదనను నమ్ముతున్నారు.'

వారు ఆపివేశారు. అందరం ఆశ్రమం వైపు బయలుదేరాము.

ఈ రోజు మల్లె తోట వైపు వెళ్ళాము. తోటకు నీరు కట్టారు. ఒక వైపు ఆకు దూసిన తీగలున్నాయి. కొంత భాగం మొగ్గలతో వుంది. కోయటానికి కనుపించకుండా అక్కడక్కడా మొగ్గలు మిగిలాయి. అవి విచ్చుకున్నాయి. మబ్బుల మధ్య నక్షత్రాల మాదిరిగా వున్నాయి. నవ్వుతున్నట్లున్నాయి.

పొడిగా వున్న చోటకూర్చున్నాము. గురూజీ ప్రారంభించారు.

ఇంతవరకు నాట్యాలను గూర్చి కొంత చెప్పాను. పురాణాల్లో సంగతులు తెలుసుకున్నారు. చరిత్ర వ్రాసిన వారి మాటలు చెప్పాను. ఐనా అది అంతులేని విషయం. ఎన్నిరోజులు చెప్పినా తరగని విషయం.

## ఆంధ్రులు

'మనం తెలుగు వారం. ఆంధ్రులమని కూడా చెప్పుకుంటాం. ఆంధ్రుల చరిత్ర చాలా పురాతనమయినది. వేదకాలంలో ఆంధ్రులున్నారు. వీరు విశ్వామిత్రుని సంతానమని చెపుతారు.'

'విశ్వామిత్రునికి నూరుగురు బిడ్డలున్నారు. వారిలో ఒకరి పేరు మధుచ్ఛందుడు. ఇతని కన్నాయాభై మంది పెద్దవారు. మిగతా వారు చిన్నవారు.'

'పూర్వం యజ్ఞాలు చేసే వారని చెప్పాను కదా? అప్పుడు జంతువులను బలియిస్తారు. అప్పుడపుడూ మనుష్యులను కూడా బలిగా యిస్తారు.'

## శునశ్శేపుడు



'శునశ్శేపుడనే ఒక యువకుడున్నాడు అతను చాలా అందంగా వుంటాడు. బలంగా వుంటాడు. పైగా చాలా మంచివాడు. తెలివైన వాడు. అతన్ని బలియివ్వాలనుకున్నారు. యజ్ఞం దగ్గరకు తెచ్చారు. ఒక స్తంభానికి కట్టేశారు. ఆ స్తంభాన్ని ఊపస్తంభం అంటారు. విశ్వామిత్రుడు యిదంతా చూశాడు. నరబలి ఆయనకు యిష్టం లేదు. శునశ్శేపుని కట్లు ఊడదీశాడు. అతన్ని దత్తత చేసుకోదలచాడు. పెంచుకోదలచాడు'.

'యాభై మంది పెద్ద కొడుకులు ఎదుర తిరిగారు. వద్దువద్దన్నారు. విశ్వామిత్రుని మాట వినలేదు.'

## శపించాడు

'విశ్వామిత్రునికి కోపం వచ్చింది. యాభై మంది పెద్ద బిడ్డలను వెళ్ల గొట్టాడు. కోపంతో శపించాడు. మీరూ, మీ సంతానం పనికి రాకుండా పోతారన్నాడు. పనికి రాని వాళ్ళందరితో కలుస్తారన్నాడు. తినటానికి పనకి రానిది తింటారన్నాడు. పాపం! ఆయాభై మందీ ఎడంగా వెళ్లి పోయారు.'

'మన పెద్దలకు కోపమొస్తే తిట్టేతిట్లు గుర్తు చేసుకోండి. మీకే తెలుస్తుంది. వెధవనాగన్నా, వెళ్లి గడ్డితిను అంటారు గదా! అలాగే తిట్టాడు.'

'విశ్వామిత్రుని యాభై మంది బిడ్డలెవరో తెలుసా? ఆంధ్రులు, పుండ్రకులు, శబరులు, పుళిందులు మొదలగు వారని చెపుతారు. వాళ్లంతా విశ్వామిత్రుని సంతానం. చివరకు దస్యులుగా పిలువబడినారు. వీరిలో ఆంధ్రులున్నారు.'

## కౌరవులతో

'శాపం పొందిన వారు ఎడంగా వచ్చేశారు. నాగులతోనూ ఇతరులతోనూ స్నేహం చేశారు. మహాభారత యుద్ధం కురుక్షేత్రంలో జరిగింది. ఆంధ్రులు గణాలుగా యుద్ధంలో పాల్గొన్నారు. ఆంధ్రులు దుర్యోధన మహారాజు వైపున నిలిచారు. పాండవులతో యుద్ధం చేశారు. ఓడిపోయారు. దుర్యోధనుడు చనిపోయాడు. అతని మిత్ర పక్షాలన్నీ తలో దారి అయినాయి. హస్తినాపురం వదలి అడవులలోకి వెళ్లారు. ఆ తరువాత కూడ ప్రశాంతంగా ఉండలేదు.'

'అభిమన్యునికి వుత్తరకు పరీక్షితుడు పుట్టాడు. నాగులు కక్షకట్టి అతన్ని చంపి వేశారు. తరువాత పరీక్షన్మహారాజు కొడుకు జనమేజయుడు సైన్యాలను కూర్చుకున్నాడు. నాగులను నాశనం చేశాడు.'

'నాగులకు స్నేహితులైన ఆంధ్రులు కూడా దెబ్బతిన్నారు.

'ఆంధ్రులు అడవులలో బడి దక్షణానికి వచ్చేశారు. నాటి ఆంధ్రప్రదేశ్‌లో స్థిరపడినారు. ఇలా అని చాలామంది చెపుతారు. ఇంకా పూర్తిగా నిరూపించ బడలేదు.'

## తెలుగువారు

'ఆంధ్రప్రదేశ్‌లో పురాతనంగా తెలుగువారుండే వారు. ఇందు వల్ల తెలుగు దేశమన్నారు. ఆంధ్రులొచ్చి నివసించారు. కాబట్టి ఆంధ్ర ప్రదేశమయింది. ప్రాచీనులయిన తెలుగు వారు, ఆంధ్రులు పాలూ నీరు వలే కలసి పోయారు.'

'తెలుగు మాట చాలా తీయనిది. తేనె వంటిది. స్పష్టంగా పలకటానికి

వీలైనది. తెలుగు భాషను గూర్చి అనేక మంది గొప్పగా చెప్పారు.'



**తీయని భాష**

'మన దేశాన్ని ఇంగ్లీషు వారు పరిపాలించారు గదా! వాళ్లు మన భాషకు మంచి పేరు పెట్టారు. వారి దేశం ఇంగ్లండు. అది యుఁరపు ఖండం లోవుంది. యూరపులో అనేక భాషలున్నాయి. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, గ్రీకు, లాటిన్,రష్యన్ ఇంకా అనేక రకాల భాషలున్నాయి. కాని ఇటలీ దేశస్తులు మాట్లాడే భాష చెవికింపుగా ఉంటుంది. యురపులో దానికి తీయని భాష అనిపేరు ఉంది. అందుకేఆ భాషతో పోల్చి తెలుగును, **తూర్పు దేశాల ఇటలీ భాష** అని ఇంగ్లీషు వారు అన్నారు. తెలుగు తీపి యితరులుతో కూడా పొగడ్తలందుకుంది.'

'విజయనగర సామ్రాజ్యాన్ని **శ్రీకృష్ణ దేవరాయలు** పాలించాడు. ఈయన తుళు జాతి వాడు. ఈయనకు చాలా భాషలొచ్చు. అన్ని భాషల అందచందాలు బాగా తెలుసు. ఈయన కూడా తెలుగులోని తీయదనాన్ని మెచ్చుకున్నాడు. తెలుగులో **ఆముక్త మాల్యద** అనే కావ్యం వ్రాశాడు. అందులో, ఒక పద్యం వుంది. దానిలో **"దేశ భాషలందు తెలుగు లెస్స"** అని వ్రాశాడు. శ్రీకృష్ణ దేవరాయలకు ముందే **వినుకొండ వల్లభ రాయుడు** ఇదేమాట చెప్పాడు.

'ఇలాంటి తెనుగు భాషను మాతృభాషగా కలిగిన మనం చాలా అదృష్ట వంతులం. అంత మాత్రంతోనే భాషా గర్వం పెంచుకోరాదు. ప్రాంతీయ గర్వమూ పెంచుకోకూడదు. ముందుగా మనం భారతీయులం. ఆ తరువాత ఆంధ్రులం.'

'మీరు నేర్చుకుంటున్న నృత్యాన్ని గూర్చి అనేక మంది తెనుగు వారు పుస్తకాలు వ్రాశారు. ఈ కళారాధనలో వారు తమజీవితాన్ని పూర్తిగా వాడినారు.'

**భరతముని**

'నాట్యశాస్త్రాన్ని భరతముని వ్రాసినాడని చెప్పి ఉన్నాను. ఈయనను గూర్చి అనేక కథలున్నాయి. భరతుడు అనే వ్యక్తి అస్సలు లేడని కొందరంటారు. నాట్యశాస్త్రాన్ని చాలా మంది వ్రాశారని అంటారు. మరో వాదనకూడా ఉంది. ఈ గ్రంథంలో కొన్ని భాగాలు పోయినాయంటారు. వాటిని వ్రాసి యీపుస్తకంలో ఉంచారని చెపుతారు.'

'ఈ గ్రంథంలో చెప్పిన తీరు వరసగా ఉంటుంది. క్రమంగా ఉంటుంది. ఒక చోట వ్రాసింది మరోచోట వ్రాయలేదు. ఒక దానికొకటి అడ్డదిడ్డంగా వ్రాయలేదు. ఇందు వల్ల ఈ పుస్తకం ఒకరే వ్రాశారని ఎక్కువ మంది నమ్ముతున్నారు.'

'ఈ రకమైన వాదోపవాదాలతో మనకు పనిలేదు.భరతముని మాత్రమే యీ గ్రంధాన్ని వ్రాసినాడని అనుకుందాము.'

'ఈ గ్రంథం సంస్కృత భాషలో ఉంది. ఆ తరువాత అనేక భాషలలోకి అనువదించారు. ఇందులో ఆరువేల శ్లోకాలున్నాయి. శ్రద్ధగా వినండి. ఏమైనా అనుమాలోస్తే అడగండి. భరతముని తెలుగువాడనే వాదనఉంది. ఈయన తరువాత చెప్పుకోతగిన గొప్ప వ్యక్తి **నందికేశ్వరుడు.** ఈయన కూడా తెలుగు వాడనే అంటారు. **భరతార్ణవం** అనే గ్రంథం వ్రాశాడు.



## నందికేశ్వరుడు

'శివుని ముఖ్య అనుచరులలో 'నంది' ఒకరు. తాండవం చేసే సమయంలో ప్రక్కనే ఉండేవాడు. ప్రతికదలికా గమనించేవాడు. తర్వాత ప్రపంచంలో అనేక ప్రదేశాలు చూశాడు. వారి ఆటలు చూశాడు. అన్నీ తన గ్రంథంలో వ్రాసుకున్నాడు. కొంత కాలం గడచింది. నందికేశ్వరునికి మరో ఆలోచన కలిగింది. తాను వ్రాసిన



గ్రంథం చాలా పెద్దదిగా ఉంది. పూర్తిగా చదవాలన్నా చాలా కాలం పడుతుంది. అందువలన, యీ గ్రంథంలోని విషయాన్ని తగ్గించి వ్రాయాలనుకున్నాడు. 'అభినయదర్పణం' అనే పుస్తకాన్ని వ్రాశాడు.'

## నోట్సు-అభినయదర్పణం

'ఇప్పుడు చదువుకునే వారికి పుస్తకాలు పెద్దవి అనే ఆలోచన ఉంది. అందుకని నోట్సులు వస్తున్నాయి. మీకు చదువు కోవడం చాలా తేలికగా ఉంది. ఇలాగే నందికేశ్వరుడు ఆలోచించాడు. భరతార్ణవానికి నోట్సు వ్రాశాడు. బాగా తగ్గించి చెప్పాడు. దీనికి 'అభినయ దర్పణం' అనే పేరు పెట్టాడు.

'దర్పణం అనగా అద్దం. ఈ చిన్న పుస్తకం అభినయానికి అద్దం వంటిది. నిజానికి ఇది అద్దం వంటిదే.'



ఈ రచయిత కూడా తెలుగు వాడనే అంటారు. నందికేశ్వరుని ఇలా అనటానికి కారణం వుంది. ఈ గ్రంథానికున్న ప్రతులన్నీ తెలుగు లిపిలోనే దొరికాయి. దేశంలో ఏ ప్రాంతాని కెళ్లినా ఇలాగే ఉన్నాయి. ఇందు వలన నందికేశ్వరుడు తెలుగు వాడని అంటారు.'

### నాటకం

'భరతముని చెప్పిన నాట్యం, మన నాటకం వంటిది. పదిమంది కలిసి ఆడేది. ఒక్కరు ఆడటానికి వీలుండదు. కాని ఒక వ్యక్తి ఎలా ఆడవచ్చునో నందికేశ్వరుడు చెప్పాడు. ఎలా అభినయం చేయవచ్చో చెప్పాడు. అభినయాన్ని గూర్చి వివరంగా చెప్పాడు. అర్థమయే విధంగా చెప్పాడు. ఇందువల్ల ఒక్కరే ఆడటానికి ఈ పుస్తకం చాలా ఉపయోగంగా వుంటుంది. ఇలా ఈ ఇద్దరూ గొప్ప పని చేశారు. గ్రంథాలు వ్రాసి మనకు ఉపయోగపడ్డారు. అప్పటి విధానాలు చెప్పారు. మన పూర్వీకులు ఎలా



రాజు

నృత్యం చేసే వారో వివరించారు. నృత్యం నేర్చుకునే వారంతా వీరికి ఋణపడి ఉన్నారు. అందరూ వీరికి నమస్కరించండి అన్నారు.'

నాట్య శాస్త్రంలోని 'ప్రణమ్య శిరసాదేవా' అనే శ్లోకాన్ని కలిసి పాడాము. 'ఆంగికం భువనం యస్య' అనే నందికేశ్వరుని శ్లోకాన్ని కూడా పాడినాము. చివరకు మౌనంగా కూర్చున్నాము.

ఈనాటి పాఠం ఇలా పూర్తి అయింది.

ఈ రోజు బయట ఉబ్బ చినుకులు పడుతున్నాయి. అందు వలన లోపలే ఉండి పోయాము.

గురూజీ పాఠం చెప్పసాగారు.

## అనేక తెగలు

'పూర్వం భారత దేశంలో అనేక తెగల వారుండే వారు. వారంతా అనేక దేవుళ్ళని పూజించే వారు. దేవతలను కొలిచేవారు. దేవుని గురించి ఎవరి పద్ధతిలో వారూహించుకున్నారు. క్రమేణా గుంపులూ, తెగలు కలసిపోసాగాయి. ఇందు వలన ఒకరు కొలిచే దేవతలను మరొకరు నమ్మసాగారు. పూజించ సాగారు. ఎదుటి వారి నుండి చాలా విషయాలు నేర్చుకోసాగారు. వారంతా మారిపోసాగారు. మారకుండా కొంత మంది ఉన్నారు. పాత పద్ధతులతోనే ఉన్నారు. వారు వెనకబడిపోయారు. ఈ నాటికీ ఆటవికులు గానే ఉండి పోయారు.'

'ఇందు వలన వేల సంవత్సరాలనాడున్న విధానాలు మారిపోయాయి. క్రొత్తగా అనేక విషయాలను కనిపెట్టారు. చాలా అభివృద్ధిచెందారు.'

'మన దేశానికి మూడు వైపుల సముద్రం ఉంది. ఉత్తరాన పర్వతాలున్నాయి. సముద్రం మీదుగా ఇతరులు రావటం చాలా కష్టం. ఆరోజుల్లో చిన్న పడవలే

ఉండేవి. ఇప్పటిలాగా యంత్రాలు లేవుకదా! కాబట్టి ఇతరులు పర్వతాల మీదుగా వచ్చేవారు

## కైబరు, బోలన్

'హిమాలయ పర్వతాలలో వాయవ్య దిశలో దారులున్నాయి. కైబర్, బోలన్ అనే కనుమలున్నాయి. వాటి వెంటబడి ఇతరులు దండెత్తి వచ్చేవారు. యుద్ధాలు చేసేవారు. కొన్ని పర్యాయాలు ఓడిపోయేవారు. మరికొన్ని సార్లు గెలిచేవారు. గెలిచిన వారు పాలించే వారు.'

'ఈ దండయాత్రల వలన శాంతి ఉండేదికాదు. సుఖంగా బ్రతకటానికి వీలుండేది కాదు. ఇందు వలన కొంత మంది భారత దేశం లోని యితర ప్రాంతాలకు వలస పోయేవారు. అలా వెళ్లే ప్రదేశంలో ఆహార పదార్థాలు దొరకాలి. త్రాగేందుకు మంచినీరు వుండాలి. ఉండటానికి అనుకూలంగా ఉండాలి.'

'మనదేశం పైన దండయాత్రలు చేసిన అనేక జాతుల వారిని గూర్చి చెపుతాను. ఆర్యులకు ముందు విషయాన్ని వదిలేద్దాం. ఆర్యులతో ప్రారంభించుదాం.'

## పరదేశీయులు

'ఆర్యులు, అస్సీరియనులు, సిధియనులు, పారసీకులు ఇలా చాలా మంది వచ్చారు. గ్రీసు నుండి గ్రీకు దండయాత్రలొచ్చాయి. అలెగ్జాండరు నాయకత్వం వహించాడు. పఠానులొచ్చారు. మంగోలియనులొచ్చారు. ఇలా ఎందరి పేరులో చెప్పవచ్చు. అతి చిన్న దేశమైన ఆర్మీనియానుండి వలస వచ్చారు.'

'ఆ తరువాత ముస్లిం దండయాత్రలు జరిగాయి. బాబరు నాయకత్వాన మొగల్ సైన్యాలు పంజాబులో ప్రవేశించాయి. ఢిల్లీని పట్టుకున్నాయి.'

## ప్రవక్త

'ముస్లింలందరూ మహమ్మద్ ప్రవక్త శిష్యులు.భగవంతుడొక్కడే అని వీరి నమ్మకం. విగ్రహారాధనను వ్యతిరేకిస్తారు. వీరికి కులం మీద నమ్మకం లేదు. అందరూ భగవంతుని బిడ్డలని భావిస్తారు. వీరి మత గ్రంథం ఖురాన్.'

'ముస్లిం దండయాత్రల వలన దేశంలో మార్పులొచ్చాయి.'

'మన దేశానికి మధ్యలో అడ్డంగా ఎత్తయిన పర్వతాలున్నాయి. వీటిని వింధ్య, సాత్పూరా పర్వతాలని పిలుస్తారు. వీటికి ఉత్తరంగా వున్న ప్రాంతాన్ని ఉత్తర భారత దేశం అంటారు. ఈ దండ యాత్రల వలన ఉత్తర భారత దేశంలో అనేక

మార్పులు జరిగాయి.'

## కలయికలు



'అంతకు ముందున్న హిందువుల నమ్మకాలు వేరు. రాజ్యాలు వేరు. రాజుల వేరు. కాని, కొత్తగా వచ్చిన మొగల్ పాలకుల అభిప్రాయాలు వేరు.'

'యుద్ధాలు జరిగాయి. రక్తం ప్రవహించింది. అనేక మంది చనిపోయారు. రాజ్యాలు పడిపోయాయి. రాచరికాల మారిపోయాయి. ఈనాటి ఢిల్లీ ప్రాంతాన్ని రాజధానిగా చేసుకున్నారు. జయించిన బాబర్ పరిపాలించాడు. అతని తరువాత అతని సంతానం పాలించింది. ఇందు వలన ఢిల్లీ నగరం సైనిక కేంద్రంగా మారిపోయింది. రాజకీయ కేంద్రంగా అభివృద్ధి చెందింది. వివిధ జాతుల వారు అక్కడకు చేరారు. వారి భాషలు వేరు. ఆచారాలువేరు. ఐనా, ఒకరితో ఒకరు మాట్లాడుకోవాలి. దీనికి వేరే భాష కావాలి. అప్పటికి ఇలాంటి భాష పెరుగలేదు. ఒకరికి తెలిసిన పదాలు మరొకరు వాడసాగారు. అవసరం వలన యిలా చేయక తప్పలేదు.'

## ఉర్దూ

'ఇలా అనేక భాషల్లోని పదాలు కలిసి పోయాయి. హిందీ పదాలు, పర్షియన్ పదాలు కలిపి వాడసాగారు. చివరకు **ఉర్దూ భాష**గా రూపొందింది. అందరికీ లింకు భాషగా ఆనాడు ఉర్దూ పుట్టింది. త్వరగా పెరిగింది. చివరకు సాహిత్యం, సంగీతంలో ఉర్దూను వాడసాగారు. కళారంగంలో మార్పులొచ్చాయి. ఎక్కడినుంచో వచ్చిన మొగలాయీ సైన్యాలలో అనేకమంది ఉన్నారు. అరేబియా ప్రాంతీయులున్నారు. బెలూచిస్థాన్ వారున్నారు. సామర్ ఖండ్ వారున్నారు. ఆఫ్ఘనిస్తాన్ వారున్నారు. ఇలా వచ్చిన వారు తిరిగి వెళ్లిపోలేదు. పూర్వం అనేక మంది దండయాత్రలు చేసేవారు. దేశాన్ని దోచుకుని పోయేవారు. కాని, మొగలాయీ సైన్యాలు యిక్కడే ఉన్నాయి. భారత దేశాన్ని తమ జన్మభూమిగా భావించారు. స్థిరపడిపోయారు. వీరి మతం వేరు. భాషవేరు. భగవంతుని గూర్చి వీరి భావనలు వేరు. కళారూపాలు వేరు. ఇలా వుండటం సహజం.'

## మార్పు

'మొగలాయి దండ యాత్రలకు ముందున్న ప్రజల భావాలు వేరు. ఇందువలన కొంత ఘర్షణ జరిగింది. కాని కొంత వరకు సరిపెట్టుకోసాగారు. కొన్ని రంగాలలో మార్పులొచ్చాయి. మొగల్ చక్ర[illegible] సంగీతం మారిపోయింది. నృత్యం మారిపోయింది.'



'ఒక విధంగా హిందూ, ముస్లిం భావాల నుండి వేరే నృత్యరీతులొచ్చాయి. కొత్త సంగీతం పుట్టింది. సాహిత్యం పెరిగింది. చిత్ర లేఖనంలో మార్పువచ్చింది. పెద్ద పెద్ద భవనాలు కట్టడంలో మార్పు వచ్చింది.'

'వీటి ఫలితాన్ని మనం [illegible] మార్పు హిందూస్తానీగా నిలిచిపోయింది.'

'శిల్పంలో వచ్చిన మార్పుకు తాజ్ మహల్‌ని చెప్పవచ్చు. నృత్యంలో వచ్చిన మార్పు కథక్‌లో క్రొత్తపోకడ పోయింది.'

'ఇలా మనదేశంలో కళారంగం అభివృద్ధి అయింది. పూర్వం గ్రీసు దేశాన్నుండి దండయాత్ర వచ్చింది. మాసిడోనియా రాజు అలెగ్జాండరు. ఇతనకి మన సంస్కృతి పైన అభిమానం. మన ఋషులంటే గౌరవం. ఈయనతో పురుషోత్తముడు యుద్ధం చేశాడు. జీలంనది వొడ్డున యుద్ధం జరిగింది. పురుషోత్తముడు ఓడిపోయాడని అంటారు. ఆ తరువాత అలెగ్జాండరు తిరిగి వెళ్ళాడు.'

## గాంధారశిల్పం

'గ్రీకులను యవనులని పిలుస్తారు. వారికి మనవలెనే లలిత కళలయందు చాలా ప్రేమ. వారు శిల్పాలు బాగా చెక్కేవారు. మనకూ మంచి శిల్పులున్నారు. ఇవి రెండు విధాలుగా ఉంటాయి. తరువాత రీతులు కలిసి పోయాయి. **గాంధార శిల్పంగా** రూపొందాయి. బుద్ధుని శిల్పాలు గాంధార శిల్పంలో చాలా వున్నాయి. ఇలా మన

సంస్కృతిమీద యితరుల ప్రభావాలు అప్పుడప్పుడూ పడుతుండేవి.'

'మీకు ఆర్యుల దండయాత్రను గూర్చి చెప్పాను. ఆర్యావర్తాన్ని గూర్చిబోధించాను. ఆర్యులు, అనార్యులు ఎలా కలసి పోయారో వివరించాను. ఇలా కలసిన వారు సంస్కృత పదాలను పలకలేక పోయేవారు. వారు పలికే తీరు వేరుగా వుంటుంది. అదో కొత్త బాష అని అనవచ్చు. దాన్ని ప్రాకృతం అన్నారు. క్రమేణా ప్రాంతీయ భేదాలు పెరిగాయి అనేక మండలాలలో అక్కడి వారు కొత్త పదాలను వాడే వారు. అందు వలన మాండలికాలుగా ఆ భాష తయారయింది.'



## కొత్త భాషలు

'మనకు గోదావరి మండలంలో తెనుగు మాట్లాడే తీరు వేరుగా ఉంటుంది. రాయల సీమ తెనుగు ఉచ్చారణ వేరు, వాడే పదాలు వేరు. ఇక నెల్లూరుతో శ్రీకాకుళం పోల్చితే చాలా తేడా కన్పిస్తుంది.'

'ఇలా ఒకో ప్రాంతంలో ఒకో మాండలికం వచ్చింది. విశాలమైన ప్రదేశంలో వేరే భాషలొచ్చాయి. ఇలా వచ్చినందున గంగాతీరంలో సూరసేని, మాగధి అంటూ అనేక పేర్లతో పిలువ సాగారు.

యీ నాటి పాట్నాని పూర్వం **పాటలీపుత్రం** అనేవారు. ఇది బీహారుకు ముఖ్యపట్టణం. గంగానది ప్రక్కనే ఉంది. ఈ ప్రాంతపు ప్రాకృతాన్ని పాళి అనేవారు. ఈ ప్రాంతపు వాడే గౌతమ బుద్ధుడు.'

'పాళి సామాన్యులు మాట్లాడుకునే భాష. బౌద్ధమత వ్యాప్తికి పాళి భాషను వాడుకున్నారు. పాళి లోనే శాసనాలు చెక్కించారు. బుద్ధుని బోధలన్నీ పాళి భాషలోనే ఉన్నాయి. మతవ్యాప్తికి ఇది అవసరంకదా! ఈ విధంగా పాళి బౌద్ధమత భాష అయింది.'

'సంస్కృతం హిందూ మత భాష అయింది.'

'ఇలా పాళిలో, సంస్కృతంలో అనేక గ్రంథాలొచ్చాయి. క్రమేణా ప్రాంతాల వారీగా ప్రజలు మాట్లాడుకునే భాషలు పెరిగాయి. వాటిని వ్రాయటానికి లిపి కూడా

తయారయింది.

## వాయిద్యాలు

'పాటలొచ్చాయి. చర్మవాయిద్యాలు తయ్యారైనాయి. కంచు వాయిద్యాలు పోతపోసి తయారు చేశారు. తీగ వాయిద్యాలు రూపొందించారు. ఊదే వేణువులలో అనేక రకాలు చేశారు. ఇలా కళారంగంలో మంచిమంచి మార్పులు వచ్చాయి: ఎన్నో భాషలు పెరిగినాయి కదా! ఐనా సంస్కృతం పూర్తిగా తన పట్టు వదలలేదు. ఆ రోజుల్లో సంస్కృతం ఈ దేశానికి లింకు భాషగా వుంది.'

## లింకు భాష

'బ్రిటీష్ వారు మన దేశాన్ని పాలించే రోజుల్లో ఒక ఆలోచన వచ్చింది. మన దేశానికి అందరూ వాడుకోటానికి వీలైన భాషగా దేన్ని వుంచాలి?' సంస్కృతాన్ని చేయాలా? ఇంగ్లీషును చేయాలా? మన దేశంలో ప్రముఖ వ్యక్తిగా రాజారామమోహన్ రాయ్ ఉన్నాడు. ఆయన ఇంగ్లీషునే చేయమన్నాడు. ఆయన మాటే నెగ్గింది. చివరకు ఆంగ్ల భాషే అనుసంధాన భాష అయింది. తరువాత మహాత్మా గాంధీజీ హిందీని ప్రోత్సహించారు. లింకు భాషగా దాన్ని ఆదరించారు. ఈ విషయాన్ని ఎందుకు చెప్పానో మీకు తరువాత తెలుస్తుంది అన్నారు.'

లోపల వేడగా ఉంది చెమటలు పడుతున్నాయి. ఇప్పుడే సముద్రపు గాలిసాగింది. కృష్ణ వేణి మీదుగా చల్లగాలి వస్తోంది. అందరం బయటకి వచ్చాము.

మామిడి చెట్టుమీద కోయిల రెట్టిస్తూ, కూస్తోంది.

## సారంగదేవుడు

'పూర్వం సారంగ దేవుడు అనే గొప్ప వ్యక్తి ఉండే వాడు. ఆయనకు సంగీతమన్నా, నృత్యమన్నా ఎంతో ప్రేమ. అందమైన కాశ్మీర దేశం నుండి అతని పూర్వీకులు వచ్చారు.'

'మహారాష్ట్రలో గోదావరి నది పుట్టింది. ఆ నది ఆంధ్ర దేశం గుండా ప్రవహించి సముద్రంలో కలిసింది. ఆ నదికి కొద్ది దూరంలో మహారాష్ట్రలో దేవగిరి అనే కోట ఉంది. అక్కడ యాదవ రాజులు పాలిస్తున్నారు. వారు సారంగ దేవుని ఆదరించారు. తమ దగ్గర ఉంచుకున్నారు. ఆయన '**సంగీత రత్నాకరం**' అనే గ్రంథం వ్రాశాడు.'

'సారంగ దేవుని కాలానికి మనదేశంలో ఎన్నో మార్పులొచ్చాయి. ఆయన

కళలను గూర్చి పరిశోధన చేశాడు. స్వయంగా దేశాలు తిరిగి తెలుసుకున్నాడు. ఉత్తర భారత దేశంలోని కళలను గూర్చి వ్రాశాడు. దక్షిణాది వారిని గూర్చి వ్రాశాడు. రెండు ప్రాంతాలలో ఎంతో మార్పు వచ్చింది. ఒకప్పుడు దాదాపు ఒకే విధంగా ఉండేవి. కాని, సారంగ దేవుని కాలానికి చాలా తేడా పెరిగింది. మొగలాయీ పాలనను గూర్చి చెప్పాను కదా! అప్పటికి దక్షిణ దేశంలో ముస్లిం ప్రభావం దాదాపు లేదు. ఇందువలన రెండు రకాలైన బాణీలు తయారైనాయి. రెండూ వేరువేరుగా ఉన్నాయి. రాజులతో ఆదరించబడినాయి. బాగా అభివృద్ధి చెందినాయి. వీటిని తన పుస్తకంలో వ్రాశాడు. ఇలా సారంగదేవుడు మనకు ఎంతో సాయం చేశాడు. సంగీతరత్నాకరాన్ని సంస్కృతములో వ్రాశాడు.'

'ప్రపంచంలో అనేక దేశాలున్నాయి. అనేక జాతుల వారున్నారు. మతాల వారున్నారు. అనేక రంగుల వారున్నారు. వీరంతా మేం గొప్పఅంటే మేంగొప్ప అని పోట్లాడుకున్నారు. అధికారం కొరకు యుద్ధాలు చేశారు. రక్తాన్ని చిందించారు. మానవుడు తనతోటి మానవుని పట్ల క్రూరంగా ప్రవర్తించాడు. దీనికి కారణం మనిషిలోని స్వార్థం.'



అందుకే మహా కవి శ్రీ శ్రీ ఇలా అన్నారు

ఏజాతి చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పర పీడన పరాయణత్వం.

## మనుషులంతా ఒక్కటే

'చిరంజీవులారా! ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. జీవితాంతం దీన్ని మరువకండి. **మానవులందరూ ఒకటే.** రంగు, జాతి, మతంతో నిమిత్తం లేదు. అందరూ భగవంతుని రూపాలే. అందరూ సమానులే. అందరూ సుఖంగా జీవించ వలసిందే. శాంతిగా బ్రతక వలసిందే. ఈ మాట మరచిపోరాదు మన పూర్వీకులు ఈ మాటను నొక్కి చెప్పారు.'

'సర్వేజనాం సుఖినోభవన్తు' అన్నారు.

'మరోమాట చెపుతాను వినండి.'

## జాత్యహంకారం

'మాజాతి గొప్పది, ఇతరులు తక్కువ అని అనుకోరాదు. ఇలా అనుకోటాన్ని జాతి దురహంకారమంటారు. పూర్వం జర్మన్ దేశాన్ని హిట్లరు పాలించాడు. తన జర్మన్ జాతి గొప్పదన్నాడు. యూదుజాతి వారిని హింసించాడు. చాలా మందిని చంపించాడు. ఇతర దేశాలపై దాడి చేశాడు. మిగతా వారిని క్రూరంగా బాధించాడు. నరకయాతన పెట్టాడు. కోట్లాది మంది చనిపోవటానికి కారణమైనాడు. ఇన్ని చేసి తానేం పొముకున్నాడు? ఆత్మహత్య చేసుకుని చనిపోయాడు. జాతి దురహంకారం పెరిగితే, మనతో చాలా చెడ్డ పనులు చేయిస్తుంది. మనమూ హిట్లరు మాదిరిగా మారిపోతాము.'

## జాతి ప్రత్యేకత

'ప్రతిజాతికీ ఒకో ప్రత్యేకత ఉంది. నివసించే ప్రాంతాలను బట్టి మార్పు ఉంటుంది. చుట్టూ నివసించే ఇతర జాతుల ప్రభావం ఉంటుంది.భూమి తీరు, నదులు, అడవులు, వర్షాలు, వేడి, చలి వారి మీద ప్రభావం చూపుతాయి. వారి జీవిత విధానం ప్రత్యేకంగా తయారు కావటానికి ఉపయోగ పడతాయి. ఇందు వల్ల ధృవ ప్రాంతాలలో ఉండే వారికి, ఎడారుల్లో ఉండే వారికి ఎంతో తేడా ఉంటుంది. కొండలపైన మంచు కురిసే చోట ఉండే వారు వేరుగా ఉంటారు. నది అంచుల వారు మరో రకంగా ఉంటారు. సముద్రాల ప్రక్కన ఇంకో విధంగా ఉంటారు. ఇలా పోల్చుకుంటూ చూడవచ్చు. ప్రతివంద కిలో మీటర్లకు ఏదో కొంత మార్పు కన్పిస్తూ వుంటుంది.'

'మన వారి మీద అభిమానం ఉండవచ్చు. ఇందు వలన ఎదుటి వారికి బాధ కలిగించరాదు. ఇతరులను అవమాన పరచే విధంగా ఉండకూడదు. మీరంతా ఈ విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. జీవితంలో ఇతరులను ప్రేమగా చూడాలి. మంచిగా చూడాలి. కళారంగానికి ఈ భావాన్ని అన్వయించు కోవాలి. ప్రకృతిలో పూలు పూస్తాయి. మానవ సమాజంలో కళలు వికసిస్తాయి. ప్రతి పూవూ దాని రంగులతో అందాన్ని చూపుతుంది. సువాసనలతో మనసును కదిలిస్తుంది. కళలు కూడా ఇలాగే చేస్తాయి.'

సాయంకాలం పెందరాళే చల్లబడింది. దూరంగా ఇసుకతిన్నెలు సుందరంగా ఉన్నాయి. ఇసుక మీదుగా పెళ్లివారు గుడిసీ బళ్లల్లో వెళ్తున్నారు. పల్లకీ, మేనాలు

మోస్తూ బోయీలు వేగంగా నడుస్తున్నారు.

గురూజీ మా అందరి వంకా ప్రశాంతంగా చూశారు. వారి చూపులో చెప్పలేని ఆకర్షణ వుంది.

వారు చిరునవ్వుతో 'ఈ పూటకు చాలు' అన్నారు.

వేసవి జల్లులు పడి తాపం తగ్గింది. నేల మీద పడ్డ వర్షపు నీటి వలన దుమ్ము లేవటం లేదు. మేమంతా గురూజీ వెంట తోటలోకి వెళ్ళి కూర్చున్నాము.

ఎక్కడ చూసినా నేల తల్లి ఆకుపచ్చని చీర కట్టుకున్నట్లు ఉంది. నాలుగు రోజుల వానతో నేలంతా పచ్చపడింది. ప్రకృతిలో అందాలు పెరిగాయి.

గురూజీ కృష్ణానది మీదుగా తూర్పుగా చూస్తున్నారు. సాయం కాలపు ఎండకు శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు దేవాలయపు కలశాలు మెరుస్తూ కన్పిస్తున్నాయి. వారు నెమ్మదిగా ప్రారంభించారు.



అమరావతి స్థూపం

అటు చూడండి' అని శ్రీకాకుళం గాలిగోపురం వైపు చూపించారు.



**శాతవాహనులు**

ఈ ప్రాంతాన్ని రెండు వేల సంవత్సరాల నాడు శాతవాహనులు పాలించారు. ప్రస్తుతం మనం అమరావతి అని ఒక గ్రామాన్ని పిలుస్తున్నాము. అది కృష్ణానది ప్రక్కనే ఉంది. గుంటూరుకు 30 కి.మీ దూరంలో ఉంది. దీనిని పూర్వం **ధాన్యకటకం** అనేవారు. **ధనకటకమనీ** పిలిచేవారు. ఇది బౌద్ధ క్షేత్రం. ప్రపంచంలో అనేక ప్రాంతాలనుండి చూడటానికి వచ్చేవారు. ఈ ఆరామంలో ఉండే వారు. ఈ స్తూపాన్ని పూజించేవారు. భక్తితో మొక్కేవారు. దానధర్మాలు చేసేవారు.

**ధాన్యకటకం**

'ఈ స్తూపం చుట్టూ రాతి ఫలకాలు నిలబెట్టారు. వాటిపైన అందంగా బొమ్మలు చెక్కారు.ఈ బొమ్మల్లో నృత్యాలున్నాయి. భరతముని వ్రాసిన పద్ధతిలో కొన్ని బొమ్మ లున్నాయి. చాలా మంది కలిసి ఆడే నృత్యాలను చెక్కారు. రెండు వేల సంవత్సరాల నాడే ఆంధ్రదేశంలో నృత్యం ఉంది. బాగా పెరిగింది.'

'ఆంధ్రదేశంలో చాలా బౌద్ధ క్షేత్రాలుండేవి. **ఘంటశాల, నాగార్జున కొండ, భట్టిప్రోలు, జగ్గయ్య పేట, నేలకొండ** పల్లి అంటూ చాలా పేర్లు చెప్పవచ్చును. గుంటూరు విజయవాడ మధ్య నాగార్జున విశ్వవిద్యాలయం వుంది. ఈ ప్రాంతంలో ఒక స్తూపం దొరికింది. అన్ని చోట్లా శిల్పాలు దొరికాయి.'

**గాథలు**

'శాతవాహనులలో ఒక రాజు పేరు **హాలుడు.** ఈయన గాథాసప్తశతి అనే గ్రంథాన్ని తయారు చేశాడు. గాథలను అనేక మందితో వ్రాయించాడు. గాథ అనగా చిన్న పద్యం. గాథలలో కూడా మన నాట్యాన్ని గూర్చి చెప్పి ఉన్నారు.'

'ఈ రచనలు మహారాష్ట్ర ప్రాంతపు ప్రాకృతంలో ఉన్నాయి.'

'మనం వాడుతున్న శాలివాహన శకం వీరినుండి వచ్చింది.'

'మరికొంత కాలానికి **అభినవ గుప్తుడనే** పండింతుడు నాట్యకళ మీద

అభిమానంగా ఉండేవాడు. భరతుని నాట్యశాస్త్రం చదివాడు. అందరికీ తెలిసేవిధంగా వివరంగా వ్రాయాలనుకున్నాడు. ఇలా వ్రాయటాన్ని వ్యాఖ్యానమంటారు. ఈయన వ్రాసిన వ్యాఖ్యానాన్ని **అభినవ భారతి** అంటారు. ఈ వ్యాఖ్యానం లేకపోతే, నాట్య శాస్త్రం అర్థం చేసుకోవడం చాలా కష్టంగా వుంటుంది.'

## గుణాఢ్యుడు

'శాతవాహనులలో ఒక రాజు వద్ద గుణాఢ్యుడనే మంత్రి ఉండేవాడు. ఆయన **బృహత్కథ** అనే గ్రంథాన్ని వ్రాశాడు. బృహత్కథ అంటే పెద్ద కథ అని అర్థం. దీన్ని **పైశాచీ భాష**లో వ్రాశాడు. అప్పటి రోజుల్లో ఇది ప్రజల కర్థమయ్యే భాష.'

'బృహత్కథలో సామాన్యుల కష్ట సుఖాలు తెలుస్తాయి. వారి నృత్యాలు తెలుస్తాయి. సంగీతం ఎలా ఉండేదో తెలుస్తుంది. ఈ కథను తీసుకుని క్షేమేంద్రుడనే రచయిత మరో పుస్తకం సంస్కృతంలో వ్రాశాడు. దీని పేరు **బృహత్కథామంజరి.** ఇతను అభినవ గుప్తుని శిష్యుడని చెపుతారు. ఇంతకు ముందే అభినవ గుప్తుని గురించి చెప్పానుకదా!'

'ఇలా సంస్కృతంతో ప్రాకృతం పోటీగా ఉండేది. వీటిలో ప్రజలు మాట్లాడుకునే భాషలు పోటీవడేవి. చివరకు ప్రజలు మాట్లాడుకునే భాష రాజభాష అయింది. ఇప్పుడు ఆంధ్ర దేశంలో అధికార భాష తెలుగు.'

## కాకతీయులు

'ఓరుగల్లు రాజధానిగా చేసుకుని కాకతీయులు పాలించారు. కాకతి గణపతి దేవ చక్రవర్తికి మంచి పేరుంది. ఈ వంశం వారు లలిత కళలను బాగా పోషించారు. నృత్యం బాగా అభివృద్ధి చేశారు. సంగీతం, శిల్పం పెంచారు. సాహిత్యాన్ని పోషించారు. శైవ మతారాధన బాగా పెరిగింది. దానితో పాటు లలిత కళలు కూడా పెరిగాయి. లలిత కళలను మత ప్రచారానికి వాడుకున్నారు.'

'గణపతి దేవుని సమకాలీనులు యాదవరాజులు. వారి వద్ద సారంగదేవుడున్నాడని చెప్పాను కదా! ఓరుగంటికీ, దేవగిరికీ స్నేహం తక్కువ. విరోధం ఎక్కువ. పోటీ కూడా ఎక్కువే. పోటీ పడి లలిత కళలను ఆదరించే వారు.'

'గణపతి దేవుడు అనేక మందిని పెళ్లి చేసుకున్నాడు. వారంతా ఒక కులస్తులు కారు.'

'గణపతి దేవునికి ఒక బావమరిది వున్నాడు. ఆయన పేరు **జాయప.**'

## జాయప



కాకతీయుల కీర్తితోరణం

'జాయపను గూర్చి కొద్దిగా చెపుతాను. వినండి.'

'మనం వున్న ఈ లంక నుండి కృష్ణానది దిగువకు ప్రవహిస్తోంది. ఈ నది మరి కొంత దూరం వెళ్ళి రెండు పాయలుగా చీలుతుంది. చివరకు సముద్రంలో కలుస్తుంది. ఈ పాయల మధ్య ఉన్న భూమిని 'దీవి' అంటారు. ఈ ద్వీపం మీద ఒక రాజు కోట కట్టుకున్నాడు. ఆయన పేరు పిన్నచోడనాయకుడు. ఈ ప్రాంతానికి రాజు. గణపతి దేముడు యుద్ధానికి వచ్చాడు. నాయకుడు సంధిచేసుకున్నాడు. నాయకునికి ఇద్దరు కుమార్తెలున్నారు. వారిద్దరూ చాలా

అందమైన వారు, వారిని నారమ్మ, పేరమ్మ అని పిలిచేవారు.'

'నారమ్మను, పేరమ్మను గణపతి దేవునికిచ్చి పెళ్లి చేశాడు. చక్రవర్తిని అల్లునిగా చేసుకున్నాడు.'

'పిన్నచోడనాయకునికి జాయప అనే కుమారుడున్నాడు. అక్కల మాదిరిగా అందంగా ఉండే వాడు. తెలివిగా వుండేవాడు. చురుగ్గా వుండేవాడు.'

## ప్రోత్సాహం

'బావమరిదిని చూసి గణపతి దేముడు పొంగిపోయాడు. వెంట పెట్టుకుని రాజధానికి తీసుకు వెళ్ళాడు. గుండయామాత్యుడనే గురువు దగ్గర ఉంచాడు. విద్య చెప్పించాడు.'

'జాయప చాలా తెలివైన వాడు. అనేక విద్యలు నేర్చుకున్నాడు. సంగీతం సాధన చేశాడు. నృత్యం నేర్చుకున్నాడు. వాయిద్యాలయందు అభిరుచి పెంచుకున్నాడు. ఇంతేకాదు. ఏనుగులను నడపడం నేర్చుకున్నాడు. వీటితో యుద్ధం చేయడం నేర్చుకున్నాడు. లలిత కళలతో పాటు యుద్ధ విద్య సాధన చేశాడు.'



'అబ్బాయిలూ! జాయపకు అన్ని వనరులూ కుదిరాయి. కష్టపడ్డాడు పట్టుదలతో నేర్చుకున్నాడు. అవకాశాలున్నా సోమరి పోతులయ్యే వారిని మనం చూస్తుంటాము. అలా ఉండరాదు. మన జీవితం చాలా చిన్నది. నేర్చుకోవలసింది చాలా ఉంది. తెలుసుకోవలసింది ఎంతో ఉంది. ప్రతినిమిషం పట్టుదలగా కృషి చేయాలి.'

'జాయప గొప్పతనం నలుగురూ గుర్తించారు. గణపతి దేవుడు జాయపను గజ సైన్యాధ్యక్షునిగా నియమించాడు.'

## రచనలు

'గణపతి దేవునకు సంగీతమన్నా, నృత్యమన్నా చాలా యిష్టం. వీటిపైన ఏదైనా గ్రంథం ఉంటే బాగుంటుందనుకున్నాడు. బావమరిదిని ఆపని చేయమన్నాడు. జాయప అంగీకరించాడు. 'నృత్తరత్నావళి' అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఇది సంస్కృతంలో ఉంది. గణపతి దేవునకు అంకిత మిచ్చాడు.'

'ఈ గ్రంథం తెలుగు రచయిత నృత్యంపైన వ్రాసిన మొదటి పుస్తకం. ఇందులో అప్పటి నృత్యాలను గూర్చి చాలా వివరాలున్నాయి. శాస్త్రీయ నృత్యాలను గూర్చి చెప్పాడు. జానపద నృత్యాలను గూర్చి చెప్పాడు. ఇంతకు ముందు అనేక మంది వ్రాశారు. వారెవరూ జానపదాలను గూర్చి యింత బాగా చెప్పలేదు. ఆ రచయితలు తెలుగువారు కాదు.'



'దేవాలయాలలో పూజా నృత్యాలు జరిగేవి. కాకతీయుల కాలంలో నృత్యానికి గౌరవం అధికంగా ఉంది. పవిత్రత కూడా కలిగించారు. దేవుని ముందు ఆడించారు. ఆరాధించారు. జాయప యింకా చాలా పుస్తకాలు వ్రాశాడని చెపుతారు. వాటి పేరు **గీతరత్నావళి, వాద్యరత్నావళి.** అవి యింత వరకు దొరకలేదు.'

'ఈ విధంగా ఓరుగంటి కాకతీయులు నృత్య పూజ చేశారు. ప్రోత్సహించి రచనలు చేయించారు. ఇందువల్ల జాయప వంటి మహాపురుషుడు మనకు తెలిశాడు.'

గురూజీ చెప్పటం ఆపివేశారు. అందరినీ పరిశీలనగా చూసి, 'ఏమైనా అనుమానా లున్నాయా?' అన్నారు.

పదవతరగతి చదువుతున్న ప్రసాద్ లేచి నిలబడ్డాడు.

'గురూజీ! యిన్ని మంచి లక్షణాలున్న వ్యక్తి ఏజాతిలోనైనా ఉన్నాడా?' అని

అడిగాడు.

గురూజీ నవ్వుకున్నారు.

## జాత్యహంకారం

'అబ్బాయిలూ! ప్రతిజాతీ గొప్పవారిని కన్నది. చరిత్రలో కొందరు నిలిచి పోయారు. వారిని గూర్చి ప్రజలకు తెలుసు. వారు చేసిన పనులు తెలుసు. పుస్తకరూపంలో వచ్చాయి. లేకుంటే శిలా శాసనాలుగా నిలిచి ఉన్నాయి. ఇందువలన వారికి ప్రచారం లభించింది. కాని కొంత మంది పేర్లు మనకు తెలియనే తెలియవు. తెలుసుకోటానికి ఆధారాలు లేవు. నిప్పును తయారు చేయటం కనిపెట్టారు. కుమ్మరిసారె కనిపెట్టారు. వ్రాయటానికి లిపి కనిపెట్టారు. శిల్పాలు చెక్కారు. నాగలిని కనిపెట్టారు. విల్లు, బాణం తయారు చేశారు. పత్తినుండి దారం తీశారు. బట్టలు నేశారు. చక్రాన్ని తయారు చేశారు. ఇలా అనేకం చెప్పవచ్చు. కాని, వారి పేర్లు మనకు తెలియవు. వారెలా ఉంటారో చెప్పలేము. వారేకాలం వారో కూడా సరిగా చెప్పలేము. కొంత వరకు అంచనా వేయవచ్చు. వారు మాత్రం సామాన్యులా? గొప్పవారు కాదా?'

'ఇందువలన మనం చెప్పేది మనకు తెలిసినంత వరకే. మనకు తెలిసిన ప్రపంచంలోని వారిని గూర్చి మాత్రమే చెప్పగలం.'

ప్రసాద్ వింటూ నిలబడ్డాడు.

గురూజీ ఒక నిమిషం ఆగారు. 'అబ్బాయిలూ! అన్ని జాతుల వారూ గొప్పవారిని కన్నారు. మనకు తెలిసినంత వరకు జాయప మహావ్యక్తి. తెలుగు వారిలో ప్రముఖుడు. కళారచయితగా చాలా గొప్ప వ్యక్తి.'

'ప్రసాద్! అర్థమయిందా?' గురూజీ ప్రశ్నించారు.

ప్రసాద్ తెలిసిందని చెప్పాడు.

ఇంతలో సన్నని జల్లు ప్రారంభమైంది. పైన మబ్బులు పరుగులు తీస్తున్నాయి. గాలి బాగా సాగింది. గురూజీ చెప్పటం మాని, మమ్మల్ని వెంట తీసుకుని ఆశ్రమానికి బయలుదేరారు.

మరునాటి సాయంకాలం తోటల మధ్యగా షికారుకు వెళ్లాము. ఆకుతోట ప్రక్కగా నడుస్తున్నాము. అవిసె చెట్లు, మునగ చెట్లు నిలువుగా పెరిగాయి. వాటికి

తమల పాకు తీగలు పాకాయి. ఒంపులు తిరిగి సుతారంగా చుట్టుకున్నాయి. కవటాకులు మెరిసిపోతున్నాయి. తడికట్టిన చేను చల్లగా ఉంది. ప్రక్కనే ఉన్న కొబ్బరితోటలో కూర్చున్నాము.

'ఏం చెప్పమంటారు?' గురూజీ అడిగారు.

ఎవ్వరూ మాట్లాడలేదు.

'అడగండి?' గురూజీ ప్రోత్సహించారు.

'కాకతీయులను గూర్చి మరికొంత చెప్పండి.' నా ప్రక్కనున్నతను అడిగాడు. ఎందువలన కాకతీయులను గూర్చి తెలుసుకోవాలను కుంటున్నావు?' గురూజీ ప్రశ్నించారు.

అతను నెమ్మదిగా సమాధానం చెప్పాడు. 'నేను తిక్కన మహాకవిని గూర్చి చదివాను. ఆయన గణపతి దేవుని దగ్గరకు వెళ్లారని వ్రాసిఉంది. మీరు జాయపను గూర్చి చెప్పారు. ఇందువలన తెలుసుకోవాలనిపించింది.'

గురూజీ ప్రారంభించారు.

## నన్నయ

'మన తెలుగు భాషకు లిపి ఎవరు రూపొందించారో తెలియదు. కొన్ని చోట్ల రాతి మీద చెక్కిన పద్యాలు కన్పించాయి. పూర్వం నన్నయ అనే గొప్ప కవి ఉండేవాడు. ఆయన రాజరాజనరేంద్రుని కొలువులో ఉండేవాడు. రాజు భారతాన్ని తెలుగులో వ్రాయమని అడిగాడు. నన్నయ్య అలాగే అన్నాడు. భారతం పద్దెనిమిది పర్వాల గ్రంథం. పర్వం అంటే ఒక భాగం అని అనుకోవచ్చు. ఆదిపర్వం వ్రాశాడు. సభాపర్వం వ్రాశాడు. అరణ్యపర్వం వ్రాస్తూ చనిపోయాడు. ఆ తరువాత చాలా కాలం మిగతా గ్రంథాన్ని ఎవ్వరూ వ్రాయాలనుకోలేదు'.



'పెన్నానది అంచునే నెల్లూరు ఉంది. దీన్ని **సింహపురి** అనేవారు. **మనుమసిద్ధి** దీన్ని రాజధానిగా చేసుకున్నాడు. రాజ్యాన్ని పాలిస్తున్నాడు'.

'ప్రక్కనే మరో రాజున్నాడు. ఆయన పేరు **కాటం రాజు**. మనుమసిద్ధికి కాటంరాజుకు తగాదా వచ్చింది. యుద్ధం



జరిగింది. మనుమసిద్ధి ఓడిపోయాడు. ఈయన వద్ద తిక్కన అనే మహాకవి ఉండేవాడు'.

## తిక్కన

'తిక్కన చాలా తెలివైనవాడు. మనుమసిద్ధికి మంచి స్నేహితుడు. ఇందువల్ల తిక్కనను ఓరుగల్లు వెళ్ళి గణపతిదేవుణ్ణి కలుసుకోమన్నాడు. సైన్య సహాయాన్ని కోరమన్నాడు. తిక్కన గణపతి దేవుని వద్దకు వెళ్ళాడు. ఆయన సైన్యాన్ని పంపించాడు. మనుమసిద్ధి రాజ్యాన్ని తిరిగి పొందాడు. ఇలా ఓరుగల్లు రాజులకు, నెల్లూరు రాజులకు స్నేహం పెరిగింది. తిక్కన మహాకవి. ఈయన భారతంలోని మిగతా పదిహేను పర్వాలూ పూర్తి చేశాడు.'

## పురాణ పురుషుల నృత్యం

'భారత కథలో చాలామంది గొప్పవారున్నారు. వారిలో శ్రీకృష్ణుడు గొప్పవాడు. ఈయన గోపికలతో కలిసి నృత్యం చేశాడు. కాళీయుడనే పాము పడగ మీద నిలబడ్డాడు. అక్కడ **తాండవం** చేశాడు. అందుకే కృష్ణుణ్ణి **తాండవ** కృష్ణుడని పిలుస్తారు'.

'అర్జునుడు గొప్ప వ్యక్తి. ఆయన విల్లు పేరు గాండీవం. దానితో యుద్ధం చేసేవాడు. కాని అర్జునునకు నృత్యమంటే చాలా ప్రేమ. ఆయన ఉత్తరకు నృత్యం నేర్పాడు. భారత కథ మీకు తెలుసు కదా! ఇలా తన రచనలో తిక్కన నృత్యాలను వర్ణించాడు. ఎందరెందరో నృత్యాలుచేసినట్లు వ్రాశాడు.'

'గణపతి దేవుని కుమార్తె రుద్రమదేవి. ఆమె కూడా నృత్యాలను ప్రోత్సహించింది. ఆమె మనుమడు ప్రతాపరుద్రుడు. ఆయన ఓరుగల్లు పాలించాడు. ఆయన కొలువులో **మాచల్‌దేవి** అనే నర్తకి ఉండేది. ఆమె చాలా బాగా నృత్యం చేసేది'.

'తరువాత ఓరుగల్లు సామ్రాజ్యం చితికి పోయింది. ముస్లిం దండయాత్రలు జరిగాయి. 1323లో ముస్లింల చేతిలో ఓడిపోయారు. అంతటితో ఓరుగల్లులో కాకతీయుల పాలన ముగిసింది.'

'అప్పటి శిల్పాలు యింకా ఉన్నాయి. శిథిలాలుగా ఉన్నాయి. దేవాలయాలు పడిపోతున్నాయి. వాటిని చూస్తుంటే మనస్సు చివుక్కుమంటుది. కన్నులు చెమ్మగిలుతాయి'.

## శిల్పకళ

'అప్పటి వాటిలో వేయిస్తంభాల దేవాలయం గొప్పది. రామప్ప దేవాలయం ముఖ్యమయింది. ఇంకా చాలా ఉన్నాయి. రామప్ప అనే శిల్పి పేరుతో యీ దేవాలయాన్ని పిలుస్తారు. యిలా శిల్పి పేరుతో పిలవటం ఎక్కడా లేదు. ఒక్క ఆంధ్ర దేశంలోనే జరిగింది'.

'రామప్ప దేవాలయం నిండా బొమ్మలు చెక్కారు. ఆ పనితనం గొప్పగా ఉంటుంది. అందంగా ఉండే ఆడవారిని చెక్కారు'.

## వీరత్వం

'ఆ బొమ్మలు సుకుమారంగా ఉండవు. వీరత్వంతో ఉంటాయి. ఆ రోజుల్లో శివభక్తి చాలా ఎక్కువగా ఉండేది. ఉత్తరాన్నుండి దండయాత్రలు జరిగేవి. వారిని ఎదుర్కోవాలి. అందువల్ల ఎక్కడ చూసినా వీరత్వమే కనిపించేది. ఆవేశమే కనిపించేది.'

'ఇదంతా శిల్పాల్లో చెక్కారు. నృత్యాల్లో చూపించారు.

'శివుని పూజిస్తూ ఆవేశంతో నృత్యం చేసేవారు. దీన్ని పేరిణి అని పిలిచేవారు.'

'కాకతీయులు యుద్ధానికి వెళ్ల బోయే ముందు శివుణ్ణి పూజించేవారు. పేరిణి చేసేవారు. ఇది వీర నాట్యం. పూజా నృత్యం. ఇందు వలన వీర నృత్యపూజ అని అనవచ్చు.'

'మరో నృత్యం ప్రేక్షణి. దీని స్వభావం కూడా వీరత్వమే.'



## ఎర్రన

'భారతాన్ని గూర్చి మరో మాట చెప్పాలి. అరణ్యవర్వం మధ్యలో

ఆగిపోయింది కదా!'

'ఎర్రాప్రెగడ అనే మహాకవి ఉండే వాడు. ఆయన దాన్ని పూర్తి చేశాడు. ఇలా ముగ్గురు కవులు ఆంధ్ర మహాభారతాన్ని వ్రాశారు. తరువాత ఈ కవిని గూర్చి మరో పర్యాయం చెప్పుకుందాం.'

'మరల జాయప సేనాపతిని గూర్చి చెపుతాను. నృత్తరత్నావళిలో రెండు రకాలైన నృత్యాలను వర్ణించాడు. ఆనాటి విద్యావంతులు చేసినవి చెప్పాడు. ఈ నృత్యాలను మార్గ పద్ధతి నృత్యాలంటారు. ఇలాగే సామాన్యులు ఆడినవి వర్ణించాడు. వీటిని దేశీ నృత్యాలంటారు.'

## గొప్ప రచయిత

'ఇలా నృత్యాలను రెండు రకాలుగా విడదీశాడు. గ్రంథంలో రెండిటిని సమంగా వ్రాశాడు. ఇలా వ్రాయటం సామాన్య మైనది కాదు. చివరికి 'ఛండాలిక' ఎలా నృత్యం చేస్తుందో కూడా వివరించాడు. మీరు పెద్ద వారయిన తరువాత నృత్త రత్నావళి చదవండి. ఆనాటి నృత్యాలు ఎలా ఉంటాయో తెలుస్తుంది.'

'నృత్యం చేసే వారికి ఆరోజుల్లో మంచి గౌరవం ఉండేది. మంచి ఆదరణ ఉండేది. శిల్పాలు చెక్కాలంటే నమూనా కావాలి. ఎవర్నైనా నమూనాగా నిలిపే వారు. శిల్పులకు యిది చాలా అవసరం. ఇందుకు నృత్యం చేసేవారు బాగా ఉపయోగ పడేవారు.'

## శిల్పులు

'నృత్యం చేసేవారిని అందంగా నుంచో బెట్టే వారు. ఆ నమూనాతో చెక్కేవారు. ఇలాగే రంగులతో బొమ్మ చిత్రించాలన్నా నమూనా కావాలి. ఈ నమూనాన ఈరోజుల్లో మోడల్ అని అంటాము. మోడల్ అనేది ఇంగ్లీషు పదం.'



'చిరంజీవులూ! మన భాషలో యిప్పుడు చాలా మంది మహాకవులున్నారు. నారాయణ రెడ్డి అనే మహాకవి చక్కని పాట వ్రాశారు. ఆపాట విని గుర్తు పెట్టుకోండి.' ఇలా అంటూ గురూజీ గొంతు సరిచేసుకున్నారు. పాట ప్రారంభించారు.

## నారాయణ రెడ్డి గేయాలు

**ఈ నల్లని రాళ్లలో– ఏకన్నులు దాగెనో!**
**ఈ బండల మాటునా – ఏగుండెలు మ్రోగెనో!**

'ఎంత చక్కగా వ్రాశారో' విన్నారుగదా! అందరం ఆనందంతో గొంతు కలిపి ఆపాట పాడాము. దూరంగా డొంక వెంట ఆవుల మందలు వెళ్తున్నాయి. మా తల పైగా పిట్టలు గూళ్లకు పోతున్నాయి.

మేమూ యింటివైపు బయలు దేరాము.

ఈ రోజు ఏం చెపుతారో? తాతల నాటి కథలన్నీ త్రవ్వి పోస్తున్నారు. వాటిలోని లోతుపాతులు విప్పి చెపుతున్నారు. గురూజీ వద్దకు పంపించి మా నాయనగారు మంచి పని చేశారు. నాకెంతో మేలు కలుగుతోంది.

గురూజీ చెప్పసాగారు.

'నిన్నటి రోజున యక్షగానాలు అనే మాటను వాడినాను. వీటిని గూర్చి వివరిస్తాను.'

## యక్షులు

'ఆంధ్రదేశంలో యక్షులు అనే వారుండేవారు. వారికి సంగీతమన్నా నృత్యమన్నా ఎంతో ప్రేమ. ఈ యక్షులకే జక్కులు అనే మరోపేరు ఉంది. మన ప్రాంతంలో యిప్పటికీ జక్కుల వారున్నారు.

పూర్వం ప్రతిపాలపురం అనే పట్టణం ఉండేది. అక్కడ బౌద్ధారామం ఉండేది. ఆ పట్టణాన్ని నేడు భట్టిప్రోలు అని పిలుస్తారు. అక్కడ ఒక శాసనం దొరికింది. ఆ శాసనాన్ని కుబేరరాజు వేయించాడు. ఆపట్టణంలో యక్షులు కూడా ఉండేవారు. వారు చక్కగ ఆడేవారు. కమ్మగా పాడేవారు. యక్షుల



యక్షిణి

వలన యీ ఆటకు, పాటకు యక్షగానమని పేరు వచ్చింది. ఈ సాంప్రదాయం పెరిగి ఈనాటి నృత్య నాటకాలుగా మారిపోయింది. నేడు యక్షగానం అనగా **నృత్యనాటిక** అనవచ్చు. లేకుంటే **నృత్య నాటకం** అనిపిలువ వచ్చు.



జక్కు - పురంధ్రి

## యక్షగానం

'నేటి యక్షగానంలో ఇతరులు పాడుతుంటారు. పాటకు అనుకూలంగా కొందరు ఆడుతారు. కథను నడిపే విధానం ముచ్చటగా ఉంటుంది. తోలుబొమ్మలాట కూడా యింతే. కథను పాటగా పాడుతుంటారు. మాటలు చెపుతూ నడుపుతారు. పాత్రలకు ప్రత్యేక పాటలుంటాయి. తేడా అల్లా ఒక విషయంలోనే ఉంటుంది. యక్ష

గానంలో మనుషులు ఆడతారు. తోలుబొమ్మల్లో బొమ్మలను ఆడిస్తారు. రెంటినీ పోల్చి చూచినపుడు కథను చెప్పే విధానము ఒకటి గానే ఉంటుంది.
ఈ నాడు జక్కుల వారు చేసే నృత్యాలు కన్పించవు. కాని యక్షగానాలు చాలా మంది ఆడుతున్నారు.'

'జక్కులవారి కులదేవతలు అక్కదేవతలు. ఈ పేరుతో పిలవబడే పర్వతం అనంతపురం జిల్లాలో ఉంది. ఇందువలన ఈ విద్య రాయలసీమలోనే ప్రారంభమైనదని పండితులు చెపుతారు.'

జక్కుల వారు ఇక్కడ నుండి బయలుదేరి దక్షిణ దేశమంతాసంచారం చేశారు. వీరి ద్వారా యీ విద్య పలు ప్రాంతాలకు వ్యాపించింది. ఆదరించబడింది.

వీరి శైలి వృద్ధిపొంది, నృత్య నాటికలో కలిసి పోయింది. కొన్ని ప్రాంతాలలో ప్రత్యేకతను పొందింది.

## కేరళ

'దక్షిణ భారత దేశంలో కేరళ రాష్ట్రం ఉంది. అరేబియా సముద్రం వెంట పొడవుగా ఉంటుంది. అక్కడి వారు కథకళి ఆడుతారు. అది దేశీ పద్ధతికి చెందిన ఆట. కథకళి తరువాత యక్షగానాలు మంచి పేరు పొందినాయి. ఇది చాలా పూర్వకాలం నుండి వస్తున్న ఆట. ఇవి తమిళ దేశంలో కూడా ఉన్నాయి. కన్నడ దేశంలోనూ ఉన్నాయి. ఈ రెండు చోట్ల ఉన్నసాంప్రదాయం కన్నా ఆంధ్ర ప్రదేశంలో బాగా అభివృద్ధి చెందింది. ఇందుకు కూచిపూడి కళాకారులను అభినందించాలి. కన్నడ దేశంలో కూడా యక్షగానం మరో విధంగా చాలా బాగా అభివృద్ధి చెందింది.'

## బసవ పురాణం

'పూర్వం పాల్కురికి సోమనాథుడనే గొప్ప కవి ఉండే వాడు. ఆయన వీర శైవ మతాభిమాని. **పండితారాధ్య** చరిత్ర అనేగ్రంధాన్ని వ్రాశాడు. బసవ పురాణాన్ని వ్రాశాడు. ఆయన యక్షగానాలను గూర్చి వివరించాడు.'



శ్రీనాథుడు

## శ్రీనాధుడు

'కవిత్రయం తరువాత ఆంధ్రదేశంలో మరో గొప్ప కవి జన్మించాడు. ఆయన పేరు శ్రీనాధుడు. ఎన్నో పుస్తకాలు వ్రాశాడు. ఎన్నో రాజాస్థానాలను దర్శించాడు. దేశమంతా తిరిగి చూశాడు. రాజులను మెప్పించాడు. పండితులను మెప్పించాడు. తమిళ దేశంలో ఈనాడున్న కంచిని, కాంచీపురం అనేవారు. దాన్ని, ఆకాలంలో తెలుగు వారు పాలించారు. శ్రీనాధుడు అక్కడకు వెళ్లాడు. కన్నడ రాజ్యానికి ప్రయాణం కట్టాడు. హంపీ విజయనగరం వెళ్లాడు. అక్కడ తెలుగు పద్యాలు చెప్పాడు. ఆ రాజులతో సత్కారాలు పొందాడు.'



'ఈనాడు కృష్ణా నదిమీదుగా నాగర్జున సాగర్ నిర్మించారు. సాగర్, పిడుగురాళ్ళ, గురిజాల, సత్తెనపల్లి, కార్యమపూడి ప్రాంతాలను పలనాడని పిలిచేవారు. ఈప్రాంతానికి బ్రహ్మనాయుడు ప్రముఖ వ్యక్తిగా ఉండే వాడు. ఈయన కుమారునిపేరు బాలచంద్రుడు.'

## పలనాటి యుద్ధం

పలనాటి మధ్యగా నాగులేరు ప్రవహిస్తూంది. ఇది కృష్ణా నదికి ఉపనది. ఈనది అంచునే కార్యమపూడి అనే గ్రామముంది. అక్కడ రాజ్యం కొరకు యుద్ధం జరిగింది. ఒకవైపున నాయకురాలు నాగమ్మ కత్తిపట్టింది. మరోవైపున బ్రహ్మనాయుడు ఆయుధం పట్టుకున్నాడు. ఈ కథంతా శ్రీనాధుడు మంజరీ ద్విపదలో వ్రాశాడు. చక్కగా వర్ణించాడు'.

'ఈయనకు నృత్యాలంటే ప్రేమ. అందుకే తన రచనలలో నృత్యాలను గూర్చి బాగా వ్రాశాడు. చక్కగా వర్ణించాడు. జక్కుల వారు ఆటలు ఎలా ఆడేవారో వ్రాశాడు. రాజుల ఆస్థానాలలో నర్తకి ఎలా నృత్యం చేస్తుందో వర్ణించాడు. ఈయన దేశాటనం బాగా చేశాడు కదా ! అందువల్ల, యీాయన రచనలలో అప్పటి నృత్యాలు

ఎలా వుండేవో మనకు తెలుస్తాయి. అప్పటి పద్ధతి యిప్పుడు మారిపోయింది. కాని మన నృత్యాలలో జక్కణి దరువు ఇప్పటికీ ఆటడం మీరు చూడవచ్చు.'

'మరోకవి పేరు వినుకొండ వల్లభరాయుడు. ఈయన క్రీడాభిరామం వ్రాశాడు.. ఈయన నృత్యాలను గూర్చి వర్ణించాడు. ఇలా ఎందరి పేర్లో చెప్పవచ్చు. ఎన్నో గ్రంథాల పేర్లను వినిపించవచ్చు.'

'ఒక్కరనేదేమిటి? కవులందరూ నృత్యాలు వర్ణించారు.'

## నృత్యం పవిత్రమైనది

'భారతంలో బృహన్నలగా అర్జునుడు నృత్యం చేశాడు. ఉత్తర నృత్యం నేర్చుకుంది. దేవలోకంలో అప్సరసలు నృత్యాలు చేసేవారు. భాగవతంలో పోతన మహాకవి నృత్యాలను వర్ణించాడు. గోపికల రాచక్రీడలు మరచిపోలేము. బాలకృష్ణుని నాట్యాలను వదలి పెట్టలేము. యిలాగే మన కావ్యాల నిండా నృత్య వర్ణనలున్నాయి. నృత్యాన్ని పవిత్రంగా భావించారు. నాట్యశాస్త్రాన్ని ఐదో వేదమన్నారు.



## కృష్ణ దేవరాయలు

'కృష్ణ దేవరాయలు హంపీ విజయ-నగరాన్ని పాలించాడు. ఈయన చాలా గొప్ప చక్రవర్తి. ఈయన దక్షిణాన చాలా దేశం జయించాడు. ఈయన తరపున తెలుగువారు అక్కడ పాలన చేశారు. వారిని నాయకరాజులని పిలిచారు.'

## హంపి

'కృష్ణదేవరాయల తరువాత అతని తమ్ముడు అచ్యుత రాయలు పాలించాడు. తరువాత ఐదు ముస్లిం రాజ్యాలతో యుద్ధం వచ్చింది. తాళికోట, రక్కసి తంగడి అనే చోట్ల యుద్ధం జరిగింది. విజయనగరం సైన్యాలు ఓడిపోయాయి. హంపీవిజయనగరం కొంత కాలం ముస్లిం పాలనలోకి వెళ్లింది. ఇందు వలన రాజధానిని పెనుగొండకు మార్చారు.'

'మరికొంత కాలానికి శత్రువుల వత్తిడి పెరిగింది. తిరుపతి ప్రక్కనే వున్న చంద్రగిరిని రాజధానిగా చేసుకున్నారు. అదీ పడిపోయింది.'

## నాయకరాజులు

'తమిళ దేశం నడిబొడ్డులో తంజావూరు ఉంది. నాయకరాజుల కిది కేంద్రంగా ఉండేది. రఘునాధ నాయకుడు మంచి కవి. కళాభిమాని, రసికుడు. ఈయన స్వయంగా యక్షగానాలు వ్రాశాడు. ఈయన కుమారుడు విజయరాఘవుడు. ఈయన కూడా కళాపోషకుడే, లలిత కళలంటేచాలా యిష్టం. వీరంతా తెలుగువారే.



శ్రీమతి వాసిరడ్డి కనకదుర్గ

హంపీ విజయనగరం పడిపోయిన తరువాత నృత్యాలకు పోషణ తరిగింది నృత్యాల ఆదరణ తగ్గిపోయింది. ఐన పెనుగొండలో కొంత మెరుగయింది. ఆ తరువాత చంద్రగిరిలో పోషణ జరిగింది. చివరకు తమిళ దేశంలోని తంజావూరు కేంద్రమయింది. ఇలా ఆంధ్రదేశాన్నుండి కొంత కాలం నృత్య కళ వలసపోయినట్లయింది.'

'విజయ రాఘవునితో తంజావూరు నాయకరాజ్యం ముగిసింది. తరువాత మహారాష్ట్ర పాలకులొచ్చారు. వారు తెలుగు భాషను అభిమానించారు. ఆంధ్ర భాషను గౌరవించారు.'

'శహాజీ మహారాజు (1683–1719) వీరిలో గొప్పవారు. ఈయన స్వయంగా యక్షగానాలు వ్రాశారు. ఒకటీ రెండు కాదు. ఇరవైరెండు వరకూ ఉన్నాయి. అన్నీ తెలుగులోనే ఉన్నాయి. దీనిని బట్టి యక్షగానాలకున్న గౌరవాన్ని అంచనా వేసుకోవచ్చు. తెలుగు భాషకున్న ఆదరణను గుర్తించ వచ్చు. ఎందరెందరో యీ భాషలోని తీయదనానికి మురిసిపోయారు. పరవసించి పోయారు. వదలలేక పోయారు. వారి శక్తి కొలది ప్రోత్సహించారు.'

'తెలంగాణా ప్రాంతంలో యక్షగానాలకు మంచి ఆదరణ ఉండేది. ఈ ప్రాంతంలో వందకు పైగా రచనలున్నాయి.'

'పూర్వం పల్లోరి వీరన్న అనే రచయిత ఉండే వాడు. ఈయన 'క్రోధాపురి రైతువిజయం' వ్రాశాడు. ఇది రైతులకు సంబంధించిన కధ. దుర్మార్గుడైన రాజు మీద రైతులు తిరుగుబాటు చేసినట్లు వ్రాశాడు. వీధినాటక రూపంలో ఉంది. ఈ రచన

కొత్త పద్ధతిగా ఉంది.'

'ఈనాడు యక్షగానాలను జక్కుల వారు ఆడటం లేదు. ఎప్పుడో మానివేశారు. ఇతరులు ఆడుతున్నారు. కూచిపూడి భాగవతులు ఒకప్పుడు అచ్చగా యక్షగానాలే ఆడేవారు. మనవారు సంగీతంతో కలిపి నృత్యాలను ప్రదర్శిస్తారు. వీటన్నిటిలో యక్షగాన లక్షణాలు కన్పిస్తాయి. యక్షగానాల ప్రభావం మనల్ని వదలిపెట్టలేదు. మన నృత్య కళాకారులపైన విశేషంగా వుంది.'

## కలాపాలు

'క్రమేణా కలాపాలు పెరిగాయి కలాపాలాడేవారు చాలా మంది ఉండేవారు కలాపాలలోని కథ అన్నిచోట్లా ఒకటిగానే ఉంటుంది.కృష్ణుడు, సత్యభామలకు సంబంధించి ఉంటుంది. ఇలా భగవంతుని కథలనాడేవారిని భాగవతులన్నారు. అబ్బాయిలూ! నేను కొంత మంది భాగవతుల పేర్లు చెపుతాను. శ్రద్ధగా వినండి'



శ్రీమతి శోభానాయుడు

## భాగవతులు

1. పాతకమూరి భాగవతులు
2. గడ్డిపాడు భాగవతులు
3. కోట కొండ భాగవతులు
4. మాల భాగవతులు
5 యానాది భాగవతులు
6. చెంచు భాగవతులు
7. గొల్ల భాగవతులు
8. నక్కల భాగవతులు
9. గంటె భాగవతులు
10. చేగంట భాగవతులు
11. వంజుల భాగవతులు
12 చిందు భాగవతులు
13 చిలుక భాగవతులు




14. మేలట్టూరు భాగవతులు

15. కూచిపూడి భాగవతులు

'ఇలా దండకం చదివినట్లు చెప్పవచ్చు. ఈ పేర్లను బట్టి మీరు అర్థం చేసుకోవచ్చు.'

'ఇలా ఒక దశలో యక్షగానాల మధ్య కలాపాలు పుట్టి పెరిగాయి. కలాపాలతో నృత్య నాటికలు పేరు తెచ్చుకున్నాయి వీటిని అంతా ఆరాధించారు. ఆదరించారు ఆనందపడ్డారు.'

ఈ రోజు గురూజీ పాఠం ముగించారు.

సాయంకాలం నది అంచునే బయలు దేరాము. ఏటి నీటిలో పడవ గాలికి కదులుతోంది. దాని మీద కూర్చున్నాము.

గురూజీ ఆలోచిస్తున్నారు. వారి కనులు సగం మూత పడినాయి. ఎవరో మహాయోగి మామధ్య కూర్చున్నట్లుంది. సాయంకాలపు కాంతులు అందంగా ఉన్నాయి. పైరు గాలికి రెల్లు కదులుతోంది వాటిపూలు ఊగుతున్నాయి. మా తలలపైగా నీటి పక్షులు ఎగిరి పోతున్నాయి. ఒకదాని వెంట మరొకటి అలలు పరుగులు తీస్తున్నాయి. లయ తప్పక కదలి పోతున్నాయి.



ఇంతటి ప్రశాంత సమయంలో గురూజీ 'క్షేత్రయ్య' అన్నారు. 'ఈరోజు మీకు క్షేత్రయ్యను గూర్చి చెపుతాను. రేపు మువ్వ తీసుకొని వెళ్లి వేణుగోపాల స్వామి ఆలయం చూపిస్తాను' అన్నారు.

అందరం మురిసి పోయాము.

## క్షేత్రయ్య

వారు నెమ్మదిగా ప్రారంభించారు. 'శ్రీకాకుళానికి ఈశాన్యంగా ఎనిమిది కిలో మీటర్ల దూరంలో మువ్వ గ్రామం ఉంది. ఆ గ్రామంలో వేణుగోపాలస్వామి వారి దేవాలయం ఉంది. క్షేత్రయ్య ఈ దేవుని ఆరాధిం చాడు. ఆయన నాలుగు వేల ఐదువందల పదాలను వ్రాశానని చెప్పుకున్నాడు. అన్నిటిలో **'మువ్వగోపాలా'** అనే ముద్ర ఉంచాడు. **ముద్ర, మకుటం** అనే పదాలున్నాయి. వాటిని అర్థం చేసుకోవటం మంచిది. అవసరం కూడాను.'

'కవులు అనేకం వ్రాస్తారు. వాగ్గేయకారులు పాటలు వ్రాస్తారు. పదాలు చెపుతారు. ఇవి విన్నా చదివినా, వీటిని ఎవరు వ్రాశారో చెప్పవచ్చు.'

'వ్రాసే వారు గుర్తుగా ఒక పదాన్ని ఎంచుకుంటారు. దాన్ని తాము వ్రాసిన దానిలో వాడుకుంటారు.'

### మకుటం

'మీరు వేమన శతకం చదివారు. **విశ్వదాభిరామ– వినురవేమ** అని చివర వస్తుంది. వెంటనే యిది వేమన పద్యం అని చెప్పవచ్చు. సుమతీ శతకం కూడా యింతే. క్షేత్రయ్య తన పదాలలో **'మువ్వగోపాలా'** అని వాడినాడు. ఇదే ముద్ర. ఇందువలన యీ పదం క్షేత్రయ్యదని చెప్పవచ్చును.'

### సంచారం

'క్షేత్రయ్య అనేక దేశాలు తిరిగాడు. దక్షిణానికి వెళ్లాడు. అనేకమంది రాజులను కల్సుకున్నాడు. పుణ్యక్షేత్రాలు చూశాడు. పదాలు చెప్పాడు. రాజులతో సన్మానాలు పొందాడు. పండితులతో మెప్పుపొందాడు.'

'తంజావూరును అచ్యుత విజయరాఘవుడు పాలిస్తున్నాడు. ఆయన దగ్గర వేయి పదాలు చెప్పాడు. వాటిని ఆ రాజుకు అంకిత మిచ్చాడు.'

'మధుర వెళ్ళాడు. తిరుమలేంద్రుని చూశాడు. ఆ దర్బారులో సన్మానాన్ని పొందాడు. రెండు వేల పదాలు అంకిత మిచ్చాడు. గోల్కొండ వెళ్లాడు. అబ్దుల్ కుతుబ్‌షాను సందర్శించాడు. ఆయనకు పదిహేను వందల పదాలు అంకితమిచ్చాడు. తాను వెళ్లిన చోటల్లా పదాలు చెప్పాడు. మువ్వగాపాలా అని పాడినాడు. ఇలా ఎన్నో చెప్పినా ఇప్పుడు కొద్దిగానే మిగిలినాయి.'

## శృంగారం

'క్షేత్రయ్య వ్రాసిన పదాలలో శృంగారం చాలా ఎక్కువగా ఉంటుంది. ఇందు వలన యిప్పటి వారు కొందరు ఈయనంటే యిష్టంగా ఉండరు. ఈ పదాలంటే అభిమానం చూపరు.'

'క్షేత్రయ్య పదాలలో శృంగార రసం అధికమని చెప్పాను గదా! ఇందులో **'రసం'** అనే మాట వాడినాను. రసం అంటే ఏమిటో మీరు వివరంగా తెలుసుకోవాలి.'

## నవ రసాలు



'మనలో అనేక భావాలు కలుగుతుంటాయి ఆ భావాలన్నీ ఒకేవిధంగా ఉండవు. మీరు చీకట్లో నడచి వెళ్లాలనుకుంటే పాము, తేలు బాధిస్తాయనే భయం కలుగుతుంది. కోతి చేష్టలు చూస్తే నవ్వొస్తుంది. తెలిసిన వారు చనిపోతే దుఃఖం వస్తుంది. ఇలా కలిగే భావాలను



తొమ్మిది రకాలుగా విడదీశారు. ఇవే నవ రసాలు. వీటిని 1.శృంగారం, 2.కోపం,3. శాంతం, 4.భయం 5.ధైర్యం 6.హాస్యం 7 . కరుణ 8.బీభత్సం 9.ఆశ్చర్యం అని పేరు పెట్టారు. మీకు అర్థం కావటానికి వీర రసాన్ని ధైర్యం అని చెప్పాను. రౌద్ర రసాన్ని కోపమని వాడినాను.'

## శృంగారం



'ఈ రసాన్ని మిగతా ఎనిమిది రసాలకు రాజు అని అంటారు. శృంగారమంటే ప్రేమ. ఆడవారికి మగవారికి వయస్సు వచ్చాక వారిలో కలిగే భావాలను ఇలా అని పిలిచారు. స్త్రీ పురుషుల మధ్య అకర్షణ

ఉంటుంది. దీన్ని శృంగారమని అన్నారు.




## కోపం

'పిల్లలు పెద్దల మాట వినరు. అపుడు పెద్దలు కోపగించుకుంటారు. నృత్య పాఠాలు సరిగా సాధన చేయకపోతే మీగురువు గారికి కోపం వస్తుంది వారి కళ్ళు ఎరుపవుతాయి శ్వాస గట్టిగా పీలుస్తారు. కనుబొమ్మలు ముడిపడతాయి.' ఇదే కోపం.'



## శాంతం

'కోపానికి వ్యతిరేకమయినది శాంతం. ఏమి జరిగినా కోపం తెచ్చుకోకుండా శాంతంగా ఉండేవారెవరన్నా ఉన్నారా? ఉన్నారు. బుద్ధుడు, జీసస్ వంటి శాంతమూర్తులు మానవ చరిత్రలో ఉన్నారు కదా!




## భయం

'భయాన్ని గూర్చి ఎక్కువగా చెప్ప నవసరం లేదు. బెత్తం చూస్తే భయం. గురువులు దండిస్తారు భయం కలగటం సహజం. పులిని చూసినా , పామును చూచినా భయంతో వణికి పోతారు. చెమటలు పడతాయి.'




## ధైర్యం

'భయానికి వ్యతిరేకమయినది. ధైర్యంగా యుద్ధానికి వెళ్లాడని చెపుతాము. తను చనిపోతానని తెలిసినా భయం లేదన్నమాట. కొంత మంది చిన్న బాధకే ఓర్చుకోలేరు. కాని కొందరు

ఎన్నికష్టాలొచ్చినా సహిస్తారు. కన్నీరు పెట్టుకోరు.

## హాస్యం

'నవ్వు కల్గించే దానికి ఉదాహరణ మీకు తెలిసిందే. నాటకాల్లో హాస్యగాని పాత్రను చూసి నవ్వుకుంటారు. రాజుల వద్ద విదూషకులు ఉండేవారు. వారి పని రాజులను నవ్వించటమే. తమ పనుల వలన, మాటల వలన అలా చేయగలరు.'




## కరుణ

'దీన్నే జాలి అని కూడా అంటారు. ఎదుటి వారి బాధలు చూచి కొందరు జాలిపడతారు. వారికి సాయం చేస్తారు. బుద్ధుణ్ణి కరుణామూర్తి అంటాము. దేవతలలో ఈశ్వరుణ్ణి జాలిగుండెల వాడని చెపుతాము.'

## బీభత్సం

'దీన్నే జుగుప్స అనవచ్చు చూడటం తోటే మనసు ఏవగించుకుంటుంది.'

## ఆశ్చర్యం

'విచిత్రమైన వస్తువులు చూసినపుడు ఆశ్చర్యం కలుగుతుంది. ఎత్తుగా ఉండే కొండ శిఖరాన్ని చూస్తే ఈ భావం వస్తుంది. నోరు తెరచుకుని చూస్తాము. కళ్లప్పగించి నిలబడి



పోతాము.'

'నేను చెప్పిన తొమ్మిది రసాలను ఇంకా వివరించవచ్చు. కాని అవియిప్పుడు అర్థంకావు. ఇందు వలన వివరాల జోలికి పోవటంలేదు.'

'ఈ నవరసాలను కవులు తమ రచనలలో చక్కగా వర్ణిస్తారు. నృత్యం చేసేవారు ఈ భావాలను చూపిస్తారు. ముఖంలో పలికిస్తారు. చక్కగా అభినయం చేస్తారు. తాండవం, లాస్యం, అని చెప్పాను గదా! లాస్యంలో యీ రసాలను బాగా చూపిస్తారు.


త్యాగయ్య

## అన్నమయ్య

'క్షేత్రయ్యకు ముందు అన్నమయ్య అనే భక్తుడుండేవాడు. ఈయన తిరుపతి వేంకటేశ్వరుని మీద పాటలు చెప్పాడు. ఈ పాటలను సంకీర్తనలంటారు. అన్నమయ్య, ఈయన కుమారుడు పెద తిరుమలాచార్య, మనుమడు చిన తిరుమాలాచార్య కలిసి . చాలా సంకీర్తనలు చేశారు. ఇప్పుడు అన్నమాచార్య కీర్తనలుగా మనవారు పాడుతున్నారు. నృత్యం చేస్తున్నారు. క్షేత్రయ్య తరువాత త్యాగయ్య కృతులు చెప్పాడు. ఈయన రామభక్తుడు. త్యాగరాజ కృతులు మీరు వింటూ ఉంటారు. కొందరు యీ పాటలకు నృత్యం చేస్తారు.'


మీరా

'మీకో విశేషం చెప్పాలి. అన్నమాచార్యతోనే ఈ విధమైన పాటలు ప్రారంభమయినాయి. అంతకు ముందు లేవని కాదు ఈయన జానపదులు పాడుకునే పాటలు విన్నాడు. వాటి బాణీలను

అర్థం చేసుకున్నాడు. ఈ శైలిలో పదాలు చెప్పాడు. ఈ వరుసలకు సాహిత్యం జతచేశాడని చెప్పవచ్చు. ఇలా జానపదాలకు కొంతవరకు శాస్త్రీయత చేకూర్చాడని అనవచ్చు.'

## త్యాగయ్య

'ఇది సామాన్య విషయం కాదు. దేశికవిత వీరి వలన మార్గకవితకు దగ్గరగా పెరిగింది. ఆ తరువాత వచ్చిన త్యాగరాజ స్వామి చేతిలో సంగీతంతో కలిసి బాగా అభివృద్ధి అయింది.'

'ఇలాగే అనేక మంది పద కవితలు చెప్పారు. కీర్తనలు వ్రాశారు. రామదాసు కీర్తనలు మీకు తెలుసు.'

'ఇంతే కాదు. మన దేశంలో అన్ని ప్రాంతాలలో ఇలాగే జరిగింది. భక్తితో పాటలు పాడే వారు. దేవుని కీర్తించేవారు. ఇవి కీర్తనలయినాయి.'

## మీరా

'రాజస్థాన్‌లో మిరాబాయి పాటలు పాడింది.'

'శ్రీకృష్ణ భక్తురాలు కావటం వలన కృష్ణుని మీదే చెప్పింది. ఇవి మీరా భజన కీర్తనలుగా ప్రచారం పొందాయి.'

## చైతన్య

'బెంగాల్‌ను గూర్చి చెప్పాను. చైతన్యప్రభు భక్తిని గూర్చి ప్రచారం చేశాడు. పాటలు పాడేవాడు. తనను తాను మరిచిపోయి కృష్ణుణ్ణి సేవించేవాడు. అస్సాంలో **శంకర్‌దేవు** ఆడిపాడే భక్తి మార్గం బోధించాడు.'


చైతన్య

## జ్ఞానేశ్వర్




'మహారాష్ట్రలో సంత్ జ్ఞానేశ్వ
**అభంగాలు** వ్రాశాడు. భక్తుడు **తుకారాం** కూడా
అభంగాలు వ్రాశాడు. వీరు పండరీపురంలోని
విఠల్ దేవుని భక్తులు.'

## పురందర

'కన్నడ దేశంలో పురందర దాసుండే
వాడు. ఆయన **పురందర విఠలా** అని పాడేవాడు.'

'ఇలా ఒక దశలో మన దేశంలో మార్పు
వచ్చింది. భక్తితో పాటలు పాడి దేముని
కొలిచేవారు. ఇది భారత దేశమంతటా వుంది.'

'తెలుగులో చాలా మంది పదాలు చెప్పారు. ఇవన్నీ మీరు పెద్ద వారైన తరువాత చదవండి.'

'అభినయాన్ని స్త్రీలు బాగా చేయగలరు. అభినయానికి పదాలు అనుకూలంగా ఉంటాయి. కొందరునర్తకీ మణులను గూర్చి చెపుతాను. వినండి.'

## నర్తకీ మణులు

'పూర్వం ముద్దు చంద్రలేఖ అనే నర్తకి వుండేది. ఆమెకు చాలా మంచి పేరుండేది. ముత్యాల పల్లకిలో రాజదర్బారుకు వెళ్లేది. పగటి దివిటీలు పట్టుకుని భటులు ముందు నడిచే వారు. ఆరోజుల్లో ఇది చాలా గౌరవమైన సంగతి.ముద్దు చంద్రలేఖ పేరిణి చేసేది. లాస్య కేళిక చేసేది. నృత్యంలో ఈమెకు చాల మంచి పేరుంది.'



'అభినయంలో చాలా మంది కృషి
చేశారు. కృష్ణాజి, శశిరేఖ, మదనరేఖ,
రూపవధూటి -యిలా చాలా పేర్లు
చెప్పవచ్చును. వీరంతా చాలా గొప్ప వారు.
సామర్థ్యం వున్నవారు. నాట్యకళను
ఆరాధించిన వారు.'

## నాట్యాలు



'ఆరోజుల్లో అనేక నాట్యాలుండేవి. ఎన్నో పదాలుండేవి. కొన్ని పేర్లు చెపుతాను వినండి **దురుపదాలు, నవపదాలు, చౌపదాలు,** ఇలా చాలా చెప్పవచ్చు. **దేశి, పేరిణి, గుజరాతి, పదకేళిక, కురవంజి.** ఇలా దండకం మాదిరి చదవ వచ్చు వివరాలు మీకు చెప్పినా వంట పట్టవు. ఇందు వలన చెప్పటం లేదు. ఈరోజు మనం క్షేత్రయ్యతో పాటు అనేకమంది పదకర్తలను గూర్చి చెప్పుకున్నాం. లేవండి యింటికి వెళ్దాం.' అన్నారు

అందరం బయలు దేరాము. కృష్ణా తీరంలో పుట్టిన క్షేత్రయ్య దేశ దేశాలు తిరిగి ఎన్నో పదాలు చెప్పాడు. కాని యిప్పుడు ఆపదాలన్నీ లేవు చాలా కొద్దిగా మిగిలినాయి. ఇది తలచుకుంటూ గురూజీ వెంట వెళ్లాను.

ఎండలు ముదురుతున్నాయి. బాగా ఉక్కగా ఉంది. వేడిగా ఉంది. బయటికి వెళ్లాలంటే భయంగాఉంది. ఈరోజు గురూజీని అడిగి కృష్ణలో స్నానం చేశాం. వారు దూరంగా కూర్చొని పుస్తకం చదువుకుంటున్నారు అందరం వెళ్లి వారి ముందు కూర్చున్నాము. వారు ప్రారంభించారు.



'పూర్వం దేవాలయాలలో పూజా నృత్యాలు చక్కగా జరిగేవి రాజుల కొలువులలో రాజనర్తకీ మణులు అందంగా ఆడేవారు. కాని, ఇద్దరకీ ఒక తేడా ఉంది. ఇది చాలా ముఖ్యమైనది.'

'ఒకో దేవునికి ఒకో తాళం

యిష్టం. ఒకో రాగం యిష్టం. ఇందువల్ల ఆదేముని ముందు అలాగే ఆడాలి. సందర్భానుసారంగా మార్చుకోటానికి వీల్లేదు.'

'ఎప్పుడెప్పుడు ఏది చేయాలో నిర్ణయించ బడి ఉంటుంది. దేవుళ్లకు ఎలా పూజలు చేయాలి? దేవాలయాలు ఎలా నిర్మించాలి? ఏ మంత్రాలు చదవాలి? ఇవన్నీ పెద్దలు చెపుతారు. వీటిని గూర్చి గ్రంథాలున్నాయి. వాటి ప్రకారం చేయాలి.'

'కాని, రాజుల ముందు ఆట ఇలా ఉండదు. వారికేది ఇష్టమో అదే ఆడతారు. ఇతర విషయాలు నేర్చుకుంటారు. క్రొత్త విషయాలు కూర్చుకుంటారు. అవి ఆడి రాజులను మెప్పిస్తారు.'

'ఈరెండు విధానాలకున్న తేడాను మీరు తరువాత పరిశీలించండి.'

## రాజు—దేముడు

'రాజులు కోటల్లో ఉండేవారు. వారి దేవుళ్లు, దేవతలు దేవాలయాలల్లో ఉంటారు. రాజులకు రాజనర్తకి ఉంటుంది. దేవతలకు గుడిచేడియ, ఉంటుంది. దేవదాసి అని యిప్పుడు అంటున్నాము. ఇలా తాము అనుభవించే ప్రతిదీ కూడా రాజులు దేమునికి ఏర్పాటు చేశారు.'



శ్రీమతి జంపాముత్యం

'ఆరోజులు పోయాయి. రాజులు, చక్రవర్తులు పోయారు. బ్రిటిష్ పాలకుల చేతిలో భారత దేశం కొంత కాలంఉంది. జమీందారులొచ్చారు. వీరు బ్రిటిష్ వారికి కప్పాలు వసూలు చేసి పెట్టేవారు. కొంత భాగాన్ని తీసుకుని, శిస్తులు వసూలు చేసేవారు. ఇదో కాంట్రాక్టు. వీరిలో కొందరు కళాకారులను పోషించేవారు.'

'మనకు స్వాతంత్ర్యం వచ్చింది. అప్పటికి దేవదాసీ పద్ధతిలో మార్పు వచ్చింది.'

'దేవ దాసీలకు పూర్వకాలం ఉన్న పేరు ప్రతిష్టలు పోయాయి. వారి జీవితాలు విలువలేకుండా తయారైనాయి. అప్పుడో ఉద్యమం వచ్చింది. ప్రభుత్వం వారు యీ పద్ధతిని 1947 లో నిషేధించారు. రద్దు పరచారు. వారంతా దేవాలయాలు వదలి వేశారు. ఈ నృత్యానికి అంతిమ దశ వచ్చిందనిపించింది.'



'దేవదాసీ వ్యవస్థ మంచిది కాదు. ఇప్పటి కాలానికి అది పనికిరాదు. కాని వందల సంవత్సరాల నుండి వారు నృత్యాలు చేశారు. ఈ కళను ఆరాధించారు. తమ ఊపిరిలో ఊపిరిగా భావించారు. అది ఆగిపోయింది. అందమైన నాట్యకళకు చివరి క్షణాలు వచ్చాయని అనిపించింది.'

'ఆనాడు ఈ కళను గూర్చి చాలా మంది ఆలోచించలేదు. పట్టించుకోలేదు. జరగుతున్న ప్రమాదాన్ని గుర్తించలేదు.'

## కళమంచిదే

'ఈ కళను ఎలా నిలపాలి? పార్వతీ పరమేశ్వరుల రూపమని చెపుతాము గదా! నాట్య శాస్త్రాన్ని పంచమ వేదమన్నాము గదా! నృత్యం చేయడమంటే యజ్ఞంతో సమానమన్నాము కదా! మరి యీకళ నీచమైందని అనటం దేనికి? పనికిరాదనటం దేనికి?'

'ఈప్రశ్నలు బయలు దేరాయి. వీటికి సమాధానం లభించింది. యీ కళను ప్రోత్సహించాలనుకున్నారు. చాలా కొద్ది మంది ముందు కొచ్చారు.'

## కృష్ణయ్యరు

'కృష్ణయ్యరు అనే న్యాయవాది ఉండేవారు. వారు స్వయంగా నృత్యం నేర్చుకున్నారు. దేవదాసీల వద్ద అభ్యసించారు. వారు నృత్యం చేసి చూపించారు. ఇది చాలా గొప్పకళ అని ప్రచారం చేశారు. దాన్ని చాల మంది సహించలేకపోయారు. వీరంతా కక్ష కట్టారు. కృష్ణయ్యరు నృత్యం చేసే చోటుకు వెళ్లారు. ఆయన్ని నోటికొచ్చినట్లు తిట్టారు. మెడలో చెప్పుల దండ వేశారు. అవమానించారు. కాని కృష్ణయ్యర్ పట్టుదలతో ప్రచారం చేశాడు.'

'సంఘంలో మార్పు వచ్చింది. ఒకరి తరువాత ఒకరు నృత్యం నేర్చుకోటానికి ముందు కొచ్చారు.'

'భరత నాట్యమంటే ఏమిటి? అనే ప్రశ్న వస్తుంది. భరతముని చెప్పింది నాట్యాన్ని గూర్చి మాత్రమే. అనగా ఇది ఒక విధంగా నృత్యనాటిక అని చెప్పవచ్చు. కాని మనం భరతనాట్యం అనే మాటను మరో విధంగా వాడుతున్నాము.'

'నందికేశ్వరుడు ఒకవ్యక్తి ఆడే విధానాన్ని వివరించాడు. ఈ రోజుల్లో మనం ఈ విధానాన్నే పాటిస్తున్నాము. దీన్నే భరతనాట్యం అని పిలుస్తున్నాము.'

## నలుగురు సోదరులు—శరభోజి

'పూర్వం తంజావూరును శరభోజి మహారాజు పాలించేవాడు.(1788-1821) ఈయన ఆస్థానంలో నలుగురు సోదరలుండేవారు. వీరిని పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు, శివానందం అని పిలిచే వారు. అప్పటి వరకున్ననాట్యాలను వారు పరిశోధించారు. వాటిని ఒక పద్ధతిలో ఆడించారు. ఒక కట్టుబాటుగా అవి ప్రచారమైనాయి. వారు ముందుగా అలరింపు చేయించేవారు. తరువాత జతిస్వరం ఆడించేవారు. అప్పుడు శబ్దము, వర్ణము, పదము, తిల్లానా చేయించేవారు. ఇప్పుడు భరతనాట్యం అని పిలువబడే విధానం యిదే.'

'పూర్వం దీన్నే సదిర్ నాట్యమనే వారు. తంజావూరు నాట్యమనీ పిలిచేవారు చిన్నమేళం అనేవారు. ప్రసుత్తం భరత నాట్యం అనే పేరు పాతుక పోయింది. అందరూ ఈ పేరుతోనే పిలుస్తున్నారు.'



***Rukmini Devi***

## లాస్యం తరిగింది

'శరభోజి మహారాజు మాదిరిగానే బొబ్బిలి, విజయనగరం సంస్థానాలలో యీకళ బాగా పెరిగింది. ఇప్పటికీ యీ నృత్యం కొంతవరకు అక్కడ వృద్ధ కళాకారులవద్ద నిలిచిఉంది. గోదావరిమండలం లాస్యానికి చాలా పేరు పొందింది. నృత్యంలో లాస్యం చాలా గొప్పది. చెట్టుకు పూవు వంటిది. పూవుకు సువాసన వంటిది. ఈ లాస్యం కూడా తరిగిపోయింది. ఇప్పుడు ఆకళను వివరించే పాత కాలపువారు, దాదాపు లేరు.'

## రుక్మిణీ అరండేల్

'మీరు రుక్మిణీ అరండేల్ అనే పేరు వినే ఉంటారు. ఈమె 1926లో 'అన్నా

పావలోనా' అనే ఆమెను కలిశారు. పావలోనా రష్యా దేశస్తురాలు. బాలే నర్తకి. ఈ విద్యను తనకు చెప్పమని రుక్మిణి అడిగింది. పావలోనా ఒక సలహా చెప్పింది. భారత దేశంలో మంచి నృత్య విద్య ఉంది. అదినేర్చుకోమని అన్నది.'

'రుక్మిణీ దేవిదేవదాసీల వద్ద ఈ విద్య నేర్చుకుంది. అనేక మంది కళాకారులతో మాట్లాడింది. వారి అభిప్రాయాలను తెలుసుకుంది. పరిశోధన చేసింది. ప్రదర్శన లిచ్చింది. ఈ విద్యకు మంచి గౌరవం కలిగించాలనుకుంది. బాగా కృషి చేసింది.'

'ఇలా కృష్ణయ్యరు, రుక్మిణీ అరండేల్ తమ శక్తి కొలది ప్రచారం చేశారు. అప్పుడే యీ విద్యకు భరతనాట్యమని పేరు వచ్చింది. క్రమేణా అందరూ భరత నాట్యమని పిలువసాగారు.'

'ఈ సమయంలో రుక్మిణీ అరండేల్ అన్నమాటలు గుర్తుంచుకోవాలి. **"నృత్యం అమూల్యమైంది, పవిత్రమైంది. ఈ కళను ఆరాధించడం తప్పుకాదు. ప్రజల్లో ఈ కళమీద చెడ్డ అభిప్రాయాలున్నాయి. వీటిని తొలగించాలి. గౌరవం చేకూర్చాలి."** ఇలా అని ఆమె నలుగురికీ చెప్పింది. గౌరవం కలిగించటానికి కృషి చేసింది. దీన్ని సాధించింది.'

'భరతనాట్యం అనే పేరుతో ఈ కళ అభివృద్ధి చెందింది. మంచి ప్రచారం లభించింది. ఇప్పుడు అందరూ గౌరవంగా చూస్తున్నారు. తమ పిల్లలకు యీ విద్య చెప్పిస్తున్నారు. ఆడపిల్లలు, మగపిల్లలు అనే తేడా లేకుండా అంతా నేర్చుకుంటున్నారు. ఇలా ఎంతో మంచి జరిగింది.'

'రేపు మన నృత్యాలను గూర్చి మరికొంత వివరిస్తాను. చీకటి పడుతోంది. లేవండి' అన్నారు. అంతా యింటి ముఖం పట్టాము.

మేముండే పాకవూరందరూ పందిరి వేశారు. దాని క్రింద కూర్చున్నాము. గురూజీ ఆంధ్ర దేశంలో వున్న కొన్ని నృత్యాలను



గూర్చి చెపుతున్నారు. వారు నెమ్మదిగా ప్రారంభించారు.

## వీరనాట్యం

'వీరనాట్యాలని పేరు వినే వుంటారు. ఇవి మన జానపద నృత్యాలు. వీటిలో వీర రసం ఎక్కువగా వుంటుంది. వీరభక్తిని ప్రదర్శిస్తారు. ముఖ్యంగా శివుని పూజించే వారు యిలాంటి నృత్యాలు చేస్తారు.'

'ద్రాక్షారామంలో భీమేశ్వరాలయం వుంది. ఇది తూర్పుగోదావరి జిల్లాలో వుంది. ఇక్కడ వీరనాట్యం చేసేవారున్నారు. వీర నాట్యానికి వెనుక ఒక కథ వుంది. మీకు సతీదేవి కథ తెలుసు. ఆమె దక్షయజ్ఞానికి వెళ్లి అవమాన పడింది. చనిపోయింది. ఆసమయంలో వీరభద్రుడు బయలు దేరాడు. వెంట ప్రమధ గణాలు వెళ్లాయి. వీరంతా యజ్ఞం చెడగొట్టారు. ధ్వంసం చేశారు. యీసన్నివేశాన్ని వర్ణిస్తారు. పాటగా పాడతారు. వీరనాట్యం చేస్తారు.'

గోదావరి మండ లంలో దేవాంగులున్నారు. వీరంతా శివ భక్తులు .వీరిలో కొందరు నృత్యం చేస్తారు. ఈ సాంప్రదాయం తాండవానికి చెం దింది. రౌద్రంగా వుంటుంది. 'శరభ' 'అశ్శరభ' అంటూ ఆడతారు.శివుని పొగుడు తారు. లయ తప్పకుండా అడుగులు వేస్తారు. వీరభద్రుని వర్ణిస్తారు వీరంగం వేస్తారు. నోటిలో నారశూలలు వుంచుకుంటారు. పొడుగ్గా వుండే వీటికి నూనెగుడ్డలు చుడతారు. వాటిని వెలిగిస్తారు. 'శరభ' అంటే ఏమిటో తెలుసా? వినండి.

## శరభ



' పూర్వం హిరణ్యకశివుడనే రాజుండేవాడు. ఈయన శివభక్తుడు. ఈయన కుమారుడు ప్రహ్లాదుడు. ఇతను విష్ణుభక్తుడు. కొడుకు అంటే తండ్రికి చాలా ప్రేమ. ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. ఆ భక్తి మాన్పించడానికి తండ్రి చాలా ప్రయత్నం చేశాడు. ప్రహ్లాదుడు మానలేదు. తండ్రి విసిగి పోయాడు. చాలా బాధలు పెట్టాడు. విష్ణుమూర్తి నరసింహావతారంతో వచ్చాడు. హిరణ్య కశిపుని సంహరించాడు. ప్రహ్లాదుని కాపాడినాడు. మీరు

దశావతారాలలో ఈ కథ చదివేవుంటారు.'

'ఇందుకు శివునికి కోపం వచ్చింది. హిరణ్య కశిపుడు శివభక్తుడు కదా ! శివుడు 'శరభ'ను సృష్టించాడు. దాన్ని నరసింహుని మీదకు పంపించాడు. ఇది శైవులు చెప్పేకథ.'

'నరసింహుడే భయంకరంగా వుంటాడు. అతన్ని గజగజలాడించే శరభం ఇంకా భయంకరంగా వుండాలి కదా ! అందుకే ఆవేశంగా శరభాన్ని తలుస్తారు. శరభ, **అశ్శరభ** అంటూ నాట్యం చేస్తారు.'

## మతకక్షలు

'అబ్బాయిలూ! ఒకనాడు ఆంధ్రదేశంలో బౌద్ధులను, జైనులను దారుణంగా హింసించారు. శైవులు, వైష్ణవులు కత్తులు దూశారు. ఆంధ్రదేశం యీ ఘర్షణల వలన చాలా నష్టపోయింది. ఇందుకు ఉదాహరణగా పలనాటి యుద్ధాన్ని చెప్పవచ్చును.'

## చాపకూడు

'బ్రహ్మనాయుడు విష్ణు భక్తుడు. నాగమ్మ శివభక్తురాలు. అధికారం కొరకు తగాదా వచ్చింది. చివరకు యుద్ధం చేయవలసి వచ్చింది. రెండు మతాలూ రెండు వైపులా నిలిచాయి. కత్తులతో నరుక్కున్నారు. ఎందరో చనిపోయారు. బ్రహ్మనాయుని సైన్యాధిపతి **మాలకన్నమదాసు**. అంటరాని తనాన్ని పోగొట్టాలని బ్రహ్మన్న ప్రయత్నించాడు. చాప వేసి అందరినీ కూర్చో బెట్టాడు. అందరికీ భోజనం వడ్డించాడు. అంతా కలిసి భోజనం చేశారు. ఇదే **చాపకూడు**. దీన్ని యీపేరుతో పిలుస్తారు.'



'ఇలా రాజకీయాలతో మతం ముడిపడింది. అందుకే మన మహాకవి గురజాడ ఏమన్నాడో తెలుసా!

మతం వేరైతేను ఏమోయ్
మనుషులంతా ఒక్కటోయ్.

'ఇప్పటికీ పల్నాటి యుద్ధాన్ని మనవారు మరిచిపోలేదు. కార్యమపూడి వద్ద యీ యుద్ధం జరిగింది. కార్యమపూడిలో వీరుల గుడులున్నాయి. ఆనాడు వాడిన ఆయుధాలున్నాయి. అక్కడ వీరులను కొలుస్తారు. ఆ యుద్ధంలో జరిగిన ఘటనలను కథలుగా చెపుతారు. వీరనాట్యాలు చేస్తారు. ఆయుధాలు పట్టుకుని

వీరుల వేషాలు వేసుకుని వూరేగుతారు. వీర కొలుపులు కొలుస్తారు.'

## గ్రామ దేవతలు



'మన గ్రామాలలో గ్రామదేవత లుంటారు ఈ దేవతలు వంద మంది. వీరి పేర్లు కొన్ని చెపుతాను. **అంకాలమ్మ, పోలేరమ్మ, గంగానమ్మ, ఆరేటమ్మ** అంటూ చాలా పేర్లున్నాయి. వీరి తమ్ముడు **పోతురాజు.** ఈ వంద మంది అక్కచెల్లెళ్ళు గ్రామాలను కాపాడుతుంటారు. ఒకో ఊరుకు ఒకరూ, యిద్దరూ వుంటారు. కొన్ని చోట్ల యింకా ఎక్కువగా వుండొచ్చు.'

'గ్రామదేవతలకు జాతర్లు చేస్తారు. కొలుపులు కొలుస్తారు. ఆసమయంలో కొన్ని నృత్యాలు చేస్తారు.'

'ఈ దేవతల కొలుపులు ఎప్పుడు ప్రారంభమయినాయో తెలియదు. తెలుగు నేలపై గ్రామాలు నిర్మించారు గదా! గ్రామాలతో పాటు గ్రామ దేవతలూ మొదలైనారు.'

## మాతృస్వామ్యం

'చాలా వందల సంవత్సరాల క్రితం మన సమాజం యిలా వుండేది కాదు. అప్పుడు మాతృస్వామ్యం వుండేది. మాతృస్వామ్యానికి వ్యతిరేకమయిన మాట **పితృస్వామ్యం.** అనగా తండ్రి పెత్తనం. ఇలాగే మాతృస్వామ్యంలో తల్లి పెత్తనం. మీరు యింతవరకే తెలుసుకోండి. తరువాత యీ స్వామ్యాలను గూర్చి వివరంగా అర్థం చేసుకుందరుగాని.'

'గ్రామ దేవతలంతా ఆడవారు.'

'గ్రామ దేవతలకు ప్రత్యేక పూజలుంటాయి. కల్లు వారపోస్తారు. వేపమండలతో అలంకరిస్తారు. జంతువులను బలియిస్తారు. యీ పని పూర్వముండేది. ఇప్పుడు మానేశారు. యీ దేవతలకు పూజారులుంటారు. **వీరంతా వెనుకబడిన కులాల వారే** కావటం ఒక ప్రత్యేకత.'

## కొలుపులు, గరగలు

'గ్రామదేవతలను కొలుస్తూ నృత్యం చేస్తారు. వీరిని గరగలు అంటారు.



తలపైన కలశాలు పెట్టుకుంటారు. వేప మండలు చేత్తో పట్టుకుంటారు. ప్రక్కన డప్పు వాయిద్యం వుంటుంది. పూలూ బుక్కాయి చల్లుతారు. తాళం తప్పకుండ నృత్తం చేస్తారు. గరగ నృత్యం పూర్తిగా జానపద నృత్యం.'

'మనం బొబ్బిలి, విజయనగరం ప్రాంతానికి వెళదాము. ఈ ప్రదేశమంతా శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల క్రిందకు వస్తుంది.'

## తప్పెటగుళ్లు

'ఇక్కడ తప్పెట గుళ్లు అనే జానపద నృత్యం వుంది.'

'మీకు శ్రీ కృష్ణుని చరిత్ర తెలుసుగదా! కృష్ణుడు యదు వంశంలో జన్మించాడు. ఈయన తల్లి దండ్రులు దేవకీ వసుదేవులు. మేనమామ కంసుడు. కంసుడు చాలా దుర్మార్గుడు. శ్రీకృష్ణుడు చిన్నతనంలో నందుని యింట్లో పెరిగాడు. యశోద నందుని భార్య. బాలకృష్ణుని లీలలు తెలియని వారుండరు. యదు వంశం వారిని యాదవులని పిలుస్తారు.'

'తప్పెట గుళ్ల నృత్యంలో శ్రీకృష్ణ లీలలే చెపుతారు. మెడలో తప్పెటగుళ్లు కట్టుకుంటారు. వీటిని రొమ్ము మీద కదల కుండా బిగిస్తారు. తప్పెట గుళ్లను రేకులతో చేస్తారు. రెండు చేతులతో వాయిస్తారు. పాటలు పాడతారు. పొట్టిలాగులు కట్టకుంటారు. కాళ్లకు గజ్జెలు వుంటాయి. రంగు రంగుల బనీలు వేసుకుంటారు. ఆనందంగా అడుగులు వేస్తారు. గెంతుతారు. వారి పాటల్లో ఎక్కువ భాగం కృష్ణుని

మీదే వుంటాయి. వెన్న దొంగగా నటిస్తారు. కాళీయుని పైన ఆడినట్లు చేస్తారు. ఇలా ఎన్నోరకాలు చేసి చూపుతారు.'

'వీరి ఆట చాలా ముచ్చటగా వుంటుంది. అందంగా వుంటుంది.

**పారిజాతం**

'తూర్పు గోదావరి జిల్లాలో పిఠాపురం వుంది. ఇది చాలా పురాతనమైన ఊరు. ఇక్కడ కుంతి మాధవ దేవాలయం ఉంది. ఈ గుడిలో నృత్య పూజ జరిగేది. దేవదాసీలు నృత్యం చేసేవారు. ఈ ప్రాంతంలో పారిజాతం ఆడేవారు. సత్య భామ

నవ సత్యభామలు



శ్రీకృష్ణుల ప్రేమను గూర్చి నృత్యం చేస్తారు. వారిద్దరి మధ్యా కోపతాపాలను అభినయిస్తారు.'

కుంతిమాధవుని దేవాలయం అతి పురాతనమయింది. ఇచ్చట పెండేల వారు కలాపాన్ని ప్రత్యేకంగా ఆడేవారు. ఈ సాంప్రదాయ నృత్యకళలో చివరి నర్తకీమణి పెండేల సత్యభామ. నృత్యాభినయాల్లో సత్యభామ చాలా విద్వత్తుగలది. ఈమె తొమ్మిది రోజులు పారిజాతాన్ని ప్రదర్శించి, పదవనాడు దశమస్కంధ పారాయణం చేసేది. ఈమె తరువాత ఈ విద్యను అభ్యసించేవారు లేకపోయారు.

ఈ సంధి దశలో శ్రీ నటరాజ రామకృష్ణ ఈమె వద్దకు వెళ్లారు. సత్యభామ తనవద్ద వున్న విద్యను పూర్తిగా నటరాజరామకృష్ణకు బోధించింది.

శ్రీ నటరాజ రామకృష్ణ తాను నేర్చిన విద్యకు, 'నవజనార్దన పారిజాతం' అనే

పేరు పెట్టారు. తన శిష్యులకు బోధిస్తున్నారు. లాస్యసాంప్రదాయరీతితో పెరిగిన యీ కలాపవిద్య పూర్తిగా స్త్రీలే చేసేవారు. ఇందువలన యీ కలాపంలో లాలిత్యం అధికంగా వుంటుంది. సుకుమారంగా వుంటుంది.

ప్రస్తుతం తొమ్మిది రోజుల కలాపాన్ని, మూడురోజుల కలాపంగా ఆడుతున్నారు.

## నక్కభాగవతం

ఇలాకృష్ణ సత్యలను గూర్చి ఆడే ఆటలను కలాపాలంటారు.

'మరో విధంగా యీ కలాపాన్ని చేస్తారు. వీరిని తూరుపు భాగవతులని పిలుస్తారు. ఇందులో పాటకు ప్రాధాన్యత వుంటుంది. సత్యభామ వేషం వేసే వారు పాట పాడాలి.'

'ఆపాటను వంతలు అందుకుంటారు. రాగాలు తీస్తారు. ఇలా లాగిపాడటం ఎక్కువగా ఉంటుంది. సాగతీయటం అధికంగా ఉంటుంది. చుట్టూ వున్న గ్రామాలకు కూడా ఈ రాగం వినపడుతుంది. అందుకే నక్కభాగోతం అని ముద్దుగా అంటారు.'



## డప్పులు

'గుంటూరు జిల్లాలో నర్సరావుపేట ఉంది. ఈ ప్రాంతంలో డప్పుల నృత్యాలున్నాయి. హరిజనులు టముకు వాయిస్తారు. అడుగు వేస్తూ నృత్యం చేస్తారు. ఈ ఆట అందంగా వుంటుంది. చక్కగా పాడతారు. తాళం తప్పరు. లయ చెడదు. వీరి ఆటలో మంచి ఆకర్షణ వుంది. ఈరకమైన డప్పు నృత్యాలు ఆంధ్రలో అన్ని ప్రాంతాల్లో వున్నాయి. కాని యీ ప్రాంతంలో బాగా అభివృద్ధి చెందాయి.'

## కావడి నృత్యం

'పెన్నానది ప్రక్కనే రంగనాథ స్వామి దేవాలయం వుంది. ఇది నెల్లూరులో వుంది. నెల్లూరును సింహపురి అని పిలిచేవారు. ఎందరో కవులు పెన్నానది ప్రక్కనే జన్మించారు. వీరందరిలో గొప్పవాడు తిక్కన సోమయాజి.'

'రంగనాధ స్వామి దేవాలయంలో అర్చనానృత్యాలుండేవి. కుమార స్వామిని కొలుస్తూ కావడి నృత్యం చేస్తారు. నెమలి కుంచెలు పట్టుకుంటారు. డోలు వాయిస్తుండగా ఆడతారు.'

## కాళహస్తి

'స్వర్ణముఖినది ప్రక్కన కాళహస్తి వుంది. ఇక్కడ శివాలయం చాలా ప్రసిద్ధి కెక్కింది. ధూర్జటి అనే మహాకవి **శ్రీ కాళహస్తీశ్వర మహాత్యం** అనే పుస్తకం వ్రాశారు. ఇందులో శ్రీకాళహస్తి అనే పేరెందు కొచ్చిందో వివరించారు. సాలెపురుగు, పాము, ఏనుగు శివుని పూజించేవి. తిప్పడనే ఆటవికుడూ పూజించేవాడు. ఈ వివరాలన్నీ ధూర్జటి అందంగా పద్యాల్లో చెప్పాడు.'

'కాళహస్తీశ్వరుని దేవాలయంలో నృత్యాలు జరిగేవి. ఆగమశాస్త్ర ప్రకారం



పేరిణి విన్యాసం

చేసేవారు. దేవాలయాలలో నృత్యాలను ప్రభుత్వం వారు నిషేధించారు. ఇందు వలన ఏదేవాలయాన్ని గూర్చి చెప్పినా పూర్వ విషయాలనే వివరిస్తున్నాను. మన నృత్యాలలో ఇదోపరిణామము.'

## తిరుపతి

'చిత్తూరు జిల్లాలోని తిరుపతిని గూర్చి తెలియని వారుండరు. వేంకటేశ్వర స్వామి శేషశైలం మీద వున్నాడు. ఏడు కొండలు ఎక్కివెళితేగాని వారి దర్శనం కాదు. ఈ దేవునికి ఎందరో రాజులు కానుకలిచ్చారు. ముస్లింలు కూడా భక్తిని చూపుకున్నారు. నర్తకీ మణులను కూడా యిచ్చేవారు. అంగరంగ వైభోగాలు జరిపేవారు. దేవుని ముందు నృత్యాలు చేయించేవారు.'

## నట్టువలు



'ఆప్రాంతంలో కాళహస్తి సంస్థాన వుండేది. వెంకటగిరి, కార్వేట సంస్థానాలుండేవి. వారి దగ్గర మం కళాకారులుండే వారు. చక్కగా ఆడగలిగ నర్తకీ మణులుండేవారు. వీరిని నట్టువరాండ్ర కూడా పిలుస్తారు. వీరందరికీ మంచి ఆదర ఉండేది. బాగా పోషణ జరిగేది.'

'ఆంధ్ర దేశంలో వచ్చిన అనే రాజరికాలు యిప్పుడు లేవు. రాజుల పోయారు. రారాజులు పోయారు. జమిందా పద్ధతి రద్దయింది. వీటితో పాటు నాట్యాని పోషణ పోయింది. లలిత కళలకు ఆధా లేకపోయింది. ఆదశ మారింద ప్రజాస్వామ్యంలోకి వచ్చేశాము. ఇప్పుడు ప్రజలూ, ప్రభుత్వాలూ కళలను పోషిస్తున్నారు.'

## రత్నాల సీమ

'రాయలసీమను రత్నాల సీమ అనేవారు. అడవులతో నిండి వుండేది. తోటలతో కళకళలాడేది. పెద్దపెద్ద చెరువులుండేవి. ఆ నీటితో వ్యవసాయం

చేసేవారు. వర్షాలు సకాలంలో వచ్చేవి. ఇప్పుడు అడవులు నరికి వేశారు. అప్పటి వానలు యిప్పుడు లేవు. పంటలు లేవు. ప్రజలు పేదరికంతో బాధపడుతున్నారు. ఆరోజుల్లో లలిత కళలకు ఈ ప్రాంతం మంచి నిలయంగా వుండేది శిల్పాలకు ప్రసిద్ధి గాంచింది. దేవాలయాలకు నిలయమయింది. ప్రకృతిలోని మార్పు వలన మానవుని జీవితంలో మార్పు వస్తుంది. దీని వలన లలిత కళలను పోషించటంలో మార్పు వస్తుంది. పోషణ లేక పోతే ఏకళా బ్రతకలేదు. నేడీ ప్రాంతం క్షామంతో బాధపడుతోంది.'

'అనంతపురం జిల్లా లోని లేపాక్షి దేవాలయం చాలా బాగుంటుంది. లేపాక్షి నంది చాలా పెద్దది. అందమయినది. మనకు అడవి బాపిరాజుగారనే రచయిత వుండేవారు. వారు లేపాక్షి వెళ్లారు. నందిని చూశారు. ఆనందంతో పాటపాడారు.'

**లేపాక్షి బసవయ్యా లేచిరావయ్యా!**
**కైలాస శిఖరిలా కదలిరావయ్యా!**

'లేపాక్షిలో పరమేశ్వరునికి పార్వతీ దేవికి జరిగిన వివాహాన్నిచెక్కారు. అక్కడ అప్సరసలను మలిచారు. చాలా గొప్పగా శిల్పాలను తయారు చేశారు. వారు నృత్యం చేస్తున్నట్లు తయారు చేశారు. ఈ దృశ్యం చాలా గొప్పగా ఉంటుంది.'

'ఇలా నృత్యాన్ని రాతిలో చెక్కడం మనకు అలవాటే. కాని, ఇంత అందంగా చెక్కటానికి ఎంతో సామర్థ్యం కావాలి. ఎంతో పోషణ కావాలి.'

## గురవయ్యలు

'రాయల సీమలో జానపద కళలున్నాయి. అనంతపురం ప్రాంతంలో కురవలున్నారు. వీరు యాదవులు. ఎప్పుడూ గొంగడి వెంట వుంచుకుంటారు. ఇందువలన వారికా పేరు వచ్చింది.'

'వీరు గొంగడితో చేసిన దుస్తులు వేసుకుని నృత్యంచేస్తారు. ఎలుగు బంటి చర్మంతోటోపీలు తయారు చేస్తారు. వాటిని పెట్టుకుంటారు. ఒక చేత్తో పొడవైన వేణువును పట్టుకుంటారు. రెండో చేత్తో డమరుక వాయిస్తారు. శ్రీశైల మల్లి కార్జున స్వామి మీద పాటలు పాడుతారు. వీరికి గురవయ్యలనే మరో పేరువుంది. వేణు నాదంతో డమరుకశబ్దాన్ని జతపరుస్తారు. లయ తప్పకుండా అడుగులు వేస్తారు. చక్కగా ఆడతారు.'

'మనకు ఉత్తరాన హిమాలయాలున్నాయి. అక్కడ పశువులను కాసేవారున్నారు. గొర్రెలను మేపుతూ వాటి వెంట వెళ్లే వారున్నారు. వారికి చేతిలో వేణువు

వుంటుంది. కొన్ని జాతుల వారు డమరుక కూడా వాయిస్తారు. వారికీ, గురవయ్యలకు ఎన్నో పోలికలు కనిపిస్తాయి.



ఉరుము

## ఉరుములు

'ఈ ప్రాంతంలోనే ఉరుము వాయించే వారున్నారు. ఉరుము అనేది చర్మంతో చేసిన వాయిద్యం. ఈ వాయిద్యం ప్రయోగిస్తే ఉరుము ఉరిమి నట్టుంటుంది అందుకే ఈ పేరు వచ్చింది.'

'ఈవాయిద్యము చాలా సంవత్సరాల నుండి ఆంధ్ర దేశంలో వుంది. కాకతీయుల రోజుల్లో కూడా ఉంది. ఆనాడు స్త్రీలు వాయించేవారు. శిల్పాలలో కూడా ఇలాగే చెక్కారు. కాకతీయుల దేవాలయాల్లో ఈ శిల్పాలున్నాయి.

'శివారాధనలో ఈ వాయిద్యాన్ని వాడతారు. గ్రామ దేవతలను కొలిచేటప్పుడూ వాయిస్తారు. దీన్ని ప్రయోగించేవారంతా హరిజనులే. ఒక పర్యాయం ఉరుమును మెడలో వేసుకున్నాక చాలా నిష్టగా ఉండాలి. కాళ్లకు చెప్పులు వేసుకోకూడదు. కల్లు,సారా త్రాగకూడదు. మాంసం తినకూడదు.'

'వీరు వరుసగా నిలబడి పాటలు పాడతారు. పాడుతూ, ఉరుము వాయిస్తారు. అడుగులు వేస్తూ నృత్యం చేస్తారు '

శాస్త్రవిజ్ఞానం ప్రాధమికదశలో వున్న కాలంలో ప్రకృతిశక్తులను ఆరాధించటం మానవునికి ఆచారమయింది. సృష్టిలో జరిగే చిత్రవిచిత్రాలకు అతీతశక్తులను ఆపాదించి మానవుడు పూజించేవాడు. శాస్త్ర విజ్ఞానం పెరిగినకుందికీ ఈ శక్తుల అర్థాలు అర్థంచేసుకోసాగినాడు. ఈమార్పువలన పూజలు, పూజానృత్యాలు మారిపోసాగాయి. ఈనాడు గ్రామ దేవతారాధనలు, జంతుబలులు దాదాపు లేవు. ఈ ప్రభావం వలన ఈ రకమైన నృత్యాలకు ఆదరణ లేదు.

అలంపూర్ కర్నూలు జిల్లాలో వుంది. అక్కడ జోగులాంబ దేవాలయం వుంది. ఇది శక్తి పీఠం.

అబ్బాయిలూ! యీ సృష్టికి మూలం ఎవరు ? అనే ప్రశ్న వచ్చింది. కొందరు 'పురుషులన్నారు. మరికొందరు 'స్త్రీలు' అన్నారు. స్త్రీలు అన్న వారు శక్తి ఆరాధకులైనారు. పురుషుడేనని చెప్పిన వారు లింగార్చకులైనారు.

## శక్తి పీఠాలు

'మన దేశంలో శక్తి ఆరాధన ఉంది. ఇది చాలా పురాతన కాలాన్నుండి వస్తోంది. మనకూపద్దెనిమిది శక్తి పీఠాలున్నాయి. ఇవి ఎలా ఏర్పడినాయో యింతకు ముందు చెప్పివున్నాను. వివరాలన్నీ మీకు సతీదేవి దక్షయజ్ఞానికి వెళ్లిన కథలో వినిపించాను. పూర్వకాలం నుండి మనకో ఆచారం ఉంది. వ్యవసాయం చేసుకునే రైతులున్నారు. పొలాల్లో పనిచేసే కూలీలున్నారు. వీరు ఆడపిల్లలను దేవాలయాలకిచ్చేవారు. ఇలా యిస్తామని మ్రొక్కుకునేవారు. ఇలా యివ్వబడిన వారు దేవాలయాలలో జరిగే అనేక కార్యక్రమాలలో పాల్గొనే వారు. కొందరు సంగీతం నేర్చుకునేవారు. కొందరు నృత్యం నేర్చుకునే వారు. వీరు వివాహం చేసుకోరు. దేవతల సేవలో ఉండే వారు. ఈ ఆచారం భారత దేశమంతా ఉంది.'

## జోగులాంబలు

'ఇలాగే జోగులాంబకు ఆడపిల్లలను యిస్తారు. ఈ బాలికలు వివాహం చేసుకోరు. ఆడుతూ పాడుతూ దేవిని కొలుస్తారు. వీరిని కూడా జోగులాంబ అనే పిలుస్తారు. జోగినులని అంటారు.'

'తెలంగాణాలో పోచమ్మ, మైసమ్మ, ఎల్లమ్మ అనే గ్రామ దేవతలున్నారు. వీరిని రేణుకాదేవి రూపాలుగా కొలుస్తారు. వీరి ఆరాధనలు జరుగుతాయి. జోగులాంబలు నృత్యాలు చేస్తారు.'



'మామూలుగా విందులూ, వినోదాలప్పడు కూడా వీరు ఆడతారు. పెళ్లిళ్లకు, పేరంటాళ్లకు వీరి ఆటవుంటుంది. చనిపోయిన వారి ఆత్మ శాంతికి ఆడతారు. ఇవన్నీ వెనుకబడిన వారి యిళ్లల్లో జరుగుతాయి. ఆడపిల్లలను దేవాలయానికిచ్చే ఆచారం కూడా వీరిదే. ప్రస్తుతం ఈ ఆచారం తగ్గిపోయింది.'

## జ్యోతిర్లింగాలు

'భారత దేశములో పన్నెండు ప్రాంతాల్లో ప్రధానమైన శివలింగాలున్నాయి. వీటిని ద్వాదశ జ్యోతిర్లింగాలని అంటారు. ఆంధ్ర దేశాన్ని త్రిలింగభూమి అంటారు. అనగా మూడు లింగాల మధ్య ప్రదేశమని అర్థం. కాళేశ్వరుడు, భీమేశ్వరుడు మల్లికార్జునుడు అని యీ లింగాలను పిలుస్తారు.'

'మల్లి ఖార్జున లింగం శ్రీశైలంలో వుంది. ఇది జ్యోతిర్లింగం. ఇక్కడే శక్తి పీఠం వుంది. ఇది భ్రమరాంబ పీఠం. ఇందు వలన శ్రీశైలంలో జ్యోతిర్లింగం, శక్తిపీఠం ఒక్కచోటనే వున్నాయి. ఇలాగే గంగాతీరంలో వారాణాసిలోనూ వున్నాయి. విశ్వేశ్వరలింగమూ, విశాలాక్షి పీఠమూ ప్రక్కప్రక్కనే వున్నాయి. వారణాసిలోనూ, శ్రీశైలంలోనూ యీ లింగాలను ముట్టుకోవచ్చు. ఎవరైనా గర్భగుడిలోకి వెళ్ళి పూజ చేయవచ్చు.'

'శ్రీశైలంలో వీరశైవులు అనేకరకాలుగా ఆడిపాడేవారు. బసవ పురాణం అనే గ్రంథంలో ఈ నృత్యాలను చాలా వివరంగా వర్ణించారు.'



## చిందుభాగవతులు

'తెలంగాణా నిండా జానపద నృత్యాలున్నాయి. చిందుమాదిగలు ఆడే ఆట చూడటానికి బాగుంటుంది. వీరు యక్షగానాలాడుతారు. దాదాపు మూడు వేల మంది కళాకారులున్నారు. ప్రపంచంలో యిది ప్రత్యేక విషయం. ఒక కులానికి చెందిన వారు యింత మంది కళాకారులుగా మారటం గొప్ప విషయం.వీరు చాలా పేద వారు. బాగా కష్టం చేస్తారు. పగటిపూట పందిరి వేసి ఆడతారు. వారి అలంకరణ వారే చేసుకుంటారు.'

'పూలదండలు వేసుకుంటారు. కిరీటాలు ధరిస్తారు. భుజకీర్తులు భుజాలకు అమర్చుకుంటారు. ముఖానికి అద్దళం వేసుకుంటారు. బొగ్గుతో మీసాలు పెట్టుకుంటారు. అతి తక్కువ ఖర్చుతో ప్రదర్శన యిస్తారు. ఇలాగే భరతులు, బహురూపులు అనేవారు తెలంగాణా ప్రాంతంలో ఉన్నారు. యక్షగానాలు, వీధిగవతాలు ఆడుతారు.'

'అబ్బాయిలూ! తెలుగు నేలలో ఎక్కడికెళ్లినా నృత్యాలు కన్పిస్తాయి. ఏదో కళారూపం ఉంటుంది.'

'రెండు వేల సంవత్సరాల నాడు ఒక పుస్తకం తయారు చేశారు.'

'చాలా మంది కవులు వ్రాసిన గాథలు అందులో ఉన్నాయి. ఇవన్నీ ఏడువందల గాథలు. ఇవి చదువుతుంటే అనేక విషయాలు తెలుస్తాయి ఆరోజుల్లో ఎలా నృత్యం చేసేవారో అర్ధమవుతుంది. ఈ విషయాన్ని యింతకుముందు వివరించియున్నాను. ఈ పుస్తకం పేరు గాధాసప్తశతి!'

'జాతక కథలు చదివినా మనకు చాలా విషయాలు తెలుస్తాయి. బుద్ధుని గత జీవితాలకు సంబంధించిన వాటిని జాతక కథలని పిలుస్తారు. వీటిలో కూడా మన నృత్యాలను గూర్చి కొంత ఉంటుంది.'

'బౌద్ధ స్థూపాల్లో శిల్పాలుంటాయి. వాటిలో కూడా మన నృత్యాలను చెక్కారు.

'ఇందుకే ఆంధ్రులు నృత్యారాధకులన్నారు. సంగీతమంటే వీరికి అభిమానమని చెప్పారు. తెలుగింటిలో సిరిసిరిమువ్వలు మ్రోగుతుంటాయన్నారు. వేల సంవత్సరాల నుండి మనకు నృత్యారాధన వుంది.'

'మరోవిషయం వినండి. అనేక ఇతర జాతుల వారు ఆంధ్ర దేశానికొచ్చారు. ఇక్కడే వుండిపోయారు. పూర్వం రాజస్థాన్ నుండి బంజారీలొచ్చారు. వీరిని

లంబాడీలని పిలుస్తాము. వీరు మంచి నృత్యాలు చేస్తారు. బృంద నృత్యాలంటే వీరికి ప్రేమ. వసంతోత్సవాన్ని వీరు ఆడుతూ, పాడుతూ చేసుకుంటారు.'

## సిద్ధీలు

'ఆఫ్రికా నుండి వచ్చిన వారు హైదరాబాద్‌లో వుండిపోయారు. వారు బాగా నృత్యం చేస్తారు. తమ పూర్వీకుల ఆటలను ప్రదర్శిస్తారు. వీరిని సిద్ధీలు అని పిలుస్తారు.'


భింసా నృత్యం

'మనప్రక్కనే దండకారణ్యం వుంది. ఈ అడవులలో నివసించేవారు భైంసా నృత్యం చేస్తారు. నడుము చుట్టూ చేతులు వేసుకుని ఆడుతారు. ఎనుబోతు కొమ్ములు తలపైకట్టుకుంటారు. డోలు మెడలో వేసుకుంటారు. ఇదో రకమైన ఆట. దీన్ని కొమ్ము నృత్యం అంటారు.'

'ఇలా ఎన్నెన్నో నృత్యాలున్నాయి.'

'ప్రకృతి మధ్య గ్రామాలుంటాయి. గ్రామీణులు పనిపాటలు చేసుకుంటూ జీవిస్తారు. వీరి నృత్యాలన్నీ సహజంగా వుంటాయి. చేసేపని కనుకూలంగా ఆడుతూ పాడుతారు. ఇవన్నీ ఒకరు చెప్పగా వచ్చేవికావు. చేపకు యీత నేర్పనవసరం లేదుకదా! పక్షికి ఎగరటం ఎవ్వరూ చెప్పరు. ఈనృత్యాలలో వున్న విశేషం ఇదే. జానపదం అంటే గ్రామీణులకు ఊపిరి వంటిది. ఆపాటల వరసలూ అంతే.'

'అబ్బాయిలూ! జానపదులు పాడేటప్పుడు జాగ్రత్తగా గమనించండి. పదాన్ని ఎలా విరుస్తున్నారో వినండి. ఆడేటప్పుడు అడుగు ఎలా వేస్తున్నారో చూడండి. క్రమేణా మీకే తెలుస్తుంది. వారి పనికి, వీటికీ వున్న సంబంధం అర్థమవుతుంది.

'ఈపూటకుచాలు.' అని ముగించారు గురుదేవులు.

సాయంకాలం శ్రీకాకుళం చూచిరావాలని బయలు దేరాము.

గురూజీ నడుస్తూ మధ్యలో ఆగిపోయారు.

'అబ్బాయిలూ! మనం నడిచే ప్రాంతంలో పూర్వం చాలా పెద్ద లంక వుండేది. దీని మీదనే దేవాలయం వుండేది ఈ లంక కృష్ణలో కలిసిపోయింది దేవాలయం పడిపోయింది. ఇలా మూడు పర్యాయాలు జరిగిందట. నాలుగో తడవ దేవాలయాన్ని యిప్పుడున్న చోట నిర్మించారు. మనం నిలబెట్టారని చెప్పటం మంచిది.'

'ఎన్నో శిలా శాసనాలు విరిగిపోయాయి. కొట్టుకు పోయాయి గొప్ప కళాఖండాలు పాడైపోయాయి మిగిలిన వాటిని పోగుచేశారు. ఈనాడు మనం చూడబోయేది యిలా నిర్మించిందే కాని, ఆంధ్ర మహావిష్ణువును చెక్కు చెదర కుండా కాపాడు కొచ్చారు' అన్నారు.


శ్రీ కాకుళేశ్వరుడు

మేము దేవాలయంలో ప్రవేశించాము. పూజారులందరూ ప్రేమగా ఆహ్వానించారు. గురూజీ వెంట దేవాలయం చుట్టూ తిరిగాము. గోడల్లో అక్కడక్కడ వున్న శాసనాలను చూపించారు.

గర్భగుడిలోకి వెళ్లాము. గంట మ్రోగించి వరుసగా నిలబడ్డాము. గురూజీ నెమ్మదిగా చెప్పారు.

## పురుషోత్తమకవి

'ఈ దేముణ్ణి ఆంధ్రమహావిష్ణువని పిలుస్తారు. ఆంధ్రదేవుడంటారు. తెలుగు రాయడంటారు. ఇలా అని పద్యాలలో వ్రాశారు.'

'కాసుల పురుషోత్తం అనే కవి శ్రీకాకుళాంధ్ర దేవుని మీద ఆంధ్రనాయక శతకం వ్రాశాడు. ఆయన పద్యం చివరిలో అన్న మాటలు వినండి.'

**చిత్రచిత్ర స్వభావ- దాక్షిణ్యభావ!**
**హతవిమత జీవ- శ్రీకాకుళాంధ్రదేవ!**

'ఆయన యీ దేముణ్ణి తిడుతూ పొగిడినాడు. దీన్ని నిందాస్తుతి అంటారు. "ఆ! నీగొప్పేముందయ్యా! నీభార్య లక్ష్మిదేవి కాబట్టి ఎవరడిగినా లేదనకుండా యిచ్చావు". ఇలా ఆయన వ్రాశాడు.'

హారతి ఇచ్చారు. అందరం కళ్లకద్దుకున్నాం.

## ఆంధ్రమహావిష్ణువు

గురూజీ మరల చెప్పారు. 'ఈవిగ్రహం వంక జాగ్రత్తగా చూడండి. కుడిచేత శంఖం వుంది. ఎడమ చేత చక్రంవుంది. ఇలా విష్ణుమూర్తికి వుండవు. ఆయుధం సుదర్శన చక్రం కదా? అదెప్పుడూ కుడి చేత్తోనే ఉంటుంది. దీని అర్థం ఏమిటో తెలుసా?'

ఎవ్వరమూ చెప్పలేక పోయాము. వారే సెలవిచ్చారు. 'ఈ దేముడు శాంతి ప్రియుడు. ఎప్పుడూ శాంతినే కోరతాడు. అందుకే చక్రం బదులు శంఖం పట్టుకున్నాడు.'

మేమంతా కళ్లు పెద్దవి చేసుకుని చూశాము. దీపాల కాంతిలో ఆయన మెరిసి పోతున్నాడు. తులసి మాలలు, మల్లె దండలు నిండుగా అలంకరించారు.

బయటికి వచ్చి కల్యాణ మంటపంలో కూర్చున్నాము.

## ఆముక్తమాల్యద



గురూజీ ప్రారంభించారు.

'హంపీ విజయనగరాన్ని పాలించిన శ్రీకృష్ణ దేవరాయలు యిక్కడకి వచ్చారు. ఆయన్ని గూర్చి చెప్పివున్నాను. మరికొంత వివరిస్తాను వారు ఈ దేముని పూజించారు. కళింగ యుద్ధంలో విజయాన్ని ప్రసాదించమని ప్రార్థించారు. వారు ఒకరాత్రి దేవాలయంలో నిద్రించారు. వారికి

కలవచ్చింది. ఆకలలో శ్రీకాకుళేశ్వరుడు తెలుగులో పుస్తకం వ్రాయమన్నాడు. తన భక్తురాలు గోదాదేవి చరిత్ర రచించమన్నాడు. ఆసందర్భంలో **'దేశభాషలందు తెనుగు లెస్స'** అని వ్రాశారు. కాని కృష్ణరాయలకు ముందే వినుకొండ వల్లభరాయుడనే కవి దేశభాషలందు తెలుగులెస్స అన్నాడు.'

'శ్రీకృష్ణదేవరాయలు కన్నడ దేశీయుడు. చాలా భాషలు నేర్చుకున్నాడు. చక్కగా కవిత్వం చెప్పగలడు. తెలుగులో కావ్యాలు వ్రాశాడు. ఇతర భాషల్లోనూ వ్రాశాడు. చక్రవర్తి బహుభాషాకోవిదుడు గనుక రాయలవారి మాటను అంతా గుర్తుపెట్టుకున్నారు.'



## లక్ష్మణరావు

'కొమర్రాజు లక్ష్మణరావు అనే గొప్ప వ్యక్తి వుండేవారు. ఆయన చరిత్ర పరిశోధన చేశారు. అనేక విషయాలు ఎప్పుడు జరిగినవో నిర్ణయించారు. ఎన్నో శిలా శాసనాలు చదివి చెప్పారు. శ్రీకృష్ణ దేవరాయలు 1519వ సంవత్సరం ఫిబ్రవరినెలలో శ్రీకాకుళం వచ్చారు. పదకొండవ తారీఖున ఆముక్తమాల్యద ప్రారంభించారు. ఆరోజు శుక్రవారం. ఏకాదశి. ఈవిషయం లక్ష్మణరావు గారు చెప్పారు.'

## రాజరాజు

'అబ్బాయిలూ! రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరాన్ని పాలించాడు. ఆయన 1022వ సంవత్సరంలో, ఆగస్టునెల పదహారవతేదీన సింహాసనం మీద కూర్చున్నాడు. పట్టాభిషిక్తుడయ్యాడు. ఆ తరువాత రాజరాజు 1054లో నన్నయతో ఆంధ్రమహాభారతం వ్రాయించాడు. అప్పటికి తెలుగు పద్యం పూర్తిగా పరిణామం పొందింది. ఇన్ని సంవత్సరాలైనా తెలుగు పద్యంలోని తీపితగ్గలేదు.'

'ఆ తరువాత ఓరుగల్లు సామ్రాజ్యంలో కవిత్వం బాగా ఆదరించబడింది. మూడు పూవులు ఆరు కాయలుగా అభివృద్ధి చెందింది. ఎక్కువగా శివుని మీద సాహిత్యం వచ్చింది. శివకవులుగా ఆ రచయితలు పేరు పొందారు.'

## కొండపీడు-హంపి

'తరువాత రెడ్డి రాజులు ప్రోత్సహించారు. వెలమ ప్రభువులు ఆదరించారు. విజయనగర సామ్రాజ్యంలో తెలుగు కవులు ఎంతో కీర్తిని పొందారు. శ్రీనాథ మహాకవికి ప్రౌఢదేవరాయలు కనకాభిషేకం చేశాడు. అనగా బంగారు నాణేలతో, బంగారు పూలతో తలపైన పోసేవారు. ఆ ధనాన్ని పంచిపెట్టేవారు. ఇది సామాన్య విషయం కాదు.'

'కృష్ణదేవరాయలకు కవులంటే ప్రేమ. వారు ఎందరో కవులను పోషించారు. వారు తన దర్బారుకు **భువనవిజయం** అని పేరు పెట్టారు. ఎనిమిది మంది గొప్పతెలుగు కవులు వారి వద్ద ఉండేవారు. వీరిని అష్ట దిగ్గజా లనేవారు. వీరు గాక అనేక భాషల కవులుండేవారు.

## రాచకొండ

'వెలమ ప్రభువుల వద్ద పోతన కొంత కాలం ఉన్నాడు. తరువాత స్వంత వూరు వెళ్లి పోయాడు. వ్యవసాయం చేసుకుని జీవించాడు. భాగవతాన్ని తెలుగులో వ్రాశాడు. పది అవతారాలను వర్ణించాడు.'

## దశావతారాలు

'మీకు త్రిమూర్తుల గూర్చి చెప్పాను. ముగ్గురిలో విష్ణుమూర్తి పని ధర్మాన్ని రక్షించటం. ఇందు కొరకు అవసరమయినపుడు భూమి మీద ఏదో రూపంలో అవతరిస్తాడు. పాపులను శిక్షించి, పుణ్యులను కాపాడుతాడు. ఈ పని కొరకు తొమ్మిది అవతారాలు దాల్చాడు. పదవ అవతారం రావలసి వుంది.



1.మత్స్యావతారం



6. పరశురామావతారం



7. రామావతారం

'కృష్ణావతారం అవతారాలన్నింటిలోకి గొప్పది. మహాభారత యుద్ధంలో కృష్ణుని పాత్ర మీకు తెలుసు. కలియుగం చివరలో, కలికావతారం వస్తుంది. గుర్రం మీద కూర్చొని కత్తి చేత్తో పట్టుకుని వస్తాడు.'

'ఈ అవతారాలను గూర్చి పురాణాల నిండా కథలున్నాయి. కావ్యాల నిండా వున్నాయి. ప్రతి గ్రామంలోనూ ఈ కథలు చెప్పుకుంటూ వుంటారు.'

'ఈ అవతారాలను నృత్యంగా ప్రదర్శించటం మనదేశంలో అన్ని ప్రాంతాలలోనూ చేస్తుంటారు. పది అవతారాలను కొందరు చేస్తారు. మరి కొందరు కృష్ణావతారాన్నో, రామావతారాన్నో నృత్యంగా చేస్తారు.'

## అవతారనృత్యం



'ఆంధ్రదేశంలో కూచిపూడి భాగవతులు దశావతారాలను ప్రదర్శిస్తారు ఇలాగే తంజావూరు భరత నాట్యంలో దశావతారాలున్నాయి. తూరుపు భాగవతులు, భామా కలాపంలో దశావతారాలు చేస్తారు.'

'పశ్చిమ గోదావరి జిల్లాలో మోరంపూడి అనే గ్రామం ఉంది. అక్కడ వైదేహి, ఇందువదన అనే అక్కా చెల్లెలు ఉండే వారు. వారు దశావతారాలు ఆడేవారు ప్రతి అవతారానికి ఒక ప్రత్యేక రాగం ఉండేది ప్రత్యేక తాళం ఉండేది. ఇందువలన చూడటానికి చాలా బాగా ఉండేది. వారి [illegible] రామకృష్ణ గారు ఈ దశావతారాలను ప్రచారంలోకి తెచ్చారు. రామకృష్ణగారి ఆంధ్ర నాట్యంలో యిదో ప్రత్యేక అంశంగా పేరు తెచ్చుకుంది.'

### పోతన

'పోతన రామభక్తుడు. తియ్యని కవిత్వం చెప్పినాడు. సహజకవి అని అంతా పొగిడేవారు. వీరు భాగవతంలో ఎన్నో నృత్యాలను వర్ణించారు.'



'అష్టదిగ్గజాలు కావ్యాలు వ్రాశారు వాటిలోనూ నృత్యాలను గూర్చి వర్ణనలున్నాయి.'

'ఆ తరువాత నాయకరాజులు పాలన వచ్చింది. అక్కడ రంగాజమ్మ అనే కవయిత్రి ఉండేది. ఆమెకు ఎనిమిది భాషలొచ్చు రంగాజమ్మ చాలా పుస్తకాలు వ్రాసింది. చేమకూర వెంకట కవి విజయవిలాసం వ్రాశాడు. దీనిలోనూ నాట్య వర్ణనలున్నాయి. ఏకవి ఏది వ్రాసినా

నృత్యాన్ని వదలి పెట్టేవారు కాదు. తమ గ్రంథంలో నాట్యాలను వివరించేవారు.

'అందెల రవళి వారిని కదిలించేది. కవిత్వం చెప్పించేది.'

## ప్రజాకవి వేమన

'ఆ తరువాత ఎందరో వచ్చారు. ఎన్నో రచనలు చేశారు. కాని వేమన చెప్పిన పద్యాలు చాలా బాగా ఉంటాయి. పల్లె వానులు కూడా అర్థం చేసుకునేటట్లుంటాయి. జీవితంలోని అనేక విషయాలపైన పద్యాలు చెప్పాడు. ఈయనను ఇప్పటి వారు ప్రజాకవి అని పిలుస్తున్నారు. మనుషులు ఎలా ఉండాలో ఆయన చెప్పాడు. మనిషిలో తప్పులు, ఒప్పులు ఉంటాయి. వాటిని చక్కగా చూపించాడు. తప్పుల మీద మొట్టికాయలు వేశాడు. చక్కగా విమర్శించాడు.'



'ఇలాగే బద్దెన వ్రాసిన సుమతీ శతకం కూడా నీతిని బోధిస్తుంది. అనేక శతకాలొచ్చినా, సుమతీ శతకం, వేమన శతకం ప్రజల్లోకి బాగా వెళ్ళాయి.'

'మహాత్మా గాంధీజీ నాయకత్వాన జాతీయ పోరాటం జరిగింది. ఆసమయంలో ఎన్నో పాటలు, పద్యాలూ వచ్చాయి. ప్రజలను ముందుకు నడిపించాయి.'

## శ్రీ శ్రీ

'మహాకవి శ్రీ శ్రీని గురించి మీరు అప్పుడప్పుడూ వినే ఉంటారు. ఆయన అనేమాటలు చెపుతాను. నవ కవిత్వానికి ఏం కావాలో ఆయన పాటలో చెప్పాడు.'

మారేది– మార్పించేది
మునుముందుకు సాగించేది
పెను నిద్దుర వదిలించేది
కావాలోయ్ నవకవనానికి

'నృత్యాల్లోనూ అనేక మార్పులొచ్చాయి. అవి మారిపోతూ, ఈనాటి

రూపంలో మన మధ్య నిలిచాయి.'

'ఇలా మన తెనుగు కవిత, నృత్యం పరిణామం చెందాయి. వేయి సంవత్సరాల చరిత్రను నిర్మించుకున్నాయి. తెలుగు వారికి అంతులేని కీర్తిని సంపాదించిపెట్టినాయి.'

'అందరం లేచాము. బయలు దేరాము. ఒక మాటు ఆలయం వంక చూశాను. శిథిలావస్థలో వుంది. ఒకనాటి వైభవం గుర్తొచ్చింది. ఆనాడు ఈ ప్రాంతంలో ఎందరో నృత్యం చేసేవారుండే వారు, గుడిలో నృత్యాలు జరుగుతుండేవి.'

ఎదురుగా గాలిగోపురం మీద పావురాలు పల్టీలు కొడుతున్నాయి.

నా మనస్సు నిలకడగా లేదు.

గురూజీ చెపుతున్నారు. ఆమాటలకు మళ్లీ మామూలు ప్రపంచంలోకి వచ్చాను.



## దేవాలయ నృత్యాలు

'పూర్వం దేవాలయంలో అర్చనా నృత్యాలుండేవి. దేవుణ్ణి అలంకరించి బయట ఉంచేవారు. వీటిని ఉత్సవ విగ్రహాలనేవారు ఇక్కడ పండితులు కూర్చునేవారు. సభ జరిగేది. నృత్యాలు జరిగేవి. కళాకారిణులు తమ పాండిత్యాన్ని చూపించేవారు. దేవాలయం బయట జనం గుమిగూడేవారు. వారి కొరకు కలాపాలు ఆడేవారు. భాగవతాలు ఆడేవారు. ఇలా నృత్య కళ మూడు విధాలుగా ప్రచారం పొందింది.'

గుళ్లో గంటలు విన్పిస్తున్నాయి. అందరం బయలు దేరాము. నది అంచుకొచ్చాము. పడవ కట్టేసి ఉంది. దానిమీద కూర్చున్నాము.

గురూజీ చెపుతున్నారు. 'ఈ నది సహ్యాద్రి నుండి వస్తోంది. కృష్ణవేణి ఆంధ్ర మహావిష్ణువుకు అభిషేకించాలను కుంటదట. పాదాలు కడగాలని కోరుకుందట. తెలుగు రాయని ముందు నృత్యం చేయాలనుకుందట.' ఈపాట వినండి. ఆయన పాట ప్రారంభించారు.

"రాజ్యలక్ష్మి సామ్రాజ్యము కూర్చెను,
భోగలక్ష్మి సిరిసంపద చేర్చెను,
ఘనుడవు నీవని గర్వమేలరా?
నీ పదముల దరి నిలువ నీయరా! శ్రీకాకుళ సదనా!
దివిజన దివ్యార్చిత వదనా!"

'ఇది నిందాస్తుతి. పురుషోత్తమ కవి పద్యాలలో చెపితే నేను పాటలో చెప్పాను.' వారు వివరించి, మరల పాడసాగారు. నది అలల మీదుగా తేలిపోతూ ఆపాట కదలి పోయింది. నృత్యం చేస్తూ జాలులో కలిసి పోయింది.

వేసవి ముదిరిపోయింది. ఎండలు పెరిగాయి. వడగాలికూడా సాగింది. కొద్ది రోజుల్లో మాకు వేసవి సెలవులిస్తారు. అందరం పందిరి క్రింద కూర్చున్నాము. గురూజీ ప్రారంభించారు.

## నాట్యారాధన లింకు భాష

'తెలుగు వారిలో చాలా మంది నాట్య కళను గూర్చి వ్రాశారు. పాతరోజుల్లో సంస్కృతంలో వ్రాస్తేనే గొప్ప అనుకునేవారు. ఇందు వలన సంస్కృతం నేర్చు కోవలసి వచ్చేది. పుస్తకాలు చదవాలంటే ఇలా చేయవలసిందే. భారత దేశంలో అనేక భాషలున్నాయి. అందరికీ తెలిసే భాష సంస్కృతం అయింది. అనగా అనుసంధాన భాష అనే మాటను వాడాలి. బౌద్ధానికి పాళి అనుసంధాన భాష అయింది. బ్రాహ్మణ



మతానికి సంస్కృతమయింది. ఆ తరువాత ముస్లిం పాలకులకు రాజభాషగా ఉర్దూ వచ్చింది. బ్రిటీషు వారు ఇంగ్లీషును ప్రవేశ పెట్టారు.'

ఒకో దశలో ఒకో భాష జాతీయ భాష అయింది.

'తరువాత ప్రాంతీయ భాషలు పెరిగాయి. దక్షిణ భారత దేశంలో నాలుగు భాషలు పెరిగాయి. **కన్నడం, తమిళం, మళయాళం,** మనం మాట్లాడే **తెలుగు** లేక ఆంధ్రం.'

'భరతముని నందికేశ్వరుడు జాయపలను గూర్చి చెప్పివున్నాను. వీరి గ్రంథాలు సంస్కృతంలో ఉన్నాయి.'

**సింహుడు**

'మరో వ్యక్తి సింహ భూపాలుడు. ఈయన రాజధాని రాచకొండ. ఈయనకు సర్వజ్ఞుడనే బిరుదు వుంది. అనగా అన్నీ తెలిసిన వాడని అర్థం. ఈయన '**రసార్ణవ సుధాకరము**' అనే గ్రంథాన్ని వ్రాశాడు'.

**వసంతరాయలు**

'మీకు లకుమాదేవిని గూర్చి చెప్పాను. కుమారగిరి రెడ్డిని గూర్చి వివరించాను. ఈయన వసంతోత్సవాలు చేయించేవాడు. అందుకే **కర్పూర వసంతరాయలనే** బిరుదు వుండేది. ఈయన వసంతరాజీవమనే గ్రంథాన్ని వ్రాశాడని తెలుస్తోంది. కాని ఈ గ్రంథం దొరకలేదు.'

'పెదకోమటి వేమారెడ్డికి సర్వజ్ఞుడనే బిరుదు వుంది. రాజులు కదా! వారు ఆడింది ఆట. పాడింది పాట. ఏ బిరుదు తగిలించుకున్నా ఎవరు కాదనగలరు.? వేమారెడ్డి **సాహిత్య చింతామణి** అనే పుస్తకం వ్రాశాడు. **సంగీత చింతామణి** అనే మరో గ్రంథం కూడా వ్రాశాడు.'



**వసంతరాయలు – లకుమ**

'అబ్బాయిలూ! యిప్పటి మాదిరిగా పూర్వం ప్రతి శాస్త్రమూ పెరగలేదు. ఇన్ని భాగాలుగా విడిపోలేదు. ఇప్పుడు ప్రతిదీ కొమ్మలూ రెమ్మలూ వేస్తోంది. ఇందువలన ఒక విషయాన్ని గూర్చి వ్రాయాలనుకున్నప్పుడు దానికి

సంబంధించిందంతా అందులో వ్రాసేవారు. ఇదో ఆచారంగా కూడా వచ్చింది. ఇలా చేయటం మంచిదని భావించే వారు. వివరాలకు మరో గ్రంథం చూడవలసిన పని ఉండదు. కాని, ఈనాడు ఇలా లేదు.'

## అనేక మంది రచయితలు

'చతుర కల్లినాథుడనే రచయిత ఉండేవాడు. మీకు సారంగదేవుని గూర్చి చెప్పాను. వారు వ్రాసిన గ్రంథం సంగీత రత్నాకరం. దీనికి మల్లి నాథుడు **'కళా నిధి'** అనే వ్యాఖ్యానం వ్రాశాడు. ఈయన **ఇమ్మడి దేవరాయల** ఆస్థానంలో వుండేవాడు. ఇలా ఎందరినో చెప్పవచ్చును. **బండారు విఠలుడు, బండారు లక్ష్మీనారాయణ, చెరుకూరి లక్ష్మీధరుడు,** అనేవారు నృత్య కళపై వ్రాశారు.

'ఇందు వలన నృత్యానికున్న గౌరవం మనకు అర్థమవుతుంది.'

## తిట్లూ – దీవెనలు



'కాని, భారతదేశంలో చక్కగా పెరిగిన నృత్యకళకు, వ్యక్తుల వలన చెడ్డ పేరు వచ్చింది. నృత్యం చేసేవారి ప్రవర్తన నీతికి దూరంగా జరిగింది. ఇందువలన సంఘంలో నృత్యం పైన చెడ్డ అభిప్రాయం పెరిగింది.'

'కాని నృత్యకళ చాలా గొప్పది. ఏదైనా చెడు ఉంటే నృత్యం చేసేవారి కుటుంది. నృత్యాన్ని ఆరాధించేవారి వలన ఉంటుంది.'

'ఈ విధమైన అభిప్రాయాలు నాట్య శాస్త్రం వ్రాయకముందే ఉండేవి. దీనిని కాదని, భరతుడు నృత్యం పవిత్రమైనదని చెప్పాడు. పార్వతీపరమేశ్వరుల రూపమని పెద్దలన్నారు. బ్రహ్మ, వేదాల నుండి తయారు చేశాడన్నారు. ఐనా, చెడ్డ పేరుతొలగలేదు. ఇందువలన చాలా మంది ప్రముఖులు కటువుగా విమర్శించారు.'

త్యాలు

## చాణక్యుడు

'పూర్వం మౌర్య చంద్రగుప్తుని దగ్గర చాణక్యుడనే గొప్ప వ్యక్తి వుండేవాడు. ఈయనను కౌటిల్యుడని కూడా అంటారు. ఈయన **'అర్థశాస్త్రం'** వ్రాశాడు. ఇది చాలా గొప్ప పుస్తకం. ఈ పుస్తకంలో నటులను, నర్తకులను, వాదకులను, దగ్గరకు చేరనీయరాదన్నాడు. నాట్యశాలలు ఊరి మధ్యన నిర్మించరాదన్నాడు.'

## స్మృతులు

'మనువనే మరో వ్యక్తి ధర్మశాస్త్రం వ్రాశాడు. ఆయన నాట్య వృత్తిని బహిష్కరించాలన్నాడు. **యాజ్ఞవల్క్యుడనే** మరో గొప్ప వ్యక్తి ఉన్నాడు. **'బ్రాహ్మణుడు నటుడు కారా'**దన్నాడు. బ్రాహ్మణుడు నటుడైతే, అతనితో కలసి భోజనం చేయరాదని నిషేధించాడు. ఇదంతా **యాజ్ఞవల్క్య స్మృతిలో** ఉంది. మరో గ్రంథం **విష్ణు స్మృతి.** నటుల పుట్టుకను గురించి తమాషగా ఇందులో వ్రాశారు. నటులు శూద్రులకు వైశ్యకన్యలకు పుట్టిన వారన్నారు.'

## జీవితం ప్రవాహం

'అబ్బాయిలూ! జివితం ప్రవాహం వంటిది. మన కృష్ణానదిని చూడండ. చక్కగా ప్రవహిస్తోంది. జీవితమూ ఇంతే. ఎవరో కొందరు కాలడ్డం పెడితే నదీ ప్రవాహం ఆగిపోదు. జీవితమూ ఇంతే. జీవితంలో పూసిన పూవులూ ఇంతే. వాటి వాసనలను, అందాలను ఎవ్వరూ ఆపలేరు. వాటి సహజత్వం వాటికున్నాయి. లలితకళలూ సహజంగా సమాజం యొక్క పరిస్థితిని బట్టి పుడతాయి. పెరుగుతాయి సమాజంలో కలసి పెరగలేనపుడు రాలిపోతాయి.'

'ఈ రోజుకు చాలిస్తాను. ఏటిలో స్నానం చేసిరండి' అన్నారు. అందరం నీటివైపు వెళ్లాం.

ఈ రోజు గురూజీ మమ్ములను నది అంచుకు తీసుకువెళ్ళారు. అందరం అక్కడ కూర్చున్నాం. వారు పాఠం చెప్పటం ప్రారంభించారు.

## వీణ

'మీకు తంజావూరు పాలకులను గూర్చి చెప్పి ఉన్నాను. **రఘునాథ నాయకుడు** సంగీత ప్రియుడు. **రఘునాథ వీణ** అనే క్రొత్త వీణను తయారు చేశాడు. దీనిపైన అన్ని రాగాలను పాడవచ్చును. **సంగీత సుధ** అనే గ్రంథాన్ని కూడా వ్రాశాడు. ఇందులో సంగీతాన్ని గూర్చి వివరించాడు. చివరిలో నృత్యాన్ని గూర్చి వ్రాశాడు.'



వీణాసరస్వతి

'ఇంత వరకు నృత్యం మీద వచ్చిన గ్రంధాలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి. ఆ తరువాత తెలుగు పద్యాలతో నృత్యం మీద రచనలు చేశారు. **పోలూరి గోవిందకవి, మాతృభూతయ్య,** అంటూ చాలా పేర్లు చెప్పవచ్చును. ఇవన్నీ పెద్ద వారైనాక పరిశీలించ వచ్చు. ప్రస్తుతానికి ఇంత వరకు చాలు.'

'ఆధునికంగా వచనంలో అనేక మంది వ్రాస్తున్నారు. వీరిలో **నటరాజరామకృష్ణను** ప్రముఖ వ్యక్తిగా చెప్పవచ్చును. వీరు పిల్లలకు, పెద్దలకు పనికి వచ్చేటట్లు నృత్యం మీద చాలా గ్రంధాలు వ్రాశారు. ఎవరెన్ని చెప్పినా ఒక విషయాన్ని వదిలి పెట్టరు. భరతుని, నందికేశ్వరుని, జాయపను కాదని వేరుగా వ్రాయలేరు. వ్రాయటానికి వీలు లేదు. ఇందు వలన ఈ ముగ్గురూ వ్రాసిన గ్రంధాలు నృత్యానికి ప్రాణం వంటివి. మీరు పెద్దవారయిన తరువాత జాగ్రత్తగా వీటిని **అధ్యయనం** చేయండి. నేను చదవమని అనటం లేదు. అధ్యయనం చేయమంటున్నాను.మీరు యీ గ్రంథాలలోని ప్రతి అంశాన్ని వంట బట్టించుకోవాలని నాకోరిక. ఇలా చేస్తారనే నమ్మకంతో చెపుతున్నాను. ఏవైనా ప్రశ్నలుంటే అడగండి అన్నారు.'

ప్రసాద్ లేచి నిలబడ్డాడు. అందరం అతని వైపు చూస్తున్నాము.

"గురూజీ! ఆంధ్రదేశంలోని నృత్యాలను గూర్చి చెప్పారు. తమరు కాకతీయులను గూర్చి వివరించారు. ఆనాడు నృత్యం సంఘంలో గౌరవాన్ని పొందింది. సాంఘిక కళగా పెరిగింది. కాని అప్పుడు ఏమేమి నృత్యాలుండేవో మాకు తెలియదు. దయతో వాటిని వివరించండి."

గురూజీ నవ్వుకున్నారు. మా అందరి వంకా చూశారు. 'ఇంకేమైనా ప్రశ్నలు

న్నాయా?' అన్నారు.

ఎవ్వరమూ మాట్లాడలేదు.

## కాకతీయులనాటి నృత్యాలు

'జాయపసేనాపతిని గూర్చి మీకు మరికొంత చెపుతాను. ఆయన వ్రాసిన గ్రంథంలో అనేక నృత్యాలను గూర్చి వివరించారు. కాకతీయ సామ్రాజ్యంలో అనేక జాతుల వారుండేవారు. అది విశాలమైన సామ్రాజ్యం. ఈనాడు మధ్య ప్రదేశ్‌లో ఉండే బస్తరు, చాందా కూడా వీరి క్రిందే ఉండేవి. ఈ ప్రాంతంలో 'గోండ్లు' అనే వారున్నారు. వీరు 'విచిత్రపద్ధతి' అనే నృత్యం చేస్తారు. అందరూ కలిసి చేస్తారు. ఇందువలన దీన్ని సామూహిక నృత్యం అని పిలవవచ్చును.'



పేరిణి కుమార్

'మీకు పేరిణి, ప్రేక్కణి నృత్తాలను గూర్చి చెప్పాను. ఇవి సామూహికంగా చేయవచ్చును. ఒక్కొక్కరు ఆడవచ్చును.'

'మరో నృత్యం 'రెండు తెగలసూడ'. ఇంకోదాని పేరు రాసకం. యింకోటి చర్చరీ. యిలా చాలా నృత్యాలను జాయప వర్ణించాడు. ఈయన చెప్పిన వాటిలో కొన్ని మాత్రమే యిప్పుడున్నాయి. అవి కూడా చాలా మారిపోయాయి.'

'రాచకంలో పూర్తిగా స్త్రీలే పాల్గొంటారు. జంటలు, జంటలుగా నృత్యం చేస్తారు. ఈ నృత్యం చాలా అందంగా ఉంటుంది.'

## అనేక నాట్యాలు

'నాట్య రాచకం అనే నృత్యం చేసేవారు. కృష్ణుడు లేకుండా గోపికలు చేసే రాచక్రీడ వంటిది. ఇప్పుడు యీ నాట్యం మన దగ్గర లేదు.'

'దండ రాచకం స్త్రీ పురుషులు కలిసి ఆడే ఆట. అంతా కోలాటం వేస్తారు. మనగ్రామాల్లో కోలాటం వేయటం చూసే ఉంటారు. దండరాచకం నుండి ఇప్పటి రూపం వచ్చింది.'



పేరిణి నృత్యం

'శివ ప్రియం' స్త్రీ, పురుషులలో ఎవ్వరైనా చేయవచ్చును. శివునిపైన పాటలు పాడుతూ ఆడతారు.'

'చిందు నృత్యం ద్రావిడులకు చాలా ప్రియమైనదని జాయప వ్రాశాడు. మరో ఆటపేరు 'ఘటనట్ నృత్తం' ఇది సామాన్యులు చేసే నృత్యం. సంఘంలో అడుగునున్న వారి ఆట.'

## చారణులు

'రాజస్థాన్, గుజరాత్ ప్రాంతాలలో చారణులనే వారున్నారు. వారు పాటలు పాడుతూ ఆడతారు. రాజులపైన కవిత్వం చెపుతారు. చక్కగా అడుగులు వేస్తారు. తమ కవిత్వాన్ని తామే చదువుతారు. కాకతీయుల కాలంలో చారణ నృత్యం వుంది. ఇప్పుడు ఆంధ్రదేశంలో యీరూపం లేదు. ఈ నృత్తం మనకు కన్పించదు. కాని మనకు కైవారాలున్నాయి. భగవంతుని పూజిస్తూ, పొగడే పాటలున్నాయి. ఆటలున్నాయి.

'బహురూప నృత్తం అనేది పగటి విశేషాల వంటిది. ఆంధ్ర దేశంలో భాగవతులు పగటి వేషాలు వేసేవారు. ఇప్పటికీ మనకు పగటి వేషాలున్నాయి.'

'ఇలా అనేక విషయాలను నృత్తరత్నావళిలో జాయప వ్రాశాడు. అవి చదివి తెలుసుకోదగిన విషయాలు.

గురూజీ ప్రసాద్ వంక చూచి, యింకేమన్నా ప్రశ్నలున్నాయా?, అన్నారు. ప్రసాద్ అడిగాడు. 'గురూజీ! తమరు తాండవాన్ని గూర్చి మాకు వివరంగా చెప్పారు. అమ్మవారు లాస్యం చేసేవారన్నారు. లాస్యం ఎలా వ్యాప్తిచెందిందో సెలవియ్యండి అన్నాడు.'

'గురూజీ ప్రశాంతంగా అందరివైపూ చూశారు. 'ఇది మంచి ప్రశ్న. ఇలాంటివే అనేక విషయాలు చెప్పటంలో మరిచి పోయి ఉంటాను. గుర్తు తెచ్చుకుని అడగండి.'

**ఉషాపరిణయం**



పద్మశ్రీ
వేదాంతం సత్యనారాయణ శర్మ

'ప్రసాద్! పూర్వం బాణాసురుడనే అసురుడుండేవాడు. అతను శివుని గూర్చి తపస్సు చేశాడు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఏమి కావాలో కోరుకోమన్నాడు. ఆ అసురుడు ఆలోచించాడు. తనకోట గుమ్మం వద్ద కాపలా ఉండమన్నాడు. తప్పుతుందా! పాపం, పరమేశ్వరుడు కాపలా ఉన్నాడు. పార్వతీ దేవి భర్త వెంటే ఉంది. బాణాసురునికి 'ఉష' అనే కూతురుఉంది. ఆమె అందంగా ఉండేది. వినయంగా ఉండేది. పార్వతీదేవి దగ్గరకు వెళ్లేది. అమ్మవారికి సేవలు చేసేది. పార్వతీదేవికి ఉష అంటే అభిమానం, మంచి ప్రేమ అందువల్ల ఉషకు నృత్యం నేర్పింది. లాస్యం చెప్పింది. శ్రీకృష్ణుని మనుమడు అనిరుద్ధుడు. ఇతను చాలా అందమైన వాడు. తెలివైనవాడు. బలమైనవాడు.'

'ఉష అనిరుద్ధుని వివాహం

చేసుకుంది. భర్తవెంట ద్వారకానగరానికి వెళ్లింది. ద్వారక ఈనాటి గుజరాత్‌లో ఉంది. గుజరాత్‌ను సౌరాష్ట్రం అంటారు.

ఉష అక్కడ స్త్రీలకు లాస్య విద్య నేర్పింది. ఈ విధంగా లాస్యం వ్యాప్తి చెందింది. ఈ కథను కూచిపూడి కళాకారులు యక్షగానంగా ఆడుతారు. దీనికి ఉషా పరిణయం అని పేరు పెట్టారు.'

## అన్ని జాతులూ నృత్యం చేస్తాయి

'నృత్యమంటే ఏమిటి? ఎలా చేస్తారు? అనే ప్రశ్నలకు క్లుప్తంగా సమాధానం చెపుతాను. ప్రపంచంలోని అన్ని జాతుల వారూ నృత్యం చేస్తారు. నృత్యాన్ని ఆరాధిస్తారు. చేసేటప్పుడు అవయవాలను కదలిస్తారు. ముఖంలో భావాలను పలికిస్తారు. ఇదంతా అన్ని నృత్యాలలో ఉంటుంది.'

'కాని, ఒకో నృత్యం ఒకో తీరులో వుంటుంది. భావాలను ఒక ప్రత్యేక పద్ధతిలో చూపిస్తారు.'



## బాలేనృత్యం

'యూరపులో బాగా ప్రచారంలో వున్న 'బాలే నృత్యంలో భావాలను ఎగరటం ద్వారా, గెంతటం ద్వారా చూపుతారు. నేలపై వేగంగా జారుతూ నృత్యం చేస్తారు. ఒక్కో సమయంలో కాలిబొటన వ్రేలిమీద నిలబడి, గిరగిరా తిరుగుతారు. లయతో ఆ కదలికలు చాలా అందంగా ఉంటాయి. ఈ నృత్యాలు జంటగా చేస్తారు. ఒంటరిగా కూడా చేయవచ్చు.'

తెల్లజాతి వారందరికీ సామూహిక నృత్యాలున్నాయి. వేడుకలప్పుడు విందు సందర్భాలలో స్త్రీ పురుషులు జంటలుగా నృత్యాలు చేస్తారు. జంటలు విడిపోయి, క్రొత్త వారితో జత కూడి చేస్తారు. ఇక్కడ అభినయం ఉండదు. శరీరకదలికలు ఉంటాయి. ముఖ్యంగా ఒకరినొకరు పట్టుకుని, తిరుగుతూ తాళానికి అనుకూలంగాచేస్తారు. ఈ నృత్యాలన్నీ అందంగా ఉంటాయి. లయగా ఉంటాయి.'

## నల్లవారి తాండవాలు

'ఆఫ్రికాలోని నల్లవారు పెద్ద పెద్ద డ్రమ్ములు మ్రోగిస్తూ, గెంతుతూ చేస్తారు.

ఆవేగం, ఊపు, వడి చాలా గొప్పగా ఉంటాయి. వాటి తీరు వేరుగా ఉంటుంది. ఈ నృత్యాలన్నీ ప్రాథమిక దశలో ఉంటాయి. ఇవన్నీ తాండవాలే.

'భారతదేశంలో చాలా నృత్యాలున్నాయి. ఇందులో **కథకళి, భరతనాట్యం, కూచిపూడి, వడిస్సీ, కథక్, మణిపురి** బాగా అభివృద్ధి చెందినాయి.'

'అభినయానికి భరతనాట్యాన్ని, మోహినీ ఆట్టం, వడిస్సీ,కథక్ బాగా ప్రాధాన్యత నిస్తాయి. భరతనాట్యం, కూచిపూడి, వడిస్సీ నృత్యాలు భరతుని, నందికేశుని, జాయపను అనుసరిస్తాయి. ఈ ముగ్గురూ ఏర్పాటు చేసిన నృత్య వ్యాకరణం ఈ నృత్యాలలో ఉంటుంది.'

## నృత్యవ్యాకరణం

'నృత్యవ్యాకరణం అనే పదం వాడినాను. దీని అర్థం వివరిస్తాను. జాగ్రత్తగా వినండి. భరతనాట్యం తీసుకుందాం. 'గోపాలకృష్ణుడు' అనే పదాన్ని చూసేవారికి చెప్పాలను కుందాం. అప్పుడు మురళి వాయిస్తున్నట్లు చేతులతో చూపుతారు. నెమలి ఈక తలలో పెట్టుకున్నట్లు చూపుతారు. ఆవుల మందలను కాస్తున్నట్లు మెడ మీద కర్ర ఉంచుకుని, చేతులు దాని మీద వేసుకున్నట్లు చూపుతారు. ఇలాగే ఆవు ప్రక్కన గోపాలుడు నిలబడినట్లు చెప్పాలను కుందాం. అప్పుడు చేతివ్రేళ్లతో, ముంజేతితో ఆవుముద్ర పడతారు. కుడిచేత్తో ఆవుగంగడోలు నిమురుతున్నట్లు చేస్తారు. ప్రక్కనే గోపాలుని చూపుతారు. ఇందువలన చూసేవారికి చక్కగా అర్థమవుతుంది.'

'ఇలా పశువులకు, పక్షులకు, మనుషులకు, వస్తువులకు అనేక విధాలుగా ముద్రలున్నాయి. ఇవి సాంకేతికాలని మనం ఆధునికంగా చెప్పుకోవచ్చును.'



ముద్రలు

'ఇదే నృత్యవ్యాకరణం.'

## కరణాలు – అంగహారాలు

'మనశరీరాన్ని, అవయవాలను కదలిస్తాము. నృత్యంలో అందంగా కదిలే విధంగా చేస్తారు. ఈ కదలికలను కరణాలని అంటారు. కొన్ని కదలికల సమూహాలను కలుపుకుని, మాలగా కూర్చామనుకోండి. అనగా కరణాలను కొన్నిటిని కలిపినామని అర్థం. అప్పుడు దానిని అంగహారమని పిలుస్తారు.'



'ఇలా ముద్రలు, కరణాలు, అంగహారాలు అనే పదాలు నృత్యంలోకి వచ్చాయి. ఇవిగాక యింకా చాలా పదాలున్నాయి. ఈ వివరాలు తరువాత తెలుసుకోవచ్చును.'

## చిదంబరం

'తమిళనాడులో చిదంబరం అనే పట్టణం వుంది. అక్కడ 'నటరాజస్వామి' ఆలయం వుంది. అందులో 108 కరణాలను చెక్కారు. మీరు పెద్ద వారైనాక వెళ్లి చూడండి.'

ఈ పూటకు ముగింపు జరిగింది.

పండిన మామిడి పండ్లు కోశాము. వాటిని గంపల్లో నింపి గదిలో ఉంచాము. గురూజీ కొన్ని పళ్లు కోయించి అందరికీ పంచారు. అవి తింటూ కూర్చున్నాము.

'వారు ప్రశాంతంగా చెప్పారు. ఈరోజు సిద్ధేంద్రుల వారిని గూర్చి మీకు చెపుతాను. చేతులు కడుక్కొని రండి అన్నారు.'

అందరం వారి ముందు కూర్చున్నాము.

'మీకు మొవ్వగ్రామాన్ని గూర్చి చెప్పాను. కూచిపూడి మొవ్వకు దగ్గరలో ఉంది. అది అగ్రహారం.'

'మనం పదిహేనో శతాబ్దానికి వెళ్లాలి. ఆ శతాబ్దం చివర్లో జరిగి ఉండవచ్చు. ఇంకా సరిగా కాల నిర్ణయం జరగలేదు.' అందరం ఒకరి వంక ఒకరం చూసుకున్నాము. వారు గమనించారు. వారు నవ్వుముఖంతో అన్నారు. 'నేను చెప్పింది సిద్ధేంద్రుల వారిని గూర్చి, నా ఆలోచనలన్నీ వారి మీదనే ఉన్నాయి. వారెప్పుడున్నారో యింత వరకు సరిగా తెలియలేదు. సరే! ఈవిషయం వదలి వేద్దాం.'

## కృష్ణాతీరం

'సర్ ఆర్థర్ కాటన్ అనే తెల్లదొర ఉండేవాడు. ఆయన గోదావరి నదికి ఆనకట్ట కట్టాడు. కృష్ణానదికి ఆనకట్ట కట్టించాడు. ఇలా జరగటానికి ముందు నది విశాలంగా ప్రవహించేది. వరదొస్తే ఆ నీరంతా నేలమీద పరచుకునేది. సముద్రం వైపు



కాటన్



వోర్

పరుగులు తీసేది. ఇక్కడున్న గ్రామాలన్నీ నీళ్లతో నిండిపోయేవి. పొలాల నిండా వండ్రు పేరుకునేది. పంటలు బాగా పండేవి. కూచిపూడి కృష్ణానదిపాయ ప్రక్కన ఉండేది. ఈ గ్రామంలో అందరూ బ్రాహ్మణులే ఉండేవారు. వీరంతా నాట్య విద్య నేర్చుకున్నారు. గ్రామాల వెంట తిరిగి ప్రదర్శనలిచ్చేవారు. వీరు భగవంతుని కథలు ఆడేవారు. ఇందు వల్ల భాగవతులనే పేరు వచ్చింది. కూచిపూడి వారి గురువు సిద్ధేంద్రయోగి. వీరిని గూర్చి మనకు సరియైన సమాచారం లేదు. నోటి మాటగా చెప్పుకునే కథలు మాత్రం ఉన్నాయి.'

'సిద్దేంద్రుల వారు దేశాటన చేసేవారు. అలా తిరుగుతూ కూచిపూడికి వచ్చారంటారు.


శ్రీ సిద్ధేంద్రయోగి

## సిద్ధేంద్రుడు

'సిద్ధేంద్రుడు కృష్ణ భక్తుడు. ఈయనకు నాట్యం అంటేమంచి అభిమానం. కూచిపూడి వారు యీ యోగిని బాగా గౌరవించారు. ఆదరించారు. పూజించారు. ఆరాధించారు.'

'ఆనాటి వరకూ ఆంధ్ర దేశంలో దేవదాసీలు చేసే నృత్యాలున్నాయి. జక్కుల వారి ఆటలున్నాయి. స్త్రీలు పాడే పాటలున్నాయి. అన్నమాచార్య కీర్తనలున్నాయి.


జయదేవుడు

'సిద్దేంద్ర యోగికి నృత్య కళ ప్రాణం వంటిది. తన భక్తిని కలుపుకుని ఏదైనా వ్రాయాలనుకున్నారు.'

## రాధ

'ఉత్తర భారత దేశంలో రాచక్రీడలున్నాయి. రాధా కృష్ణుల


నారాయణతీర్థులు

మీద అనేక కథలున్నాయి. జయదేవుడు **అష్టపదులు** వ్రాశాడు. వాటి నిండా రాధా కృష్ణులను గూర్చి ఉంటుంది. **నారాయణ తీర్థులనే** కృష్ణ భక్తుడుండే వాడు. ఈయన **కృష్ణ లీలా తరంగిణి** వ్రాశాడు. అన్నీ కృష్ణుని మీద పాటలే. బాలకృష్ణుని చిలిపి పనులన్నీ వర్ణించాడు.'

'తీర్థుల వారు భక్తితో పాటలు పాడేవారు. సంచారం చేస్తూ దక్షిణానికి వెళ్లారు. అక్కడే సమాధి చెందారు. నారాయణ తీర్థులది కృష్ణాతీరం. వీరు రుక్మిణీ కల్యాణం వరకు వ్రాశారు.'

## సత్యభామ

'ఆనాటి వరకు సత్యభామ గొప్పతనాన్ని ఎవ్వరూ గమనించ లేదు.



కృష్ణరాయల ఆస్థానంలో ముక్కుతిమ్మన అనే కవి ఉండేవాడు. ఆయన **పారిజాతాపహరణం** అనే కావ్యం వ్రాశాడు. అందులో సత్యభామను తీర్చిదిద్దాడు. సిద్ధేంద్రుల వారు సత్యభామను గూర్చి ఆలోచించారు. ఆమెను గూర్చి ఒకగ్రంథం వ్రాశారు.. దానిపేరు **భామా కలాపం.**'

'ఆయన ఈ

కలాపాన్ని కూచిపూడి వారికి చెప్పారు. కాని ఒక నియమం పెట్టారు. ఆడవేషాలు కూడా మగవారే వేయాలన్నారు. కూచిపూడి బ్రాహ్మణులు అందుకు అంగీకరించారు.

## శ్రీకాకుళం

'కూచిపూడికి దగ్గలోనే శ్రీకాకుళం ఉంది. ఇక్కడే **ఆంధ్రమహావిష్ణువు** గుడివుందికదా! ఈ దేవాలయంలో రోజూ నృత్య పూజ జరిగేది. ఇందు కొరకు మూడు వందల మంది దేవదాసీలుండే వారని చెపుతారు. వీరు బయటి ఊళ్లకు వెళ్ల వలసిన పనిలేదు. వీరంతా గుడికి అంకితమైనారు. ఇందువల్ల వీరిని **గుడి** చేడియలని పిలిచేవారు.'

'భగవంతుని కథలను నృత్యంతో కలిపి ఆడాలి. పాడాలి. పండితులను మెప్పించాలి. పామరులను సంతోషపెట్టాలి. ఇలా భక్తి భావాన్ని పెంచాలి. ఇందు కొరకు ప్రచారం చేయాలి. అప్పుడు గ్రామాల వెంట తిరగ వలసి ఉంటుంది. ఈ పనికి స్త్రీలు పనికిరారు. ప్రయాణ వసతులు లేని ఆకాలంలో స్త్రీలు ఈ పని చేయలేరు. పురుషులు మాత్రమే ఈపని చేయగలరు.'

## దేశదేశాలు తిరిగారు


భాగవతుల విస్సయ్య


చింతాకృష్ణమూర్తి


వేదాంతం రాఘవయ్య

'సిద్ధేంద్రుల వారు కూచిపూడి వారితో ఈ పని చేయించారు. కూచిపూడి కళాకారులు చాలా గొప్పవారు. వారు దేశ దేశాలూ తిరిగారు. హంపీ విజయనగరాన్ని గూర్చి చెప్పాను గదా! అది తుంగభద్ర తీరంలో ఉంది. అక్కడకు కూడా వెళ్లారు. రాజులను మెప్పించారు. ఎన్నో బహుమతులను సంపాదించారు. గోల్కొండ వెళ్లారు. అక్కడ వారిని మెప్పించారు. తానీషా ముందు ప్రదర్శించారు. ఆయన మెచ్చుకున్నాడు. తరువాత కూచిపూడి వారు అగ్రహారాన్ని బహుమతిగా పొందారు.'


వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి

'గోదావరి తీరం వరకు వెళ్లారు. **భీమకవి** అనే గొప్ప కవి ఉండేవాడు. ఆయన శాపం వలన కళింగ గంగు రాజ్యాన్ని పోగొట్టుకున్నాడంటారు. భీమకవి జాలిపడి మరల రాజ్యాన్ని పొందగలవని వరం ఇచ్చాడట. కూచిపూడి కళాకారుల సాయంతో ఆయన రాజ్యాన్ని సంపాదించుకున్నాడు. ఇలా వీరు కళను ఆరాధించారు. ప్రజలకూ సేవ చేశారు. భగవంతుని కథలూ ప్రచారం చేశారు. చివరకు వారు ఆడే విధానానికి **కూచిపూడి నృత్యం** అనే పేరు సంపాదించారు.

## కూచిపూడి ప్రాచుర్యం

'ఈ నృత్యం అన్ని ప్రాంతాలకూ పాకింది. అన్ని దేశాలకూ పాకింది. **వెంపటి చినసత్యంగారి** వంటి ప్రముఖులు యీ కళను బాగా అభివృద్ధి పరచారు. యిప్పటి



వెంపటి చినసత్యం



వెంపటి పెదసత్యం

కాలానికి అనుకూలంగా మార్చుకున్నారు.'

'వేదాంతం సత్యనారాయణ శర్మగారిని గూర్చి వినేవుంటారు. వీరు కూచిపూడి నృత్యం చేస్తారు. సత్యభామగా, ఉషగా కూడా ఆడతారు. అభినయం చేస్తారు. వీరికి కేంద్ర ప్రభుత్వంవారు పద్మశ్రీ బిరుదునిచ్చారు. గౌరవించారు. సత్కరించారు. ఇంకా ఎంతోమంది మహానుభావులు ఈ శైలిని అభివృద్ధి చేయటానికి కృషి చేశారు.



కోరాడ నరసింహారావు



శ్రీమతి ఉమారామారావు

తమ జీవితాలను అంకితం చేశారు. చేస్తున్నారు.'

స్త్రీలలో శ్రీమతి శోభానాయుడు, శ్రీమతి ఉమారామారావు, మొదలగువారు కూచిపూడి నృత్యకళను ఆరాధిస్తున్నారు.

'మనం కూచిపూడి వెళ్దాము. సిద్ధేంద్రుల వారి దేవాలయం చూసి వద్దాము అన్నారు.' అందరం సంతోష పడినాము.

మరోవారంలో సెలవులిస్తారు. అందరం వెళ్లిపోతాము. గురూజీ వలన నృత్యానికి సంబంధించిన అనేక విషయాలు తెలుస్తున్నాయి. సాహిత్యానికి సంబంధించిన సంగతులూ అర్థమవుతున్నాయి. ఈ రోజు ఏమిచెపుతారో?

ఇలా ఆలోచిస్తూ కూర్చున్నాను. గురూజీ ఎప్పుడో వచ్చి అక్కడ కూర్చున్నారు. నా ఆలోచనలను చెదరగొట్టలేదు. నేను వారిని చూసి ఆశ్చర్యపోయాను.

వారు ప్రేమతో అన్నారు. 'ఏమిటి?' ఆలోచిస్తున్నావు.

'ఏమీలేదండి' నేను భయపడుతూ చెప్పాను.

'నృత్య విషయాలు అర్థం కావటం లేదా?'

'తెలుస్తున్నాయండీ' నేను వినయంగా సమాధానం చెప్పాను.

'కూచిపూడి నృత్యాన్ని గూర్చి ఏమైనా తెలుసుకోవాలా?'

అప్పుడు నాకో ఆలోచన వచ్చింది. 'ఔనండీ'

'ఏమిటది?'

## పురుషనృత్యాలు

మనదేశంలో కూచిపూడి వారి మాదిరిగా పురుషులు మాత్రమే చేసే నృత్యాలున్నాయా? గురూజీ!

ఆయన ముఖంలో చిరునవ్వు కన్పించింది. 'ఉన్నాయి. చెపుతాను, మీ బృందాన్ని పిలుచుకురా' అన్నారు. నేను అందరినీ తీసుకొచ్చాను. 'స్త్రీలు, పురుషులు విడివిడిగా చేసే నృత్యాలున్నాయి. కలిసి చేసేవీ ఉన్నాయి.' గురూజీ ప్రారంభించారు.

'కన్నడ దేశంలో పురుషులు **యక్షగానాలాడుతారు.** ఈ కళ పూర్తి వికాసాన్ని యిక్కడే పొందిందని అనవచ్చును.

'కేరళలో **'కృష్ణాట్టం** 'ఉంది. **'కథకళి'** వుంది. ఇది పురుషులు చేస్తారు. **మోహినీ అట్టం** స్త్రీలు చేస్తారు.'

'ఒరిస్సా రాష్ట్రంలో **'మహరి'** నృత్యం ఉంది. **'వడిస్సీ'** ఉంది. వీటిలో లాస్యం ఎక్కువగా ఉంటుంది. వీటిలో స్త్రీలు ఆడతారు. **'సొక్కనట'**, **'ఘోట్‌పుర'** పురుషులు చేస్తారు.

ఉత్తర భారత దేశంలో కథక్ ప్రధాన మైనది. దీన్ని స్త్రీలు చేస్తారు. కాని పురుషులు కూడా ఆడతారు. **రామలీలా, నౌటంకీ, రాసలీలా** పురుషులాడతారు.'

'ఈ విధంగా సుకుమారమైన లాస్యం ఆడవారి సొత్తయింది. ఉధృతంగా తాండవం ఉంటుంది. ఇది పురుషుల భాగ్యమయింది. నాట్య మేళాలను గూర్చి చెప్పాను కదా ఆంధ్ర దేశంలో యీ మేళాలలో స్త్రీలు పాల్గొనలేదు. ఇక్కడేకాదు. భారత దేశమంతా యిలాగే ఉంది. కాని ఇప్పుడు మార్పు వచ్చింది. ఎవరికి ఇష్టమైనది వారు ఆడుతున్నారు.'

## అనుభవం అవసరం

'అబ్బాయిలూ! ఈ విషయాలపైన అభిప్రాయాలలో తేడాలున్నాయి. ఇందువల్ల ఎవ్వరేది చెప్పినా శ్రద్ధగా వినండి. ఆలోచించండి. బాగా చదవండి. ప్రపంచమంతా తిరిగి చూడండి. మీరు అనుభవం సంపాదించండి. అనుభవంతో నిర్ణయానికి రండి. పెద్దలు చెప్పారని తలలూపవద్దు. పెద్దలు చెప్పినవన్నీ నిజాలుగా ఉండవలసిన పనిలేదు. వారు కాలానికి అనుకూలంగా సలహాలిస్తారు. నిర్ణయాలు చేస్తారు. సూత్రీకరిస్తారు. సంఘానికి మేలు చేయాలని చెపుతారు. కాని, కొంత కాలం గడచేసరికి, మార్పులొస్తాయి. పెద్దలు చెప్పిందే మనకు బంధం అవుతుంది. ఇందువల్ల ఎవరు చెప్పినా జాగ్రత్తగా వినండి. మీ నిర్ణయం మీరు చేసుకోండి. ఈ పద్యం గుర్తుంచుకోండి.'



శ్రీమతి చిత్ర

**"వినదగు నెవ్వరు చెప్పిన**
**వినినంతనె వేగపడక వివరింపదగున్**
**కని కల్ల నిజము తెలిసిన**
**మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!"**

'రండి మల్లెతోట దగ్గరకు వెళ్దాం'

అన్నారు. అందరం బయలు దేరాము.

మల్లెతోటలో అక్కడక్కడా విచ్చిన పూలున్నాయి. వాటిని జాగ్రత్తగా కోయమన్నారు. మల్లె మొగ్గలను ముట్టుకోవద్దని చెప్పారు.

తెల్లగా వికసించిన పూలు కమ్మని వాసనలు గుప్పిస్తున్నాయి. వాటిని తెచ్చి అందరం గురూజీ ముందు పేపరు మీద పోశాము. వారు ఆనందంగా వాటిని చూస్తున్నారు. వారేదో చెప్పబోతున్నారని అర్థమయింది.

## కళాపుష్పాలు

'అబ్బాయిలూ! ఎవరిదో యీ పూదోట మనకు తెలియదు. ఎవరో నేలదున్నారు. అంట్లు నాటారు. నీరు పెట్టారు. తీగలు కత్తిరించారు. పాదలుగా పెంచారు. ఆకు దూశారు. నీరు కట్టారు. అప్పుడు మల్లె పాదలు పూలు పూశాయి. కోసుకు పోయినవి పోగా, కొన్ని పూలు మాత్రమే మిగిలాయి. అవి అద్భుతంగా విచ్చుకున్నాయి. అనందాన్ని యిస్తున్నాయి.'

'ఈ పూలను ముడిలో ముచ్చటగా పెట్టుకోవచ్చు. మాలగా గుచ్చి మెడలో వేసుకోవచ్చు. భగవంతుని పూజించవచ్చు. లేకుంటే వాసన చూసి అవతల పారవేయవచ్చు. ఆపైన కాళ్లతో మట్టగించవచ్చు.'

'సాహిత్యం కూడా ఇంతే. మన నృత్యమూ ఇలాగే ఉంటుంది. ఈ క్షేత్రాల్లో ఎందరో కృషి చేస్తారు. ఎన్నో కళా పుష్పాలు వికసిస్తాయి. కొన్ని కాలప్రవాహంలో కొట్టుకు పోతాయి. కొద్దిగా మాత్రమే మిగులుతాయి.'

'భాషా వికాసం కూడా యిలాగే ఉంటుంది.

విజయరావు – వనశ్రీ రావు



కొన్ని కొత్త పదాలు వస్తాయి. పాతవి వాడుకలో ఉండవు. ఇది సహజము.'

'రాలి పోయేవి రాలి పోతుంటాయి. క్రొత్తవి పుట్టుకొస్తుంటాయి. ఇది ప్రకృతిలో రోజూ జరిగేది. కాని, కొందరి కృషి వల్ల పాతవైనా కొన్ని కళాఖండాలు శాశ్వతంగా నిలిచి ఉంటాయి. సరే! మన భాషను గూర్చి కొద్దిగా వివరిస్తాను వినండి.'

'తెనుగు భాషకు ఒక ప్రత్యేకత ఉంది. మనం ప్రతి పదాన్ని, వాక్యాన్ని అందంగా పలుకుతాము. మనం రాముడు అంటే హిందీలో రామ్ అంటారు. మనం ముగించే తీరు చాలా ముచ్చటగా ఉంటుంది.'



1970 ఆగస్టు 22, 23 తేదీలలో రాజమండ్రిలో జరిగిన అభినయ సదస్సులో పాల్గొన్న కళాకారులలో

## తెలుగు ప్రత్యేకత

ఇంతేకాదు. మన భారతదేశంలో ఉన్న ప్రధాన భాషలలో ఆంధ్రభాష ఒకటి. ఈ విషయం బ్రిటిష్ వారు గమనించారు. ఆరోజుల్లో రూపాయలు, అణాలు, కానులు ఉండేవి. వాటిమీద ఒకరూపాయి. ఒక అణా, ఒకకాని అని వ్రాసి ఉండేది.'

'తెనుగును దేశ విదేశాలలో అనేక మంది ఆదరించారు. దీన్ని జాతీయ భాషగా ఉంచదగిందన్నారు. ఏభావాన్నయినా చక్కగా తెలుగులో చెప్పవచ్చన్నారు.'

'నాయకరాజులు తెలుగు వారు. వారు తెలుగును ఆదరించారు. కాని, తరువాత వచ్చిన శివాజీ వారసులు మహారాష్ట్రులు. వీరు కూడా తెనుగును మనసారా ఆరాధించారు. **శరభోజీ** కాలంలో, ప్రజలు తమిళులు. రాజు మహారాష్ట్రుడు. కాని అధికారభాష తెనుగు.'

'శరభోజీ మహారాజు (1786-1821), తెనుగులో యక్షగానాలు వ్రాశారు.

మన త్యాగరాజు వీరికాలంలోని వారే.'

'ఆతరువాత మరో గొప్ప వ్యక్తి **స్వాతితిరునాళ్.** ఈయన తిరువాన్‌కూర్ మహారాజు. ఈయనకు సంగీతమంటే యిష్టం. నాట్యమంటే ప్రాణం. ఈయనకు అనేక భాషల్లో ప్రావీణ్యం వుంది. మళయాళం, ఉర్దూ, మరాఠీ, హిందీ, తెలుగు సంస్కృతము వచ్చు. తెనుగు బాగా వచ్చు. వీరు ఈ భాషల్లో చాలా పాటలు వ్రాశారు. నృత్యాలను అభిమానించారు. ప్రోత్సాహించారు. తెలుగును బాగా అభిమానించారు.'

## బ్రౌన్

'మన భాష మీద మనకు అభిమాన ముండటం సహజం. కాని, మన దేశానికొచ్చిన ఒక బ్రిటిష్ వ్యక్తి. ఈ భాషను ఎంతగానో ప్రేమించాడు. తెలుగు నేర్చుకున్నాడు.

మన సాహిత్యమంతా తాటి ఆకులమీద వ్రాసి ఉండేది. ఘంటంతో వ్రాసేవారు. బ్రౌను దొర ఈ తాటాకు గ్రంథాలను తెప్పించారు. పండితులను కూర్చోబెట్టి చదివించారు. తప్పొప్పులు తనిఖీ చేయించారు. ఎత్తి వ్రాయటంలో తప్పులొస్తాయి. వీటన్నిటినీ సరిచూడమన్నారు. ప్రమాణంగా ఉండే గ్రంధాలు తయారు చేయించారు. వీరి కృషి లేకపోతే చాలా పుస్తకాలు మనకు ఉండేవి కావు.'

'ఈయన మన భాషకు నిఘంటువు తయారు చేయించారు. తెనుగు-ఇంగ్లీషు, ఇంగ్లీషు తెనుగు రెండు నిఘంటువులను మనకందించారు. వారిని మనం మరచిపోకూడదు. ఎప్పుడూ స్మరించుకోవాలి.'

'వేమన ను గూర్చి మీకు ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. బ్రౌను, వేమన పద్యాలను ఒక చోటకు చేర్చారు. అక్కడక్కడా పెద్దలు చెపుతుండేవన్నీ పోగుచేయించారు. పుస్తకం తయారు చేయించారు. తాను స్వయంగా యీ పద్యాలను ఇంగ్లీషులోకి తర్జుమా చేశారు.'

'ఎందరెందరో మహాత్ముల కృషి వలన కొన్ని పుష్పాలు రాలిపోకుండా మనకు అందుతున్నాయి. ఇలా మనకు అందించటానికి వారు జీవితమంతా శ్రమించేవారు. వారి సేవలను మనం మరచిపోరాదు. వారి నెపుడూ స్మరించుకోవలసిందే.'

'మీకు విషయాలను లోతుగా చెప్పలేదు. మరికొన్నేళ్ళు పోయాక ప్రతి అంశాన్ని పరిశీలించండి. అప్పుడు మన పెద్దల కృషి బాగా అర్థమవుతుంది.'

అందరం లేచాము. మల్లెపూలు తీసుకువెళ్ళి నటరాజస్వామి పాదాల వద్ద

ఉంచాము. శిరసు వంచి ప్రణామాలు చెప్పాము.

గురూజీ గొంతెత్తి పాడసాగారు.

**"శిరమున గంగాజలమున చంద్రిక**
**అందముగా నర్తింపన్**
**ముదమున గ్రీవాలంకృత నాగము**
**రుద్రాక్షల జత నాడన్**
**కంకణముల గలగలలు పాదముల**
**గజ్జలతో శ్రుతి కలుపన్**
**మందస్మిత నయనార వింధములు**
**మోక్ష సుధల నందింపన్**
**ధిమి, ధిమి, ధిమి, ధిమి, ధిమి యని తాండవ**
**దీప్తులు దిక్కుల నిండన్**
**అనిమిష భావులు అచ్చెరు వందగ**
**అంబాపతి నర్తించెన్**
**కనకాంబాపతి నర్తించెన్"**

గురూజీ ఇంతకు ముందు యీ పాట మాకు వినిపించారు. అర్థాన్ని చెప్పారు. వారు మాతో యీ పాటకు నృత్యాన్ని చేయించారు. ప్రతిరోజూ ఉదయం సాధన చేస్తున్నాము. ఇందు వలన వారు పాడుతుంటే మాకు ఆవేశం కలిగింది. కాలికి గజ్జలు కట్టుకున్నాము. మృదంగం శ్రుతి చేసుకున్నాము. అందరం కలిసి నృత్యం చేశాము. గురూజీ తాళం వేస్తూ జతులు చెప్పారు.

ఇలా సంధ్యాతాండవ మూర్తి ముందు నృత్యం చేశాము. ఆనందంతో మనసు పొంగింది. ఆవేశంతో అంగాలు కదిలాయి. అందరం ఆయన పాదాల ముందు ప్రణమిల్లాము.

ఈరోజు నటరాజ పూజ చేయాలను కున్నాము. పాఠశాలను బాగా అలంకరించాము. మామిడి తోరణాలు కట్టాము. నటరాజ స్వామి విగ్రహాన్ని ఎత్తుగా నిలబెట్టాము. మల్లె తోటల నుండి పూలు వచ్చాయి. దండలు కట్టి విగ్రహానికి అలంకరించాము. గురూజీ స్వయంగా మల్లె పూలతో పూజచేశారు. అగరువత్తులు వెలిగించాము. సువాసనలతో నిండిపోయింది. అందరం సంతోషంగా ఉన్నాం. గురూజీకి తెలిసిన వారు బంగినపల్లి మామిడి పళ్లు పంపించారు. మరో బుట్టలో

రసాలు కూడా వచ్చాయి. వాటిని కడిగి పెద్ద పళ్లేలలో ఉంచాము. మృదంగం, వేణువు, తబలా, వయొలిన్, వీణ, తాళాలు, గజ్జెలు అన్నీ స్వామి ముందుంచాము. అందరం గురూజీకి రెండు వైపులా కూర్చున్నాము. వారు అభినయ దర్పణంలోని శ్లోకాన్ని చదివారు. మేమూ గొంతు కలిపాము.

**"ఆంగికం భువనం యస్య**
**వాచికం సర్వ వాఙ్మయమ్**
**ఆహార్యం చంద్ర తారాది**
**తం వందే సాత్త్వికం శివం."**

ఈ శ్లోకాన్ని అనేక పర్యాయాలు విన్నాము. అందరం అభినయం చేసివున్నాము. ఐనా, సర్వప్రపంచాన్ని తన ఆంగికంగానూ, సర్వసాహిత్యాన్నీ తన మాటగానూ, చంద్రుణ్నీ, నక్షత్రాలనూ, తన అలంకరణగానూ చేసుకున్న స్వామి- నటరాజస్వామి- నీకు నమస్కరించ కుండా ఏకళాకారుడుంటాడు! నీవు సాత్విక స్వరూపుడవు. దేవదేవుడవు. కళామూర్తివి. స్వామీ! సాంబశివా! మా నమస్కారాలను స్వీకరించు అని తలవంచి నమస్కరించాము.

ప్రసాదం పంచి పెడుతున్నారు. మామిడిపళ్లు కోసి పంచదార చల్లారు. పచ్చకర్పూరం కొద్దిగా కలిపారు. వాటిని పంచారు. గురూజీ మా మధ్య నిలబడ్డారు. అందరం కొంచెం దూరంగా వెళ్లి కూర్చున్నాము. వారు నెమ్మదిగా ప్రారంభించారు. 'మీరంతా రేపు ఉదయం మీ స్వగ్రామాలకు వెళ్తున్నారు' అన్నారు. అందరం ఆనందంతో చప్పట్లు కొట్టాము.

'ఈరోజు మన పాఠాలలోని చివరి అంశం చెపుతాను. నిజానికి ఇది చివరి అంశం కాదు. తాత్కాలికంగా ముగిస్తున్నాను. ప్రస్తుతానికి కామా పెడుతున్నాను. మానవుని చరిత్రను గూర్చి చెప్పాను. వివిధ దశలను వివరించాను. ఆ దశలతో పాటు లలిత కళలు కూడా మారుతూ ఉంటాయి. పరిస్థితిని బట్టి మార్పు సహజం. మారలేనివి మనతో ఉండవు. క్రమేణా వాడుకలో నుండి జారిపోతాయి. వాటిని మరచిపోతాము. ఎవ్వరూ వాటిని పట్టించుకోరు.'

'అబ్బాయిలూ! ఆంధ్ర దేశంలోని నృత్యాలు చెప్పాను. నృత్యా రాధన గూర్చి చెప్పాను. దీనితో పాటు మన దేశంలోని ప్రధాన నృత్యాలను వివరించాను. ఇంతే కాదు. మన జీవితానికి నృత్యానికి ఉన్న సంబంధం కొంత వరకు విన్నారు. మన పురాణాలు మన చరిత్ర వంటివి. తీగ లాగినామనుకోండి, చెట్టంతా కదులుతుంది. ఇలాగే నృత్య చరిత్రలో చాలా సంగతులు వచ్చాయి. వాటిని చెప్పకుండా

ప్రసాద్ లేచి నిలబడ్డాడు. 'గురూజీ'! చిన్న విషయం' అన్నాడు.

'పెద్ద విషయమైనా ఫరవాలేదు. అడుగు,' గురూజీ నవ్వుతూ అన్నారు. మేమంతా నవ్వాము. ప్రసాద్ నవ్వుకున్నాడు. అతను వినయంగా అడిగాడు.

"గురూజీ ! మీరు బ్రహ్మ దేవుని గూర్చి చెప్పారు. నాట్య శాస్త్రం ఎలా వచ్చిందో వివరించారు. నాట్యం పుట్టటానికి దేవతలు ఏంచేశారో చెప్పారు. ఇలాగే చరిత్రలో మానవుని పెరుగుదలను గూర్చి వివరించారు" అతను ఆగిపోయాడు

'అడుగు. అనుమానించకు. గురూజీ ప్రోత్సహించారు.'



పేరిణి శ్రీనివాస్

'మీరు ఈ రెండు సిద్ధాంతాలతో దేనిని నమ్ముతారు? అడిగాడు.'

'ప్రసాద్ వంక చూస్తూ గురూజీ పకపక నవ్వారు. మంచిమాటే అడిగావు. నే చెప్పిన పాఠాలలో ఎక్కువ భాగం పురాణ కథలే ఉన్నాయి. పరిశోధనల ద్వారా మనవారు అనేక విషయాలు కనుక్కున్నారు. నృత్యం మానవునితో పాటు పెరిగింది. ఇందుకు సందేహంలేదు.'

## ఎందుకు, దేనికీ

'ఇక నా వ్యక్తిగత అభిప్రాయాల విషయం. నా ఆలోచనలు నావి. నేను ఆలోచించినట్లే మీరు ఎందుకు ఆలోచించాలి? మీరు పరిశీలించండి. నిర్ణయానికి రండి. నా అభిప్రాయాలను మీరు అర్థం చేసుకోండి. ఎవరు చెప్పినా విమర్శతో చూడండి. మన కళలను గూర్చి చెప్పాను. ఈ సమయంలో పూర్వం వారిని గూర్చి చెప్పాను. వారి భావాలను చెప్పాను. ఇలా చెప్పక తప్పదు. అంత మాత్రాన ఆవివరాలన్నీ నా అభిప్రాయాలని అనుకోవద్దు. మీరు ప్రతివిషయాన్నీ విడగొట్టి చూడండి. ఎందుకు? అని ప్రశ్నించండి. దేనికి? అని అడగండి. ఇలా చేస్తే మీకు అసలు విషయాలు అర్థమవుతాయి.'

'ఈరోజుతో తాత్కాలికంగా ఆంధ్రుల నృత్యారాధనను ఆపివేస్తాను.'

మరల ఒక మాట చెప్పారు. 'ఈ ముగింపు సమయంలో 'మన మహాకవి గురజాడ అప్పారావుగారు చెప్పిన మాటలను మీకు చెపుతున్నాను. జాగర్తగా వినండి' అన్నారు.

అందరం ఉత్కంఠతతో నిలబడ్డాం. వారు ప్రశాంతంగా చెప్పారు. "మానవ జీవితాన్ని నేను చిత్రించి, కళతో ఆదర్శపూరితమే చేస్తాననుకో, కవితా కళకు, నేను లొంగి ఉండవలసిన వాడినే అయినా, నాకు మానవ సమూజం పట్ల మహత్తర బాధ్యత అనేది ఒకటి ఉన్నది". ఈ మాటలు కళారంగాలకే కాదు, అందరికీ వర్తిస్తుంది.

'ఇలాగే మరో మాట చెప్పాడు.

'మరచిపోకుండా భరతముని, నందికేశునిని, జాయపను స్మరించండి. ఇలాగే ఎందరో మహానుభావులున్నారు. వారంతా నృత్య కళను పెంచారు. పోషించారు. వారందరికీ జేజేలు చెప్పండి' అన్నారు.

'గురూజీ లేచారు. నేను వారి ముందుకెళ్ళి అన్నాను. గురూజీ! ఈ సమయంలో మేమంతా మీకు నమస్కరిస్తున్నాం. దయతో స్వీకరించండి. మమ్మలను ఆశీర్వదించండి.'

వారి ముఖం వాత్సల్యంతో నిండిపోయింది. కొంత మంది పూలమాల తెచ్చి

వారి మెడలో వేశారు. మల్లెపూలు వారి పైన చల్లారు. అందరం తలవంచి నమస్కరించాము. వారు ప్రశాంతంగా నిలబడ్డారు. ముఖంలో చెప్పలేని ఆనందం ఉంది. కుడి చేతిని పైకి లేపి మమ్ములను ఆశీర్వదించారు. నేను నమస్కరిస్తూ నిలబడ్డాను.



కుమారి సీత